# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆంధ్రభోజుడు

పదునొకండంకముల

## నాటకము



గ్రంథకర్త:

పరాంకుశం వేంకట నరసింహాచార్యులు

బాలసరస్వతి శతావధాని

కారుమంచి

1969

# ఉపోద్ఘాతము

క్రీస్తుశకము పదునైదవ పదునారవ శతాబ్దులలో విద్యానగర సామ్రాజ్యమును మహోచ్ఛదశలోనికి గొనిపోయి దక్షిణాపథమున మధ్యాహ్న మార్తాండునివలె ప్రకాశించిన యాంధ్ర భోజుడగు శ్రీ కృష్ణదేవరాయ సార్వభౌముని చరిత్ర నెరుగని యాంధ్రులుండరు. ఆ మహాపురుషుని చరిత్రయే యీ నాటకమునకు ప్రాణము — నా ఈ గ్రంథమును విని అవసరమైన సలహాల నొసగిన సుప్రసిద్ధ సాహిత్య వేత్తలు, సాహితీసమితి అధ్యక్షులు శ్రీ స్వామి శివశంకరులకును, ఈ గ్రంథము నచ్చొత్తించునపుడు నాకన్నివిధముల తోడ్పడిన మన్మిత్రులు మల్లంపల్లి వీరేశ్వరశర్మ గారికిని ఈ గ్రంథమును తగినంత త్వరలో ప్రీతితో నచ్చొత్తింపజేసి సకాలమునకు మా కందించిన జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్-గుంటూరు వారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు—

ఇట్లు
గ్రంథకర్త.





కృతిభర్త

# డా॥ శ్రీమాన్ గంజాం రాఘవాచార్యులు, M. B. B. S.

## గారి

## వంశక్రమము

శ్రీమహిళానివాసము, ప్రసిద్ధుడనంతుడు పవ్వళించి, ప
త్నీమణులొత్తబాదముల, దివ్యసుఖానుభవమ్ము నొంధదు, మా
ధాముడు, బద్మనాభునికితావు సముద్రతటమ్ము బెద్దగం
జాము చెలంగు, నిర్జరులసంఖ్యముగా గొలువన్ద్రిసంధ్యలన్॥

ప్రాక్సముద్రతీర పావనక్షేత్రమౌ
గ్రంధిపురిని, విష్ణు, గమలనాభు
నర్చనమ్మొనర్చియలరిన పూర్వులు
విఖనసర్షి శిష్యవృత్తివారు ॥

వారుగంజామువారన - వాసిగాంచి
నిష్ఠమెయివైదికాచార నియతితోడ
నయ్యనంతుని బద్మనాభాంకుగొల్చి
బ్రజలమన్ననలకు గడు బాత్రులైరి.

పుత్రపౌత్రులుగడువృద్ధి పొందపొంద
దన్యగోత్రమ్ము తామరతంపరగుట
నంగవోల్సిమనెల్ల వ్యాపకముజెంది
యెన్నియోయూళ్ల నివసింపనేగినారు॥

చిన్నపెద్దగంజాముల జెంతనున్న
దేవరంపాడు చందలూర్పావనమగు
గొనసపూడియునాడిగా - గుదురుకొనిరి
గ్రామములలోన హరియర్చకత్వమందు॥

ఆతపోధనులార్షవైద్యమున ఘనులు
గాన చరకాదిఋషుల వాక్యములదెలసి
నాడిగురుతింపె రుజ్నిదానంబు సరిగ
జేసి యౌషధదానమ్ము సేయుచుండ్రు॥

గ్రామజనులకు దలలోనగల్గునాల్క
పోల్కి స్వార్థమ్ములేక సంపూజ్యులగుచు
త్యాగధనులయి సద్గురుత్వప్రశస్తి
కష్టసుఖములయందు భాగస్థులైరి॥

గంజాము నామకాన్వయ
సంజాతులి, లెచటనున్న సంపమెతామై
రంజిలుచుందురు - త్యాగులు
కంజాయతనయనుగొల్చి ఘనులెల్లపుడున్.

దేవరంపాటిలో దేవతామూర్తియై
ప్రజలచే మన్నింపబడుచునున్న
నారాయణాచార్యనామున కా హరి
పంచాయుధమ్ములభాతి, నైదు
గురుపుత్రకులు, వేదకోవిదు లాగమ
ధుర్యులు - వేంకటాచార్యులనగ
నరసింహయార్యులు - బురుషోత్తమాచార్యు
లన యనంతార్య కృష్ణార్యులనగ

వెలయుచుండిరి యందులో విదితవైద్యు
డైన పురుషోత్తమాచార్యులరిగె దత్తు
కొమరుడగుచును జ్ఞాతికి గొనసపూడి
నామకగ్రామమునకు - విన్నాణమొప్ప॥

వరలు నాయుర్వేదవైద్యమ్ము సంప్రవీ
ణతగాంచి ప్రజల మన్ననలనొందె
నియమానజపతపోనిష్ఠాగరిష్ఠుడై
భగవదనుగ్రహ పాత్రుడయ్యె
వశ్యవాక్కనుచు దా బల్కినమాటలు
జరుగ మిగులయశమ్మునొందె
సర్వవేళల దైవసన్నిధి నర్చనా
కార్యమందుండి సౌఖ్యంబుగాంచె॥

భళిర పురుషోత్తమాచార్య బాడబేంద్రు
మహిమ వర్ణింప సామాన్య మానవులకు
సాధ్యమాయని యెల్లరు సన్నుతింప
వాసికెక్కెనా జనపదవాసులందు॥

సలలితహృదయుం డతడు
జ్జ్వలరూప వయోగుణాది సంపన్నను న
య్యలమేలమ్మను - విధి బెం
డిలియై సంతతినిగాంచె నిర్మలమతులన్॥

ఆ మహానుభావు డలమేలమాంబ నా
సాధ్వి బెండ్లియాడి సాటిలేని
ధైర్యమున గృహస్థధర్మమ్ము నడపుచు
నొక్కపుత్రి బుత్రు నొకనిగాంచె॥

ఆ మహనీయుని, నిరత త
పోమహిమకు ఫలమసంగ బుట్టెనొకండే
శ్రీ మహితుడైన బుత్రుడు
శేముషికిన్ నిలయుమతడు శేషార్యుడన్నన్

సుహృద్ధరణయందు సూర్య తనూజుని
జెప్పి శేషాచార్యు జెప్పవలయు
నహహా! బంధుప్రీతి నా భరద్వాజుని
జెప్పి శేషాచార్యు జెప్పవలయు
ఆత్మీయ సేవయందా సుమిత్రాత్మజు
జెప్పి శేషాచార్యు జెప్పవలయు
నాప్తుల మన్నింప నా ధర్మతనయుని
జెప్పి శేషాచార్యు జెప్పవలయు.

వంశగౌరవ రక్షణా వసరములను
శ్రేష్ఠు నలచక్రవర్తిని జెప్పి, వెంట
జెప్పగాదగు ధర్మాత్ము శేషయార్యు
ననగ బ్రస్తుతి కెక్కిన య్యనఘుడవని॥

సీతాదేవిని, రాఘవు
డాతత మోదమున బెండ్లియాడిన మాడ్కిన్
సీత మనామక సాధ్విని
బ్రీతిన్గ్రహించె, దాను బెండిలియాడన్॥

మాన్య సీతమాంబ మాతయుం దండ్రియు
దీవి వంశమందు దేజరిలుచు
పేరుగన్నవారు, చీరాల పురమున,
నచ్చమాంబ - జగ్గయార్యులనగ॥

చిన్నారి పొన్నారి చిఱుత వయస్సున
గాంధర్వ విద్యకై గాంక్ష సేసి
యెరికిం జెప్పక యేగి తంజావూరు
నందు విద్వాంసుల యండనుండి
సంగీతశాస్త్ర ముత్సాహియై నేర్చి, వీ
ణావాదనమున విన్నాణ మొప్ప
నభ్యాస మొనరించి యత్యంత విద్వాంసు
డై గృహమ్మున కప్పుడరుగుదెంచి

గానకళ నుద్ధరించి - సన్మానమంది
కీర్తిచంద్రికల న్వెలిగించి యాంధ్ర
దేశమెల్ల నిండించినధీ మహితుడు
శ్రీ జగన్నాథ విఖనో మనోజసుండు.

అతీవ్ర వ్రతుడౌ - సం
గీత మహావిభుని వల్లకీ రావమునన్
ప్రీతిన్బెరిగిన బిడ్డయు
సీతమ, సహధర్మచారిగద, శేషార్యునకున్॥

అట్టి భవ్యాత్ములౌ నాదర్శదంపతు
లకు జనియించిరి ప్రకటయశులు
త్రేతాగ్నులట్టుల దివ్యమూర్తులు ముగ్గు
రాత్మజు లిర్వురు నాత్మజలును
రాఘవాచార్యుండు - రమ్యుండు - జ్యేష్ఠుడీ
కృతిభర్త డాక్టరు - కీర్తనీయ
మూర్తి, రెండవవాడు పురుషోత్తమాచార్యు
డా మీద నారాయణార్యుడనగ.

ధన్యజీవులు బీదసాదలను గాంచి
జాలిపడువారు తమతమ శక్తికొలది
సాయమొనరించువారు భైషజ్యమందు
నేర్పుగలవారు - కళల మన్నించువారు॥

సత్త్వగుణమూర్తి రాఘవాచార్యుడపుడు
పూత - నాత్రేయగోత్ర సంజాతయైన
ప్రియననంత లక్ష్మ్యంబికన్ పెండ్లియాడె
పార్వతిని శంకరుండు చేపట్టి నటుల॥

ఆ పావన దంపతులకు
నేపున బుత్రకులు మువ్వురే పురుతనయల్
శ్రీ పతిదయ జన్మించిరి
ప్రాపింపగ బుత్రపౌత్ర భాగ్యశ్రీలున్॥

శ్రీమదనంతదేవుని విశేషదయార్ద్ర కటాక్షపంక్తిచే
నీమహనీయకాపురము నిత్యనవోదయమై మహత్తుచే
సేమముచే ధనాధికతచేత సుపుత్రకపౌత్రమండలిన్
దామరతంపరైసతము ధన్యతజెంది ప్రశస్తిగాంచుతన్.

మంగళంమహత్

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

శ్రీరస్తు ॥ శుభమస్తు ॥ అవిఘ్నమస్తు ॥

# అంకితము

శ్రీ, వైదుష్యములు స్వయం
బా వర్ధితములుగ, నేమహామహుడెంతేన్
గావించె, దీన మానవ
సేవ కళాశాలబొంపుసేసెడిసేవల్.

గంభీరహృదయుండు, కారుణ్యమూర్తి ని
జాం తరంగంబు సుధాలయంబు
రాజోచితము ఠీవి - రమ్యహాసుండు లా
ఘవమెట్టి యెడలను గాంచలేము
వాత్సల్యనిధి పేదవారిపై, వైదికా
చార నిష్టన్ప్రీతి సలుపువాడు
ఆర్యసూక్తుల యెడ నధిక విధేయుండు
యం.బి బి యస్-డిగ్రికందమిచ్చు

డాక్టరుగ వంగవోలుపట్టణమునందు
ముప్పదేండ్లుగ యశమంది బొలుచువాడు
అట్టినాప్రాణదాతకు నంకితముగ
నిత్తునీపొత్తమును బ్రీతిహత్తుకొనగ॥

***ఆపదుద్ధారకా ! రాఘవాచార్యా !!***

అన్యుడవా ? మేనల్లుడ
వన్యవరులకన్నమిన్న వని యిడితి నసా
మాన్య కృతజ్ఞత, మత్కృతి
కన్యకనీ - షష్టిపూర్తికౌతుకవేళన్॥

మంగళంమహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కృతి సమర్పణము



కృతికర్త :
బాలసరస్వతి శతావధాని
పరాంకుశం వేంకట నరసింహా
చార్యులుగారు

కృతి నందుకొనువారు ;
డాక్టర్ గంజాం రాఘవాచార్యులు
యం. బి. బి. యస్. గారు
వారి ధర్మపత్ని
శ్రీమతి అనంతలక్ష్మమ్మ గారలు

# ఈ నాటకమున వచ్చు పాత్రలు



## పురుషులు

సూత్రధారుడు—

మారిషుడు—

శ్రీ విబోధానందస్వామి— మహాపండితుడు-గురుకులాచార్యుడు

రాయలు— విద్యానగర సార్వభౌముడు - (కథానాయకుడు)

రామకృష్ణకవి— రాయల సహాధ్యాయి

తిమ్మరుసు— మహామంత్రి

శ్రీమత్తాతాచార్యులు— రాజగురువు, పండితుడు

అల్లసాని పెద్దన—
నందితిమ్మన—
ధూర్జటికవి—
మాదయగారి మల్లన—
కుమారభట్టుమూర్తి—
} కవిదిగ్గజములు

దామోదరుడు— ఆశుకవి

ప్రతాపరుద్ర గజపతి— కటకము ప్రభువు

కుమారవీరశ్యామలరాయలు— మైసూరుప్రభువు

మరియు స్వామివారి శిష్యులు— వందులు, మాగధులు, వైతాళికులు- భట్టులు- ప్రతీహారులు- సేవకులు- కార్యదర్శులు- లేఖకులు- దౌవారికులు- పండితులు- పురోహితులు- వేదవిదులు- శిష్యులు- చిత్రలేఖకులు- మొదలగువారు వత్తురు.

# స్త్రీ లు

తుక్కాదేవి— (అన్నపూర్ణాదేవి) కటకపు ప్రభుని పుత్రిక— కథానాయిక

పద్మావతీదేవి— కటకప్రభుని రాణి తుక్కాదేవితల్లి

పార్వతీ-భానుమతి— తుక్కాదేవి చెలికత్తెలు

మణిమంజరి— మహావిద్వాంసురాలు-సర్వస్వవేదిని

తిరుమలదేవి— మైసూరుప్రభువు పుత్రిక - రాయలరాణి.

అవసరమునుబట్టి చామరగ్రాహిణులు-ప్రతీహారిణులు-కంచుకులు-వారకాంతలు- ప్రక్క-వాయిద్యముల వాయింపువారు - దాసికలు-మరికొందరు వత్తురు.



ఓమ్

# ఆంధ్రభోజుడు

## ( నాటకము )

---

### ( నాంది )

శ్రీరమణీ విభుండు, సరసీరుహనేత్రుడు, హేమచేలు డం
భోరుహవైరి వంశమణిభూషణు, మార్తశరణ్యమూర్తి, దు
ర్వారవిరోధిభంజన విభాసితకీర్తి, మహానుభావు, డిం
పారగ, గృష్ణదేవుడు, కృపానిధి, యెల్లర బ్రోచుగావుతన్.

మాతృదేవికి జెఱబాపి, మధురగీతి
కాలహరి విశ్వముందేల్చి కాలయవన,
దళన, కాళింగమర్ధనాదుల నొనర్చి
విజయుడైపొల్చు, శ్రీకృష్ణవిభుడు వెలయు.

( నాంద్యంతమున సూత్రధారుడు పుష్పాంజలిం జల్లి )

అహో! విబుధగణాలంకృతమును–గురువరానుగ్రహ సమగ్రమును – సుమనోభాసితమును – కవికంఠీరవాక్షీణకటాక్షరక్షితమును–రసజ్ఞశేఖర సమూహాబహుళమునగు నీ పరిషన్మండలము – కడుంగడు హృదయాహ్లాదకారియై, గగనమండల శోభం దీపించుచున్నది–చిత్రాతిచిత్ర భాషణా నిపుణులగును నహంభావముతోడి యన్యోన్య జిగీషచే నసహ్యావేదనల గలిగించుచున్న భక్ష్యపానీయాది విక్రేతలగు బాలకుల తండముల వెగటగు నఱపులును–కర్బనద్వ్యమ్లజిద మిశ్రిత జలగర్భకాచ

పాత్ర (సోడా, గళనిక్షిప్త కాచ గోళముల నూడగొట్టుటచే గలుగుచున్న కఠోరధ్వనులను – వివిధదేశాసిత నానావిధ ధూమశకటజ్వాలితముఖనిర్గతములై, యాదరింబెట్టిన మూషక నిలయరంధ్రంబులందుంబలె రంగస్థలంబెల్ల నిండి, సామాజికలోకంబు నుక్కిరిబిక్కిరిసల్పుచున్న సర్వవ్యాపక ధనంజయు ధ్వజసమూహా దండయాత్రలును – నిదికెంతయు జిరాకు గల్పించుచు, గుణదోషమిశ్రితమగు సృష్టిక్రమము నందలి వైచిత్రిని, – దృష్టికి దెచ్చుచున్నవి.

(సభనెల్ల బాఱజూచి) వాహ్వా! వేరువేరు విభాగములుగా గూరుచుండ నేర్పాటులొనర్పబడిన యీ నాటకశాలయందలి – పురుష తరుణీ కక్ష్యలంగాంచిన, దివారాత్రవిభాగముచే బ్రకాశించు, దినము పోల్కి శోభాయమానముగా నున్నది – అది యటులేగదా!!

ప్రథితజనఘోషణములతో, ప్రబల ధూమ
పుంజములతో, దివసమౌ బురుషకక్ష్య
మల్లికావాసితంబు జాహోల్లసితము–
నిశవలెన్ శోభగను కామినీసదస్సు

(అటునిటు పాఱజూచి) నాతోడికుశీలవులెవ్వరు నిచటికింతదనుక వచ్చినట్లగుపింపరు – కర్తవ్య నిర్వాహణమునం దింతటి నిర్లక్ష్యము సహింపరానిది సుమా!

(వినయము నభినయించి) పౌరప్రధానులచే నాజ్ఞాపింపబడితిమి గదా! "ఏతద్వసంతోత్సవసమయ సమాహూతులై యేతెంచియున్న, రసికవతంసములగు నీ మహాజనుల హృదయముల నుప్పొంగింపజేయ గలదియు, 'నవరససమహితమును,' ఆంధ్రదేశాధిక్యమును – ఆంధ్ర సారస్వతౌన్నత్యమును జాటునదియును, ఆంధ్రులకు గర్వకారణమగు నొక సార్వభౌముని విజయగాధను,నాటకరూపమున బ్రదర్శించి, మెప్పు వడయదగినది" అని – ఏతన్మహాకార్యము నెట్లు నిర్వహింపగలనా? ఇంకెట్లు కృతకృత్యుడను గాగలను? అని నే గలవరపడుచుండ, –

ఈ కూడినసభఁగాంచినదాది మరింత వ్యాకుల మందుచుండ, నాతోడి కుశీలవు లెటనుండిరో వారిజాడ యేమియు గనుపట్టదే - కర్తవ్య పాలనమునుగూర్చి నే నెన్నిదినములనుండియో హెచ్చరింపుచున్న దాని కిదియా ఫలము! (విసుగుతో తెరవైపుగాంచి) మారిషా!

(తెరలో) ఆ—

సూత్రధారుడు :

ఎటనుంటివి - ఇటు రమ్ము!

మారిషుడు :

(ప్రవేశించి) బావా - యేమాజ్ఞ ?

సూత్రధారుడు :

(హస్తముతో నిర్దేశింపుచు) చూచితివిగదా! నిండిన యీ రసికసదస్సును ? శిరసావహించి నెరవేర్పదగిన పౌరప్రధానుల యానతిని మరచి మీరందరెట కేగియుంటిరో దెలియజాలనైతిని.

(అర్ధోక్తిలోనే) మారిషుడు :

(విస్మయముతో) అదియేమి బావా! యట్లనుచుంటిరి ? మీరు నాందియం దొనర్చిన సూచన నూతగా గొని. మా సోదరి - సర్వము నాయత్తపరచి, ప్రదర్శనమునకు సిద్ధముగా నున్నదిగదా! ఇంకను మీరింత యసంతృప్తులగుట యేలనో తెలియకున్నాడను.

సూత్రధారుడు :

(విస్మయము) నేను నాందియందేదియో సూచించి యుంటినా ? దాని నూతగా గొని మీ సోదరి ప్రదర్శనమున కాయత్తపరచి సిద్ధముగానున్నదా! ఎంతటి యాశ్చర్యము ? సంగళా... యను నూహతో నాందియం దిష్టదైవప్రార్థనమేగదా నేనాచరించినది ? ఇందు మీ సోదరి గుర్తించిన సూచన యేమి ?

మారిషుడు :

దుష్టశిక్షణ శిష్టరక్షణములును - కాళింగమర్దన కాలయవన దళనములు - మొదలగు గొన్ని సూచనలు జేసియుంటిరిగదా !

సూత్రధారుడు :

(భ్రూకుటిలో యోచింపుచు) అగును అవి శ్రీకృష్ణదేవుని మహా కార్యములు -

మారిషుడు :

( నవ్వుచు ) అగును - ఆ శ్రీకృష్ణదేవుని మహాకార్యముల బ్రకటించు నాటకమే నేను మా సోదరి ప్రద్యుమ్నమున కాయత్త పరచినది !

సూత్రధారుడు :

(కోపముతో ఆకాశము పలక్షించి) దుర్భరము దుర్భము -

మారిషుడు :

(నవ్వుచు) ఇందంతగా భరింపరాని విషయమేమున్నది బావా!

సూత్రధారుడు :

(ఆగ్రహముతో) లేదా మరి ? ఆంధ్రసారస్వతపోషకుడగు నొక సార్వభౌముని కథను చారిత్రక నాటకముగా బ్రదర్శింప, పౌరముఖ్యుల యానతియై యుండ, పౌరాణిక నాటకమునకు నేను సూచన యొనర్చితి నని యాయత్తమగుట -

(అర్ధోక్తిలోనే) మారిషుడు :

(పకపక నవ్వుచు) పప్పులో కాలువేసితివి బావా ! మే మాయత్తపరచినది కంసదమనుడగు పౌరాణిక శ్రీ కృష్ణదేవునికి సంబంధించిన నాటకము గాదు-

సూత్రధారుడు :

(భ్రుకుటి విస్మయములతో) ఆ - కాక ?

మారిషుడు :

కాళింగులనెల్ల మర్దించి, కాలయవనుల విదళన మొనరించి, భరతఖండమందెల్ల జైత్రయాత్రసాగించి - కవిపండితుల నష్టదిగ్గజ నామమున బోషించుచు - సకల కళాకుశలుర కాశ్రయదాతయై - స్వయము చిత్రలేఖకుడై, కవియై, గీర్వాణాంధ్రభాషల నెన్నియో యుద్గ్రంధముల రచించి, ఆంధ్రభోజుడన వినుతికెక్కిన - విద్యానగర సార్వభౌముడగు శ్రీకృష్ణదేవునికి సంబంధించినది !

సూత్రధారుడు :

(ఆనందాతిరేకమున) అవురా ! అటులనా? - శహబాష్ ! మీ సోదరి యఖండశేముషికివే నా జోహారులు - తినకయే రుచులందెల్ప గల తిమ్మరుసుమంత్రివర్యునివలె మీ సోదరి తనప్రజ్ఞను వెల్లడించినది- ఇంతకును, నాటక నామము ?

మారిషుడు :

ఇదే వచింపుచున్నాడను -
అన్వర్ధనామమే - "ఆంధ్రభోజుడు" అని -

సూత్రధారుడు :

(సాలోచనగా) రచియించిన కవి యెవరు ?

మారిషుడు :

శ్రీ మదౌఖేయసశిష్యపరంపర
నత్యంత ప్రాముఖ్యమందినట్టి
యాత్రేయనామకగోత్ర భాసురము - బ
ధాంకుశ వంశమయ్యబ్ధిచంద్రు .

వేంకటరమణాఖ్య విబుధుని - ధర్మప
త్ని గర్భశుక్తి, ముత్తియమువోలె
జననమ్ము నొంది - యొజ్జల యనుగ్రహమున,
నాంధ్రగీర్వాణమ్ము లభ్యసించి

కవితలల్లుచు - పండితగణములలర -
శతవధానాది - రీతుల సల్పనేర్చి -
విదితబాలసరస్వతి బిరుదమంది
నట్టి వేంకట నరసింహయాఖ్యుడతడు

సూత్రధారుడు :

ఈ కవి యే ప్రాంతమున నివసించువాడు ?

మారిషుడు :

గుంటూరు సీమయందలి, వంగవోలుపట్టణప్రాంతమున కారు మంచి నామకజనపదమున నివసింపుచుండును –

సూత్రధారుడు :

(స శిరఃకంపము) నిండియున్న యీ పండిత రసికపరిషణ్మండలమును ఈతనిరచన రంజింపజేయజాలునా ?

మారిషుడు :

అది నే నెట్లు చెప్పగలను బావా ? ఈ కవియే – తనకవనమును గూర్చి యీ నాటకమునం దిట్లు చెప్పికొనియున్నాడు.

"రసికులు, పండితు, లీ కృతి
పసగని, తమ మెచ్చుకోళ్ళు పంపెడుదనుకన్
అసదనియే భావింతును
బొసగునె తన మెప్పు తనదు పొత్తమ్మునకున్ ?" అని,

సూత్రధారుడు :

అట్లైన నిక ఫలితము. పరిషదధీనము – సమయమునకు మన కభిలషించిన నాటకము లభించినదనియే సంతసింతము - మీ సోదరి రాజాలకపోయినందులకు నీవైన నీ వసంతమునుగూర్చి యించుక పాడి సభ నానందపరుపుము–

మారిషుడు :

మారుతములు వికసితసుమ -
సౌరభముల గొల్లగొనుచు. జగతిజరించున్
జేరు సుమరజము, మాధవు
పేరిట గంధవొడిజల్లి, ప్రియమొనరింపన్

"తొలుదొల్త బండుటాకులు రాలె మహిమీద -
విలసిల్లె మలయాద్రిమలయునీద
ఒక్కొక్క కెందలిరు దయించెదరు రాజి -
దోరమై దనరెకంతుని వరాజి -
చెలగెదిక్తటుల గోయిలరావముల సౌరు
మెదలాడె గండుతుమ్మెదలబారు -
రహిమీరె నపుడు మరందధారల జెన్ను
పొలుపొందె మెఱుగు బుప్పొడుల హెన్ను

పొన్నగున్నలు సురపొన్నలన్నువలగు
క్రొన్ననల జెన్నులలరిన - విన్నెనసగె
నెన్న యన్నన్న - యీ చైత్ర మెంతవింత
సంతస మొనర్చె, రమ్యమై జనులకెల్ల."—

చాలునా ? బావా ?

సూత్రధారుడు :

కాలహరణమునకు పెద్ద లోర్వరు – ఇకమనమేగి ప్రదర్శన మారంభింపజేయుదముగాక రమ్మా –

మారిషుడు :

(నవ్వుచు) ప్రదర్శన మింతకుముందె యారంభింపబడినది - చూడుము. సింహాచలప్రాంతాశ్రమమున, శ్రీ విబోధానందస్వామి వారి చెంత గూర్చుండి, రాయ లేకాగ్రతతో - (శ్రీ) స్వామి వారు చెప్పుచున్న రహస్యముల నాలకించుచున్నా రరుగో -

సూత్రధారుడు :

(ఆతురతతో) అట్లైన మనమిక నిచట నొక్క క్షణమైన దడయరాదు. పోవుదము రమ్ము -

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.



ఓమ్

# ఆంధ్రభోజుఁడు

## (నాటకము)



### రంగము ౧

స్థలము – సింహాచలప్రాంతారణ్యమునందలి శ్రీ విబోధానందస్వామివారి ఆశ్రమాంతర్భాగము–

సమయము – అపరాహ్ణ మతిక్రమించిన కాలము–

(వేర్వేరుగా కృష్ణాజినములపై గూరుచుండి, శ్రీ విబోధానందస్వామియు శ్రీ కృష్ణదేవరాయలును - రామకృష్ణకవియును - సంభాషించుచు ప్రవేశింతురు.)

శ్రీ విబోధానందస్వామి :

(రాయలతో) వత్సా, మా మిత్రరత్నము తిమ్మరుసుమంత్రి వ్రాసియంపిన లేఖ నేడందినది – అందలి విషయముల దెలుపుదమను నభిప్రాయముతో మిమ్ము రావించితిని. లోగడ మీ పెదతల్లి కుమారుఁ డగు వీరనరసింహరాయ సార్వభౌముడు దీర్ఘవ్యాధిచే మరణాపన్నుఁడై యుండి, నిన్ను ప్రాణములతో నుండనిచ్చినచో పసివాడగు తన పుత్రునకు తనమరణానంతరము, నీవు రాజ్యము దక్కకుండ జేయుదువేమో యను దురుద్దేశమున,నిన్ను జంపింప దిమ్మరుసుమంత్రి కాజ్ఞయిచ్చుటయు– చక్రవర్తి లక్షణోపేతుడవగు నిన్నుజంపించుట కిష్టములేక, రహస్యముగా నీ మిత్రుడగు నీ రామకృష్ణకవితోగూడ, నిన్ను నా యాశ్రమమునకు జేర్పించి, విశ్వాసపాత్రులగు కొందఱ రంగరక్షకులగూడ నంపి,

న సస్త్రవ్యయములను గోప్యముగ భరించుచు, నిన్ను జంపించితినని నీ యన్నగారితో జెప్పి, మారువేసముల మిమ్ముంచట నా శిష్యవర్గ ముతో గూర్చియుంచుటయును - మీ యన్నగారావ్యాధితో మర ణించుటయు, మన మెరిగిన విషయమేగదా! కొలదిరోజులక్రిందట మీ భ్రాతృపుత్రుడగు నా బాలకుడుగూడ ప్రబలమగు వ్యాధిచే వసు ధ్రలబాసినాడట - అంతట సామంతదండనాధాది ప్రణిధులును - రాజ్యమునందలి ముఖ్యులగు ప్రజానాయకులును-గూడి పెద్ద సభజేసి రాజవంశము మూలఛిన్నమైనందున. నీ సామ్రాజ్యమిక నెవ్వరి కప్ప గింపవలయునో దీని కెవ్వరైన వారసులు గలరో లేరో? ఇత్యాది విషయములపై దీవ్రముగ చర్చల నొనర్చుచుండ, క్రమముగా శ్రీకృష్ణ దేవరాయలు జీవించి యుండెననియును, ఆతడిప్పుడు శాస్త్రవిశారదుడై చతుష్షష్టి కళాకుశలుడై, వివిధాయుధప్రయోగదక్షుడై, రాజనీతి నిపుణుడై, రాజ్యపాలన కెల్లవిధముల సర్హుడై, యుండెననువార్త వారిలో నెటుల వెల్లడి యయ్యెనోగాని, జలముమీది తైలమువలె వ్యాపించెనట - దాని సత్యాసత్య నిర్ణయ మొనర్చుకొన వారెల్లరును మహామంత్రి తిమ్మరుసు బ్రార్థింప, వారు సర్వమును దెలిపి కర్తవ్య నిర్ణయమునకు వారియందే భారముంచిరట.

రామకృష్ణకవి :

(విచారముతో) అయ్యో పాపము! ఆరాజబాలకుడు దుర్వ్యా ధిచే మరణించెనా? ఎంతఘోరమెంతఘోరము,

రాయలు :

(విచారబాష్పార్ద్ర నేత్రములతో మౌన మవలంబించును)

స్వామి :

"నాఽసతోవిద్యతేభావో - నాఽభావోవిద్యతేసతః'' గదా!!

నీవింకను జీవించియున్నందులకు వారెల్లరును పరమానంద మొందిరి, తక్షణమే రప్పించి సార్వభౌమునిగా నభిషేకమొనర్ప వేడు

కొనిరట. అందుపై తిమ్మరుసుమంత్రి యీ జరిగినదెల్ల వ్రాయుచు, కొలది దినములలో దగిన బరివారము నంపుచుంటిమనియును, మీ యిర్వురను బ్రయాణముజేసి పంపుమనియును, వ్రాసియున్నాడు.

రామకృష్ణకవి :

తమయానతివలెనే తిమ్మరుసుమంత్రి యానతియు మాకు శిరోధార్యమేగదా.

రాయలు :

సద్గురుపాదసేవాభాగ్యమునకు దూరమగుదుమను విచారము మాత్రము బాధించుచున్నది.

రామకృష్ణకవి :

సర్వజ్ఞమూర్తులగు తమ శుశ్రూష యొనర్చి, యెన్నియో విషయముల దెలిసికొంటిమి. యింకను నెన్నియో దెలిసికొనదగినవికలవు. చాల సందేహములు తీరకయే మేము తిరిగి వెళ్ళవలసివచ్చెనను విచారము మమ్ము బాధింపకమానదు.

స్వామి :

వత్సలారా ! సర్వజ్ఞమూర్తి యా పరమేశ్వరు డొక్కరుడు మాత్రమే! తదితరుల మగు మనమెల్లరము నల్పజ్ఞులము. సమాధానములు లభించుకొలదిని సందేహములు గలుగుచునే యుండుట సహజము. అందుకొఱకెల్ల కాలమును మానవుడు గురుకులవాస మొనర్ప నక్కఱలేదు. సుఖముగా జీవయాత్ర సాగించుకొనుచు, ననుభవము వలనను, పెద్దల సాంగత్యము వలనను సందేహముల నివారించుకొనుచుండుట వాంఛనీయము.

రాయలు :

తమయాజ్ఞ కెదురాడజాలము. (తలవంచును)

స్వామి :

దుఃఖబహుళమగు సంసారము నానందదాయకముగా జేసికొని, అహంకార మమకార తృష్ణా వ్యామోహాదుల నదుపులో నుంచుకొని సుఖమందుటయే, విద్యార్జనకు ఫలము. అంతకుమించిన విద్యనే మీరు నేర్చియున్నారు. అరాచకమగు నొక మహాసామ్రాజ్యము నీకొఱ కెదురుచూచుచున్నది. దానిం బాలించుకొనుచు, పెద్దపెద్దసందియము లేవైన యాదృచ్ఛికముగా గలిగిన విద్వాంసుడగు మీ మంత్రి తిమ్మరుసు వలన దీర్చుకొనుచుండవచ్చును.

రామకృష్ణకవి ;

(ఆశ్చర్యముతో) మామంత్రిశిఖామణులు, విశేషధీమన్తులనియే మే మెరుగుదుముగాని, మహావిద్వాంసు లగుట యెరుగము,

స్వామి :

మీ రెరుగకపోవచ్చును. మేమిర్వురము సహాధ్యాయులమే గాక సతీర్థులముగూడ. సర్వతంత్ర స్వతంత్రులగు, చిట్టి గంగనామాత్యులకడ, శాస్త్రములేగాక, రాజనీతి,దండనీతి, సర్వవాహనారోహణ నైపుణ్యము, సర్వాయుధ ప్రయోగ సమరకౌశలము. తంత్రవిద్యలు, సర్వము సమముగా నేర్చుకొనియుంటిమి. తక్కుంగల శిష్యులతో గలియక మేమిర్వురము మాత్రము దేహములే రెండుగాని ప్రాణ మొక్కటి యన నుండువారము.

రామకృష్ణకవి :

(విస్మయముతో) ఈ విషయములెల్ల ప్రప్రథమముగా దమ వలన వినుచున్నారము.

స్వామి :

కాని, మొదటినుండియు నేను ప్రాపంచిక వ్యవహారములకు విముఖుడను, ఆముష్మిక సాధనయే ముఖ్యాశయముకాగ బ్రాహ్మణులా

డెడివాడను. తిమ్మరుసుమాత్రము సర్వవ్యవహారములలో తలదూర్చుచు నన్నిటిని బరిష్కరింప, యత్నించెడువాడు. తన ధీపటిమచే నెన్నిమో చిక్కుల విడదీసి పలువురి మెప్పందుకొనుచుండెడివాడు.

రాయలు — రామకృష్ణకవి :

అటుల మీ రిద్దరెంతకాలమువరకు కలసి విద్య నార్జించితిరి?

స్వామి :

మాగురుపాదుల యవసానకాలమువరకు — చదువదగినవెల్ల బూర్తియయ్యెను, బూజ్యపాదులగు గురువరుల యనుజ్ఞ కెదురు జూచుచు నక్కడనే యుంటిమి. మా గురువరేణ్యు లొకనాడేకాంతమున నన్నుం బిలచి — వత్సా — నేనొక మహాకార్యమును సాధింప బ్రతినఁబూని నా జీవితమెల్ల నందులకై ధారవోసితిని — కాని — దైవ దుర్విపాకముచే నా కార్యము నాకసాధ్యమాయెను. నేను మరణమునకు చేరువలో నున్నాను — ఏతత్కార్యశేషమును నాకు మారుగా నీవు సాధించి పూర్తి జేయుదునని, నా సమక్షమున బ్రతిజ్ఞయొనర్తువా?" అని యడిగిరి. నేను నావైరాగ్య ప్రవృత్తిని వారి జ్ఞప్తికిం దెచ్చి మహానుభావా ! సర్వసంగపరిత్యాగినై తపమొనర్చుకొన నా కభిలాష గలదు దాని కిట్టి ప్రతిజ్ఞలు ప్రతిబంధకములుకాక యుండగలవా ? అని వారిసన్నిధి సాష్టాంగప్రణామ మాచరించితిని. వారునవ్వి, తిమ్మరుసుం బిలిచికొనిరమ్మని నన్నంపిరి. అటులే నేనేగి వానినిం బిలుచుకొని వచ్చితిని. వానిం దనచెంత గూర్చుండవినియోగించి మద్గురుపాదులు నాకుజెప్పిన విషయములనెల్ల దెలిపి, ప్రతిజ్ఞచేయుదువా? అనియడిగిరి.

రాయలు :

(సాలోచనముగా - తిలకించును)

రామకృష్ణకవి :

(ఆతురతతో) తరువాత నేమైనది?

స్వామి :

గురువర్యు నానతివినుట యేతడవుగా తిమ్మరుసు లేచి, పైనున్న యుత్తరీయమును - నడుమునకు జుట్టుకొని, వారిచుట్టును మువ్మారు ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగ దండప్రణామ మొనరించిలేచి, వినయముతో నంజలిబద్ధుడై, "స్వామీ! నేను పరధ్యానముగనుండి, తమ యానతిని పూర్తిగా విననైతిని, మరల సెలవిత్తురుగాక" అని ప్రార్థించెను. అప్పుడు పూజ్యపాదులగు మాగురువర్యులునవ్వుచు, దిమ్మరుసును గూర్చుండబెట్టి, వాని మూపున దనచేతిపైచి, "నాతా! నేనొకమహా కార్యసాధనకై కఠోరమగు దీక్షబూని దాని సాధింప నాజీవితమెల్ల నంకిత మొనర్చితిని. కాని మందభాగ్యుడను. అవసానకాల మాసన్న మగుటచే నాకార్యమును సాధింపజాలకయే మరణింపనుంటిని. నా యనంతరమా మహాకార్యమును సాధించి, నాయాత్మకు శాంతినొసగు భారమును నీపైనుంచుచున్నాడను ఏతన్మహాకార్యభారమును, దల దాల్చి, ఆత్మబలిదాన మొనర్పవలసివచ్చినను వెనుదీయక, సమర్థతతో నిర్వహింతునని మృత్యుశయ్యనున్న నా సమక్షమున, దృఢప్రతిజ్ఞ నొనర్చితినేని - మనశ్శాంతితో సుఖముగ మరణింపగలను" అని మద్గురుపాదులు, తిమ్మరుసు మోముగాంచుచు బలికిరి.

రాయలు :

(సోద్వేగముగ దిలకించుచు)

రామకృష్ణకవి :

(ఆత్రముగా) తరువాత - తరువాత

స్వామి :

(చిరునగవుతో) అంతట తిమ్మరుసు లేచి మరల గురువరులకు ప్రదక్షిణ నమస్కారములొనర్చి నిశ్చలదీక్షతో "మహాత్మా! గ్రుడ్డిగవ్వ యుంజేయని, యనాథభిక్షుకుడనగు నన్ను జేరదీసి సర్వవిద్యల జెప్పి, సమస్తకళామర్మముల నుపదేశించి, మానవునిగా నీభూమిపై నిల్పి

తిరి. ఇట్టి మీాబుణమును సహస్రాంశమైన దీర్చుకొను నవకాశ మొదవి నపుడు వెనుదీయుదునా? తను యాదేశ మెట్టిదైన నగుగాక, ఇదె మీాపాదములంటి శపథమొసర్చుచున్నాను. నాయీాశరీరమున ప్రాణ వాయువు సంచరించుచున్నంతవరకు తమ యాజ్ఞను శిరమునదాల్చి, తత్సాధనకై నాసర్వశక్తులను ధారవోయగలవాడను'' అని ధృఢ ముగా ప్రతిజ్ఞావాక్యముల బలికినాడు.

రాయలు :

(గంభీరుడై మౌనముగ నాలోచింపుచుండును)

రామకృష్ణకవి :

(తృప్తితో) శహబాస్ – తరువాత.

స్వామి :

గురుపాదులందుల కొనందించి, నన్నుగూడ దనచెంత గూర్చుం డనియోగించి, మాయిర్వురి శిరములపై దన కరయుగమునుంచి, సమాధిస్థితినందెను. మా కిరువురకుగూడ కనులు మూతలుబడినవి. గురుకర పద్మములనుండి మా దేహములలోనికి విద్యుత్ప్రవాహమువలె నొక మహచ్ఛక్తి ప్రవహింపనారంభించెను. మా దేహము లొకవింత యనుభవముతో కంపింపదొడగినవి. రక్తనాళములలో మెఱుపులే ప్రవ హింపుచున్నట్లు అనుభవమునకు వచ్చుచుండెను. ఆప్రవాహ వేగమునకు మేమాగజాలక కంపింపజొచ్చితిమి. అనిదంపూర్వమగు నొక విచి త్రానుభూతితో ముహూర్తకాలముంటిమి.

రామకృష్ణకవి :

(ఉద్వేగముతో) తరువాత – తరువాత.

స్వామి :

ఆ మహానుభావు డంతట కన్నులుదెరచి మమ్ముగాంచి, ''వత్స లారా!! అరువదేండ్లు నేనార్జించిన తపశ్శక్తినంతయు యధార్థముగ

మీయిర్వురకు నిపుడు ధారవోసితిని. సమయానుకూలముగ దాని నుపయోగించుకొందురుగాక ! ఇక నాదీక్షా స్వరూపమునుగూర్చి తెలియజెప్పెదను. సావకాశముగ వినుడు, అదిగో మన పవిత్రజనని, భరత భూమిని గాంచుచుంటిరిగదా !! దయాదాక్షిణ్యాశూన్యులును - ధర్మబాహ్యులునగు, విదేశీయుల దురాక్రమణలకు లోనై - మణికనకాది సంపదలెల్ల గొల్లబోయి, సత్త్వహీనయై, గౌరవహీనయై, రక్తహీనయై, మానహీనయై, క్షుత్తృషార్తులచే కృంగి, కృశించి, నశించి, విమతపదదళితయై - శకలచ్ఛిన్నయైపోయిన దీ భరతధాత్రి - ప్రత్యక్షదైవస్వరూపులగు హిందూమహాచక్రవర్తుల పరిపాలనచే, ప్రపంచమందెల్ల బేరుగాంచి వెలిగిన యీరత్నగర్భ - మహత్తర మహిమాన్వితులగు మహర్షుల తపఃప్రభావమున, మణిదీపికవలె విరాజిల్లిన యీ కర్మభూమి - ఆర్యావర్తము.

'పరమపవిత్రమై నిగమ భాసురమై, శతకోటిదేవతా
కరమయి, కర్మభూమియయి, గ్రాలిన భారతధారుణి, న్నిశా
చరులును-ముష్కరుల్-సకలసంకరజాతులుజొచ్చి, సంపదన్.
దరుణుల మానమున్, బ్రజ; వినాశమొనర్చుచునుండి, రక్కటా!!"

"కనుపట్టునవె ! శిల్పకళలుట్టిపడెడు, దే
వాలయమ్ములు భగ్నమైనదిబ్బ
లగుపించుదురు; శిఖల్దెగగోసి బలిమిమై
గోమాంస మొసగగా గుడుచుద్విజులు
గానుపింతురు; బలాత్కారమ్ముగా - మాన -
భంగంబొనర్ప క్షోభపడుసతులు -
దర్శనంబిచ్చు; షడ్దర్శనాదికములౌ
పొత్తముల్గాల్చిన బూదిరాసు -

లెచటగాంచిన, నెవ్వేళ, నెల్లరాజ్య
ములను, నీనాడు భారతభూమి యందు-
ఉన్నరాజులలో బొత్తు సున్న యాయె !
ఏక మొనరించు సమ్రాట్టులేకపోయె !

తమలోతాము నిర్నిమిత్తముగ కలహించుకొని, తమ శత్రువుల గూల్ప, విదేశ ముష్కరుల సాయ మపేక్షించుటయు, వారే తెంచి వీరి సాయమున శత్రురాజులగొట్టి, వారిరాజ్యమును, కడకు సాయము గోరిన వీరినూడగొట్టి, వీరి రాజ్యమును గబళింపుచు, మతిహీన మార్జాలముల భక్ష్యములను, మర్కట న్యాయాధిపతి పంపక మొనర్చిన రీతి నల్పి, యార్యావర్తమెల్ల గబళించి, యాక్రమించుకొని, మహామ్మారి, యనక్ర విక్రమమ్మున విజృమ్భించి మించినట్లిపట్టణములు పల్లెలు-జనపదములు - ఖర్వాటములు - సర్వమును - స్వాధీనపరచుకొని నాశన మొనర్చుచుండిరి -”

రాచులును - రాసుకృష్ణకవియు :

(విని యిర్వురును - ఖిన్నులై) నిజము - నిజము

స్వామి :

“ఒక్క దక్షిణాపథమున మాత్రము అవక్రపరాక్రమమున నోరుగంటి కాకతీయ సామ్రాజ్యము చెలియలికట్టయై, యాముష్కర వైదేశిక సైనికార్ణవము నుప్పొంగిరానీక నడ్డుకొనుచు వచ్చినది, కాని - దుర్విధిచే నా చెలియలికట్టకూడ నంతరించిపోయినది. కావున నిప్పుడీ దక్షిణాపథము వివృతద్వారమగు వేశ్మము చందమయ్యెను. ఇట్టి దక్షిణ భారతమునైనను- ఆ హీనస్థితికి రానీక రక్షించి కాపాడగలుగుటయే, నాదీక్షకు మూలము. అందులకు వలయు సమర్థుని వెదకి, నిలువబెట్టుటయే, నాసాధన - అట్టి సమర్థుడు గానరాకున్న నట్టివానిని సృష్టియైన

జేసి సాధించవలయును. సాధించి తీరవలయును — ఇక నేనేమియును జేయజాలను — కాని — తిమ్మరుసూ! నీవు సాధించు పనిని పరలోక మందుండి కాంచుచు నాశీర్వదింపుచు సంతసమందుచుందును. నా యీ కార్యమెల్ల పూర్తిగా నీమీదబడినది — ఇక నీ 'యిష్టము" అని చెప్పు చునే మాగురుపాదులు దీర్ఘ సంభాషణాయాసముచే సొమ్మసిలినారు.

రాయలు :

(సాశ్చర్యము) అహో! మహానుభావత దేశభక్తికాదర్శము.

రామకృష్ణకవి :

స్వామీ! తరువాత — తరువాత.

స్వామి :

ఆయాసాధిక్యముచే రెండు గడియలకాలము విశ్రాంతిగొనిన తరువాత యించుక సేదదేరి — యీ మహానుభావుడు.

"తంత్రీ తిమ్మరుసూ! ధర్మబాహ్యులగు నాముష్కరుల నీడ బడ కుండ నీ దక్షిణాపథమును తప్పక రక్షించితీరవలయును. ఇక నార్యా వర్తమును మానవులు రక్షింపలేరు కాలమే తద్రక్షణ బాధ్యత పర మేశ్వరు నాజ్ఞచే నెపుడు వహించునో జెప్పజాలము. కాని దక్షిణ భారతమును గాపాడుట యటువంటిది గాదు. మరొకమాట.

శ్రీముఖశాతకర్ణి ప్రతాపమ్ముచే,
బాటలీపుత్రమ్ము బట్టెనెద్ది ?
పులమావి రాజేంద్రుదులలేని శౌర్య వి
స్ఫూర్తిన జేయమైబొలిచెనెద్ది?
ఆంధ్రవిష్ణుప్రతాపాగ్ని దైత్యులగూల్చి
దుష్టశేషంబు బోద్రోలెనెద్ది ?
కాకతీయప్రభు గంధసింధుర శక్తి
దవిలి దిగంతముల్దాకె నెద్ది ?

అట్టి మనయాంధ్రతేజ, మనార్యగణము
పాలబడకుండ రక్షింపజాలునట్టి
సార్వభౌముని కీవ స్రష్టవయి యొక్క
వెలుగు వెల్గింపుమా! వత్స ! తెలుగుగడ్డ.

ఇక నీదే భారము. నేనీలోకమును వీడి పోవుచున్నాను. తండ్రీ! తిమ్మశర్మా!! నాయాత్మ యేలోకమున నున్నను, నీ యీమహాకార్యమున కాశీర్వాదముల నందించుచుండగలదు" అని చెప్పి మా గురువరుడు నా దెసంజూచి, "వత్సా! నీవు విరాగివై, తురీయాశ్రమమున నెచటనున్నను నీయీ మిత్రుని కార్యమునకు యథాశక్తి సాయపడుచుందువుగాక" అని పలుకుచు-పలుకుచు నింక నాయాసపడుచున్న రీతి నభినయించి, మా చేతులలోననే పరమపదమునుజేర ప్రాణముల నా పరమాత్మయం దైక్యమొనర్చిరి.

రాయలు :

(దీర్ఘముగ విశ్వసించి) అహో! అనుపమాన మహానుభావులు.

రామకృష్ణకవి :

(అనిర్వచనీయానందముతో) ఆ మహామహుని త్యాగనిరతికివే నా జోహారులు. అవురా! ఎంతటి దృఢదీక్ష ? దీపాద్దీపమను న్యాయమున, దేశోద్ధరణాభిలాషతో జీవితమెల్ల వెలిగిన యా దివ్యజ్యోతి. మరొక జ్యోతిని వెలిగించిగాని యారకుండజాలకపోయెనుగదా !!

స్వామి :

(కొంచెమాగి రుద్ధకంఠమున) గురుపాదుల పారలౌకికక్రియా వరిసమాప్తి పర్యంత మిరువుర మచ్చటనే నిల్చి తత్కార్యముల నెరవేర్చి పూర్తియగుటతోడనే బయలుదేరితిమి. తిమ్మరుసు విద్యానగరముజేరి, మీతండ్రిగారగు (శ్రీ) నృసింహ దేవరాయల కడ ధన

శేముషీ వైభవమును బ్రదర్శించి, మెప్పించి. యమాత్యపదము నంది నాడు. నేనదిజూచి సంతసించి, యటనుండి హరిద్వారముంజేరి, తురీ యాశ్రమము గ్రహించి, తత్సాధనలో లీనమైతిని.

రామకృష్ణకవి :

[ఆశ్చర్యముతో] మా మహామాత్యు లత్యద్భుత మనీషావంతులని యేమిదివర కెరుగుదుము, కాని యింతటి పండితప్రకాండులని వినుట కిదియే మొదటిసారి.

రాయలు :

[సాలోచనాభ్రుకుటితో] మహాత్మా! అప్పాజీ తమ గురువరుల యానతి నెంతవరకు సఫలీయొనర్చినట్లు ?

స్వామి :

[శాంతముగ] అది వేచిచూడదగిన విషయము. ఇట్టి మహాకార్య ములు సావధానతచే పరిశీలింపదగినవిగాని, వేగిరపడి నిర్ణయించుట మతిమంతుల లక్షణముకాదుగదా! ఇది వినుడు ఈ మన సంభాషణ మేడన చెవి బడరాదు. గమనించితిరా ?

రాయలు - రామకృష్ణకవి :

(వినయముతో) తమయాజ్ఞ మాకు శిరోధార్యము.

స్వామి :

మరొకవిషయము - నేడీ యాశ్రమమునకు నన్నుజూచిపోవ, నొకమహారాజపుత్రి సముచితపరివారసమేతముగ నేగుదెంచియున్నది. వారి పరిజనులటనటదిరుగుచు మీ పరిజనులతో దారసిల్లుట గలుగును. మీరెవ్వరో ? ఏ దేశమునకుజెందినవారో? ఆ వృత్తాంతమించుకయు వారికెవ్వరికిని దెలియగూడదు. మీ పరివారమునకెల్ల నీవిషయమై

గట్టియుత్తరువు లొసంగుటయేగాక నేటరేపట రాజధానినుండి, యమాత్యశేఖరుడంపబోవు సైన్యమునకుగూడ, వచ్చుటతోడనే వారికెల్లరకీయాజ్ఞలందుటకుల దగినకట్టుదిట్టములొనర్పుము.

రాయలు —

(ఆలోచించి) తమ యాజ్ఞాప్రకారమే —

రామకృష్ణకవి :

(భ్రూభంగమొనర్చి) మహాత్మా ! ఆరాజపుత్రిక భవదీయాశ్రమమందున్నదా ? ఈప్రాంతమందెచటనుగానుపించుటలేదే ?

స్వామి :

(హస్తముతో నిర్దేశించుచు) ఆవైపున జిట్టడవిలో పటకుటీరనిర్మాణమొనర్చుకొని పరివారముతోగూడ నున్నది — మీరిద్దరుమాత్రమే విద్యార్థులతోగలసి వసింపుచుండినచో నట్టిజాగ్రతతో నవసరముండెడిది కాదు కాని, మీకును పరివారమును, అంగరక్షకులును గలరు. కావునను, మరికొంతసైన్యము నేడోరేపో రానుండుటవలనను — అట్టి జాగ్రత తీసుకొనవలసివచ్చుచున్నది. పరదేశమునందున్న మీరెవ్వరో వారేమాత్రిమెరుగకుండుటయే వాంఛనీయము.

రాయలు :

(వినతులై) తమ యాజ్ఞానుసారమేగావింతుము.

రామకృష్ణకవి :

(సాభిలాషము) ఆయమ యేదేశ రాజపుత్రికయో ?

స్వామి :

(చిరునవ్వుతో) వారి యభీష్టమెరుగకుండ నావిషయమునిపుడు వెల్లడిసేయజాలను ఆ చిరంజీవినిగూడ నాయొద్ద కొంతయధ్యయన

మొనర్చియుండుటచే సందర్శనాభిలాషచే నప్పుడప్పుడు నేనున్న యెడకు నిగూఢముగ వచ్చుచుండుటగలదు.

వృద్ధకంచుకి :

(వినయమభినయించుచు నేతెంచి స్వామికి నమస్కరించి) సఖీసమేతమా భర్తృదారిక, తమదర్శనమునకు వేగిరపడుచున్నదై యానతివేడ నన్నంపినది. ఆపైని (శ్రీ)వారి చిత్తము–

స్వామి :

(ప్రీతితో) రాజపుత్రింగాంచ నేను నుత్సహించియున్నాడను శీఘ్రముగ గొనిరమ్ము.

కంచుకి :

(మరలనమస్కరించి) తమయాజ్ఞాప్రకారమే. (వెనుకకు నడచిపోయి నిష్క్రమించును)

స్వామి :

(రాయలతో) వత్సా ! మీరిక నేగి మీమీకృత్యముల సావధాను లరగుడు నే జెప్పినది మరువకుడు.

రాయలు – రామకృష్ణకవి :

(లేచివినయముతో నమస్కరించి) చిత్తము. తమయాజ్ఞ సర్వవిధ ముల ననుష్ఠింపబడును. మాకిక సెలవు నొసంగుడు. (అనుచు లేచి - వినయ యముతో నాశ్రమద్వారమును దాటి చిట్టడవిలో కొంతదూరమునడతురు.)

రామకృష్ణకవి :

(ఆకాశముపలక్షించి) మిత్రమా ! మనవిహారసమయమింకను మీరి పోలేదు.

రాయలు :

(పాఱజూచి) ప్రతిదినమును మనమధిష్ఠించి యాహ్లాదమందుచున్న గంధసింధురయుగ్మప్రతిమాన గండశిలాయుగళ ప్రాంతమునకు దారి జూపుము.

రామకృష్ణకవి :

(కొంతదూరము పరిక్రమించి) అవిగో శయనించియున్న మత్తేభములపోల్కి విలసిల్లుచున్న గండశిలలు.

ఇర్వురును

(చెరియొకదానినధిష్ఠించి సావధానముగ నుపవసింతురు)

రాయలు :

(నలుదిక్కులగాంచి యానందాతిరేకమున) అహో ! ఏతత్సమయ ప్రకృతి రమణీయకత మిక్కుల హృదయంగమమై యొప్పుచున్నది గదా!

ప్రాలినసంజలన్ కనకవర్ణపుబూతగ నెన్దుమాళి, యా
శైలము నూత్నశోభనిడు నంతతమున్గనుచున్నదయ్యె, ను
ద్వేలపయోదఖండములు వింతలు రంగులుమార్చుమింట, నే
కేలిటుసల్పె, రంగభుపికిన్‌గడుమిన్నగ నీ ప్రపంచమున్.

ఈరీతిగా మార్చుచున్నది. యే చిత్రలేఖక శిఖామణి హస్తమో. తెలియజాలక విభ్రాంతినొందుచున్నాడను.

రామకృష్ణకవి :

[పాఱజూచి యానందమున బరవశత్వమంది] మిత్రమా ! ఛాందస బ్రాహ్మణుడనగు నాకా రహస్యమెటుల దెలియవచ్చును? ఏ హస్తమా యింద్రజాల మొనర్చుచున్నదో నే నెరుగను గాని, నాకుదోచినది జెప్పెదను వినుము.

మందేహాదులతోడి సంగరమున న్మార్తాండు డట్టిట్టులై
కందంబాఱగ, భూసురార్ఘ్యబలము గ్రొవ్వస్త్రంబులైతాకి, చె
క్కౢం దైత్యాంగముల స్రుసిక్తములు నాకంబంతయున్నిండెనా
నందంబై గనుపట్టు మబ్బులు ప్రతీచ్యాకాశ రంగస్థలిన్॥

రాయలు :

[విని యానందముతో] చక్కగా జెప్పితివి.

రామకృష్ణకవి :

[చిట్టడవిలో వైచియున్న పటకుటీరములవైపు జూపుచు] హయ హేష లతో, గజబృంహితములతో, జన కలకలముతో, నా స్కంధావారము శోభనింపుచున్నది. అందున్న దే దేశపు రాజకుమారియై యుండునో?

రాయలు :

గురుదేవు లత్యంత గూఢ విషయమని చెల్పినతరువాత దాని విషయమై యోజించుట కూడ ననావశ్యకమనియే నాతలంపు.

రామకృష్ణకవి :

[సూక్ష్మముగా వినుట నభినయించి] ఆగు మాగుము మిత్రమా! గురుపాదుల యాశ్రమ ప్రాంతమునుండి యిటువచ్చుమార్గమున, నడవి కోళ్ళ యఱపులవలె హృద్యములగు, నూపుర మంజీరాది భూషణముల ధ్వనిగాభోలు వినవచ్చుచున్నది.

రాయలు :

[నవ్వి] అవి నిజముగా నడవికోళ్ళ యఱపు లేయేలగా కూడదు?

రామకృష్ణకవి :

(పొఱజూచి) ఉస్ - (మాటాడవలదని సైగజేసి యటుజూపును)

(అదేమార్గమున, ఇర్వురు చెలికత్తెలతో సంభాషించుకొనుచు రాజపుత్రియన్న పూర్ణాదేవి ప్రవేశించుచున్నది-)

1-వ చెలి, పార్వతి

(రాజపుత్రితో) ఆ మహాత్ముఁలెంతటి శాంతమూర్తులమ్మా ! ఆ ముఖమండలమెంతటి బ్రహ్మతేజముతోనిండి శోభించుచున్నది !

అన్నపూర్ణాదేవి :

(భక్తివిశ్వాసములతో) నిజము పార్వతీ ! నిజము ! వినుము-

శాంతం బాశ్రమ పద, మతి
శాంతం భీ వనము, మిగుల శాంతము మౌనిం
ద్రాంతికము, సేవ మరియున్
శాంత మనుగ్రహము పరమ శాంతము, తన్వీ ! !

2 వ చెలి – భానుమతి

[భక్తితో] రాకుమారీ ! సర్వదేవతా నిలయ మగుట నీ పర్వతము కొండ నొక విలక్షణమగు, మహిమ గలిగియున్నటుల నాకు దోచుచున్నదమ్మా !

అన్నపూర్ణాదేవి :

అదియు నిజమే సఖి ! ఏమియు సందేహము లేదు. ఈ పవిత్ర పర్వతము సర్వదేవతా నిలయమే సుమా ! [కనులరమోడ్చి తన్మయత్వమును భజించుచు, భక్తితో] నమోనమస్తే మాధవా వాస పునీత. పార్వతీ భూమిధర శిరోరత్నమా ! నీకివే నా జోహారులు-

అప్పల నృసింహు మస్తకమందు దాల్చి
తరులతా గుల్మరోమాంచితవయి, సకల
జనుల భవబంధనముల దర్శనముమాత్ర,
బోవజేతువు మహనీయ పుణ్యనగమ ! !

అహా ! ఏమి నీ నిలువంబడిన దర్పము ?

నీటిధారలు సతము మేనిపయి దూక,
నడుమునంగేలుదోయి విన్నాణ మొప్ప,
నాకధుని దూకుడడచి బంధన మొనర్ప
రీవి నిలచిన హరుబురుడింతు వరెరె ! !

రాయలు :

[పరమానందముతో - విసుచు మూచుచు - నపవారించి]

మిత్రమా! పాండిత్యము, ధన్యమైనది – కవితామధురిమ, ధన్య తరమైనది – లోకోత్తర సౌందర్యముగూడ గలుగుట. ధన్యతమ మైనది – ఆహా!! పీనికిదోషు అనన్యసులభమగు భక్తిగూడ సమ్మిళిత మైనది ఇక జెప్పవలసిన దేముండును ?

రామకృష్ణకవి :

(అళవారించి) నిజము! మిత్రమా!! నిజము! పాండిత్యము, కవితా ప్రావీణ్యము, జగన్మోహన రూపసంపద, ప్రశస్తభక్తియేగాక, ఈ మహారాజపుత్రికయం దగణితలాలిత్యమును, సౌకుమార్యమును, వయ సున్నకుమించిన పరిణతియు, గూడ ద్యోతకములై, దేవతాగౌరవమును గల్పించుచున్నవి.

అన్నపూర్ణాదేవి :

[ఆశ్చర్యము మీఱబలికించు] చెలులారా ! ఈ మహనీయ శైలమ తల్లికా సౌందర్యము నేకాగ్రతతో గాంచుడు తాండవ క్రీడా నిరతు డగు చండికాపతి, మనఃఫలకముపయి, జిత్రితుడగుటలేదా? ఆ పాద శిఖరపర్యంతము నాకామూర్తియే గనుపట్టుచున్నాడు. చూడుడు.

పలుచోట్ల నీటిబుగ్గలు దూకుచుఁన్దోచు,
మనకపర్దస్థగంగాభవాని,
నగమెల్లనిండి యనాసతోటలుదెల్పు,
నంగంబుగప్పు వ్యాఘ్రాజినంబు,
బాదాదినేగు సోపానాళిదలపించు,
స్కంధలంబి పినాకచాపశోభ,
వివిధపక్షిధ్వనుల్ విభ్రాంతిదోపించు,
గరమునమ్రోయుఢక్కాస్వనముల

శాంతసంబద్ధ హర్యక్షశైల సహజ
భవ్యనిమ్నోన్నతుల్నాట్య పాదములుగ
జ్ఞప్తికిందెచ్చు హృద్యమౌ సంజవేళ
దాండవించెడు నటరాజు ధన్యమూర్తి.

[ధ్యానముద్ర వభినయించి కనులుమూసికొనును]

రాయలు :

(మహదానందముతోనపవారించి) నా జీవితము నెల్ల ధన్య మొనర్చిన దివ్యముహూర్తమిది!

రమ్యసౌందర్యసీమ నీ రాకుమారి
గాంచినంతనె;- నా మదిగలుగుచుండె
నహహ! వచియింపరాని దివ్యానుభూతి
నిద్రయో? మత్తో? తెలియగా నేరకుంటి.

రామకృష్ణకవి :

(అపవారించి, నవ్వుచు) మిత్రమా! అందనిపండునుగూర్చి, యే యనుభూతి గలిగి యేమిలాభము?

రాయలు :

(అపవారించి) సఖా ! నేను లాభనష్టముల బేరీజు వేయుట లేదు— ఉపాసించుచున్నాడనీయతిలోకసౌందర్య, సరసవచోవైభవముల, దివ్యమూర్తి మన్మంగళదేవతను—

మానవజన్మమెత్తిన సమగ్రతటిల్లత, వీచికావళుల్
పూనికనూపగాగదలు ఫుల్లసరోజము, చూతశాఖికా
మానఫలమ్ము, కల్పతరు నూతనపల్లవ, ముక్తివైభవ
శ్రీనజుడిచ్చి హేమమునజేసిన విగ్రహమాద్యసృష్టిగన్.

భూసురపాదతాడనముబొంది, కలంగినిజేశువక్షమున్
బాసి, సరోజమున్విడచివచ్చిన క్షీరసముద్రజాత, - ప
ద్మాసను ఛాందసమ్మునకు మానసమెంతయు వంతజెంద,ను
ద్వాసనజెప్పి ధారుణికి వచ్చిన వాణి, యికేమిజెప్పుదున్.

రామకృష్ణకవి :

(అపవారించి, నవ్వుచు) భక్తిప్రపత్తుల ఫలిత మీాయుత్పలమాలల బూజ ! ఇంకేమి జెప్పవలయును—

రాయలు :

(అపవారించి) సౌందర్యోపాసనము–ప్రాణికోటికి నైజముగదా !

అలర వసంతోదయముగాంచి, యుప్పొంగి,
పంచమస్వనమున బాడు పికము
భానూదయమ్మున బన్నగశ్రేష్ఠముల్ -
పడగలవిప్పి సద్భక్తినాడు -
జలదాగమన దివ్యసౌందర్యమునుజూచి
కేకిపింఛము విప్పిక్రీడసల్పు -
సుందర తరముషశ్శోభగన్గొనినంత -
ద్విజతతుల్మిథువుల సంతృప్తినరచు

శారదమ్ములు పరిణతచంద్రికలను -
జూచినంత జకోరముల్ చుట్టములను
గూడి బుభ్వంగ్ర బంతుల గోర్కెసలుపు
కొనుచు నానందలహరిలో మునిగితేలు.

అన్నపూర్ణాదేవి :

(ప్రకృతిస్థయై) చాల తడవైనది. నుంచు నెలవు జేరుదము. వేగమ నడువుడు— (వెలుఉ వెంటరా నిరబిర నాలుగడుగలు వైచి, ఘ్రాణతర్పణ మభినయించుచు) ఈ దివ్య సౌరభ మెచటినుండి యేతెంచుచున్నది ? నా సాపుటామోదతమగు నీ నెత్తావి, మనోరంజనీ లతాంత సంబంధివోలె హృదయము నాహరించుచున్నది.

పార్వతి :

(నాల్గుదిక్కుల బాఱజూచి) అగును రాకుమారీ ! అదే! యించుక దూరమున నొక చందనభూరుహము నాశ్రయించి, యను రూపవరా శ్రియ సౌభాగ్యమున దిప్పంగు జవరాలివోలె మనోరంజనీలత.

భానుమతి :

[సంతోషముతో] అవునవును - కాన్ని, అది యెంత హృదయాహ్లాద జనకములగు వలపుల వెదజల్లుచున్నను - పుష్పవతియైయుండ నోపుగదా ! దాని చెంత కెటు లేగుదుము ?

పార్వతి :

[నవ్వుచు] లతలు పుష్పవతులైననే గదా ! తరుణులపేక్షింతురు. పుష్పవతులు కానివాటి, సమీపమున కెవ్వరేగుదురు ?

అన్నపూర్ణదేవి :

[చిరునవ్వుతో] వదరక దాని సమీపమునకు నడవుడు. మీ మీ పాండిత్యము బ్రదర్శింప నీ ప్రదేశమే మంత యనుకూల మైనది ?

[ముగ్గురును నడచి మనోరంజనీ లతాపంజుమును జేరుదురు]

పార్వతి :

(తీవల నొత్తిగించి కొంతమేర పరికించిచూచి) అందుబాటులో నెక్క డను బ్రసవములు గానుపించుటలేదు రాకుమారీ !

అన్నపూర్ణాదేవి :

ప్రసవము లందుబాటులో లేనిచో నింతటి సౌరభము వ్యాపించి సుమారములకు గూడ గుబాళింప గలదా ?– (కుంజమును సమీపించి, దాని నొత్తిగించి, వెదకుచుండును)

భానుమతి :

భర్తృదారికా! మేమిర్వురముండగా నీ కేలనమ్మా యీసుమాన్వేషణా యాసము ?–

రాయలు :

(తృప్తియొప్పారు పాఱజూచి) అహహో ! ఎంత మనోహరముగా నున్న దా రాజనందినీ ప్రసూనాన్వేషణాభంగిమ వైభవము ? అవును కదా ! అనుపమాన రామణీయకతతో నొప్పారు, సుందరీమణుల యెల్ల చేష్టలయందును, క్షణాక్షణము నొక క్రొత్త రామణీయకముక నుపట్టుటలో వింత యేమున్నది ?

పద్మకరముల దీవల ద్రొక్కి కొత్తి
యించుకంత తలన్వంచి, ఈక్షణములు –
శరములట్టులబర్వ – బుష్పముల, గోరి
వెదకు తన్వంగి, – కనులకు విందొనర్చు.

ఏ యపుడు త్రిభంగిమము నింతయు వీడదు నిల్చియున్నచో
నీ యువతీలలామ ! – వదనేందుడు, పూర్ణవసంతరాగ సం
ధాయకుడై, విలాసము శతాంకమునన్గుణియించు, మారుడీ
తోయజనేత్రసోయగముతో జగమేలగ గాంక్షసేసెడిన్.

(అంతలో నా రాజపుత్రికవైపు జురుకుగా బాఱజూచి)

అరెరే!! తీవ్రజొంపముల కదలికకు గనలి, యీ పొదయందు దాగియున్న యొక భయంకర సర్పము, బడగ విప్పుకొని యీ రాజ పుత్రికపై బడవచ్చుచున్నది. ఇదె నేనేగి యీమెను గాపాడుదును గాక - (గుండశిలనుండి దుమికి విద్యుద్వేగమున బరుగిడుచు నిష్క్రమించును.)

రామకృష్ణకవి :

(తానును గండశిలనుండి దూకి) మా మిత్రు డేల నటు పర్వెత్తి నాడు? [పాఱజూచి]

అహో! భీకరదర్వీకర మొకటి యీరాజసుతపై దుముకబోవు చున్నది. అత్యాహితము - అత్యాహితము. (సర్పిణ్ణుడై తాను నా వంకకు బరువెత్తును.)

అన్నపూర్ణాదేవి :

[పామును గాంచి భయముతో - వెనుకకుదూలి నోటమాటరాక ప్రాన్పడిపోవును.]

పార్వతి - భానుమతి

[పామునుజూచి రాజపుత్రి యవస్థగాంచి గుండెలం బాదుకొనుచు - బిగ్గరగా]

అయ్యో! అయ్యో! పాము! పాము! రక్షింపుడు మారాజ పుత్రికను.

అన్నపూర్ణాదేవి ;

(భయాతిరేకమున మూర్ఛనొంది పడిపోవును.

పార్వతి :

(చూచి యేడ్చుచు) దైవమా! మారాజపుత్రిక కిట్టి దుస్థితిని గల్పిం తివా! తండ్రీ! కాపాడుము.

భానుమతి ;

(దుఃఖముతో) దేవా! సింహశైలాధిపతే! నాయనా! మా భర్తృదారిక నీ గండమునుండి కాపాడినచో నీకుచందనోత్సవ మొనర్ప జేసి నిలువుదోపు నొసంగుదుము తండ్రీ!

రామకృష్ణకవి :

(కొంతదూరము పరువెత్తి పారజూచి) అమ్మయ్య! మా మిత్రవతంసము - కడుంగడు సాహసమున రాజకుమారిపయిబడబోయిన యీ దుష్టసర్పము శిరము నొడిసిపట్టి యీవలికి లాగివైచినాడు. అరెరే! ఆసర్పము మా మిత్రుని బాహుదండమామూలాగ్రము జుట్టుకొన్నదే! అది గిరినాగముగానోపు లేనిచో నింత పొడవు నింతలావును గల దర్వీకరము లుండజాలవు. (మరల పారజూచి) మా మిత్రుడు నుదగజ తుండసదృశంబగు తన బాహుదండమునుజుట్టుకొని బిట్టుబిగియుచున్న యీ ఫణీంద్రమును - తనచేత జిక్కియున్న ఫణంబును వదలకయే - గట్టిగ బట్టుకొని - బాహువుంజుట్టియున్న దాని పుచ్ఛమును, వామహస్తముచే నూడలాగుటకు మెల్లిదిప్పుచున్నాడు. కాని - ఊహు - ఎంత ప్రయత్నించిన నూడివచ్చుటయే లేదు. మరింత బిగిసిపోవుచున్నదా పన్నగము! సాము గరిడీలతో నయోదండ సదృశమై, వజ్ర కఠినమైనది గావున సింహపరాక్రముడగు మా రాజపుత్రుని బాహు దండమామహాహిశక్తిని సహించి యూగగల్గినదిగాని, మరియొక కైనచో పెళపెళ విరిగిపోవలసినదిగాదా? (రాజపుత్రికవైపు గాంచి) ఆ మహారాజనందిని యింకను మూర్ఛనుండి తేరుకొనలేదు - చెలికత్తెల యాక్రందనము రాలుకరగింపుచున్నది - నేనిదే వారింజేరి యూరడింతునుగాక - (రాయలవైపు గాంచి) శహబాస్ - మా మిత్రుడు వామహస్తముతో దన మొలనున్న బాకునుదీసి, యీ సర్ప శరీరమును బుచ్ఛాదిగా - ప్రాదేశమాత్రఖండములుగా తన బాహువునంటిన

చోట దెగనీయక దక్కినదంతయు దెగనట్టుల ఖండఖండములుగా దెగగోయుచున్నాడు – అబ్బా! తెగగోసిన డెల్లను, పట్టు సడలుటచే నా కాలాహి తనువు మాలికవలె క్రిందకు వ్రేలాడుచున్నది. ఇక భయము లేదు– నే నారాజపుత్రిక కడకేగి యావల నామిత్రుని చెంత కేగెదనుగాక –

(రాజపుత్రికను సమీపించు త్రోవలోని నీటిపడియలలో దన యుత్తరీయమును దడపుకొనిపోయి రాజపుత్రి మొగముపై నా నీటిని పిండి చిలుకరింపుచు, తన పైటచెరగులతో విసరుడని చెలికత్తెలకు దెల్పును)

మీ రాకుమారికేమియు భయములేదు – మీరు బాగుగా విసరుడు నే నింకను కొంచెము నీటిని జల్లుదును –

పార్వతి :

(భయముతో) అయ్యో! మా భర్తృదారిక నా పాడుసర్పము గరచియుండదుగద – నిజముగా జీవించునా? తండ్రీ!

రామకృష్ణకవి.

(తల నడ్డముగ ద్రిప్పుచు) అహాహా అట్టి దేమియు జరుగలేదు – రూఢిగా జెప్పుచున్నాడను. ఇటు చూడుడు –

వదనమండలమందు వైవర్ణ్యమేమి
గానుపింపదు – నురుగు, చొంగయును నోట
వచ్చుటయు లేదు – సమముగా శ్వాస మాడు
చున్నది – శరీర కాంతి ప్రసన్నమరయ.

ఆభీకర దర్వీకరమునుగాంచిన, భయాతిరేకమున నే మీ భర్తృదారిక మూర్ఛిల్లినదిగాని, విషదోషముచే గాదు – (చూచి సంతసముతో) అదె కదలుచున్నది ఇక ద్వరలో గనులువిప్పిచూచి మాటాడగలదు నేనుమరికొంచెము చల్లని నీటిని చిలుకరింతును. మీరువిడువక విసరు

చుండుడు – [ఉత్తరీయమున గల నీటిచెల్లనుపిండి రాకుమారి మొగముపై జిలుకరించి] ఇదె నేనునామిత్రునికడకేగి వానిస్థితియెటులున్నదో విచారించివత్తును. ఇక మీకేమియును విచారమువలదు. విసరుచు రాజపుత్త్రినిగనిపెట్టుకొని యుండుడు. [అనిధైర్యముజెప్పి రాయలకడకేగును]

పార్వతి – భానుమతి

[రాకుమారికి విసరుచుందురు]

అన్నపూర్ణాదేవి :

[కనులుదెరచి నలుదిక్కుల గలయంగాంచుచు] నేనెక్కడ నున్నాను ?

భానుమతి :

(ఆనందాతిరేకమున) మాతల్లీ ! మాటాడితివా ? క్షేమముగ నుంటివా ? (ఇకమాటరాక ప్రామ్నపడి నిలచును)

అన్నపూర్ణాదేవి :

(ఆశ్చర్యముతో లేవబోయి క్రిందికొరగును)

పార్వతి :

(లేవనీయక ఆపి-తన తొడపైనామెతలనుంచుకొని) భయమేల రాజపుత్త్రీ ! కొంచెము సేదదేరుము. అప్పుడే లేవబోకుము.

అన్నపూర్ణాదేవి :

[ఇంచుక స్వస్థతనందుచు] నేను స్తిమితముగనేయుంటిని. నన్ను లేవనిండు (చెలికత్తెలసాయముచేలేచి, కూరుచుండి, నలుదిక్కుల బాఆజూచుచు) నేనిచట మూర్ఛిల్లిపడిపోయితినా ? (ఆశ్చర్యమునొంది) మనమీ మనోరంజనీ లతాకుంజముకడకు పుష్పములగోయుటకు వచ్చితిమిగాదా ! అవును మెల్లగా జ్ఞప్తికివచ్చుచున్నది.

భానుమతి :

[గుండెలు బాదుకొనుచు] ఆ పుష్పములే యింతపనిజేసినవి తల్లీ! ఎంత ప్రమాదము దప్పించుకొంటివమ్మా? పునర్జన్మమెత్తినట్లైనది. ఎంతగండము గడచినది మాతల్లీ! సమయమున కా మహాపురుషుడు వచ్చి-

అన్నపూర్ణాదేవి :

(ఆశ్చర్యముతో) గండ మేమిటి? ఆ మహాపురుషు డెవరు? ఏమిటే నీవనునది ?

పార్వతి :

(విసుగుకొనుచు) భర్తృదారిక చిత్తమునందుగలవరము దీరక మున్నే మరింత గలవరపెట్టుచున్నావేమే భానుమతీ!

అన్నపూర్ణ దేవి :

లేదులేదు నా చిత్తము స్వస్థతనందియే యున్నది. (యోజింపుచు) ఆ - మంచు తెరవిడిపోయినట్లైనది- మనమీ కుంజమున బ్రసూనముల వెదకుచుండగా- భీషణమగు సర్పమొకటి నాపై దూకబోయెనుగదా!

భానుమతి :

అవును! వెంటనే నీవు మూర్ఛిల్లితివి. నిన్నది కాటువైచెనేమో యని మేమేడ్చుచుంటిమి - విద్యుద్వేగమున నొక సాహసి యేతెంచి నీపై దూకనున్న దాని శిరమునొడిసి పట్టిలాగుకొని పోయినాడు-

అన్నపూర్ణాదేవి :

(ఆశ్చర్యముతో) తరువాత -

భానుమతి :

ఆ సర్పమా వీరుని బాహుదండమామూలాగ్రము జుట్టుకొన్నది. అయినను విడువకుండ దానినటులే బట్టుకొనియాతడావలికరిగినాడు.

అన్నపూర్ణాదేవి :

(చకితయై) ఆపరమోపకారియెట్లులుండెనో విచారింపక, మీరిర్వురును నన్నింటిపెట్టుకొని యిచట నేయుంటిరా ! యిప్పటికైన నాతడేమయ్యెనో ?—

పార్వతి :

భయములేదమ్మా నేనుగాంచితిని. గట్టిగా తనబాహువుంజుట్టుకొని యెట్లునురాని యాసర్పశరీరము నావీరుడు తన సురియుచే ముక్కలొనర్చి దాని నావలబారవైచినాడు.

నీవు మూర్ఛిల్లినంతనే, మా ప్రాణములేబోయినట్లై యేడ్చుచున్న మాకడకాతని మిత్రుడు తన యుత్తరీయమును దడుపుకొని వచ్చి నీమొగముపై యా నీటిజల్లి మాచేవిసరునట్లుజేసి నీవు కదలిన తర్వాత తనమిత్రునిగన నేగినాడు.

అన్నపూర్ణాదేవి :

అటులైన మనము గూడ నేగి యా సర్ప కళేబరమునుగాంచి వత్తము రండు — (మువ్వురునుగూడి రాజకుమారి నానుకొని మెల్లగా నడతురు)

పార్వతి :

(చూచిభయమునొంది) ఇదిగో చూడుము— ఖండఖండములొనర్చి పాఱవైవబడగా, నదిశ్చర్మమాత్ర సంబంధముచే, ప్రాణోత్క్రమణ స్థితినుండియు దనరుధిరసిక్త దేహమునెంత భయంకరముగా గదుల్చుచున్నదో !

అన్నపూర్ణాదేవి :

(చూచి) ఇది యారణ్యకమహానాగము. మిగిలిన సర్పజాతు లేవియు నింత బృహదాకృతిగలిగి, యింత భయంకరముగా నుండవు. అదేగాదు చూడుడు-

గీ॥ అతివిశాలమౌ పడగ విప్పార్చి, బుస్సు,
మనుచులేవంగబోయి - దేహమ్ము ముక్క
లగుట - మరల భూమింబడి - అతిభయంక
రముగ, బ్రతి ముక్కయు గదల్చు బ్రళయరీతి॥

ఇట్టి భీషణభుజంగము నొడిసిపట్టుకొని, నా ప్రాణముల గాపాడిన యీ మహాపురుషుని దర్శింప నా హృదయ మారాటపడుచున్నది-

భానుమతి :

(పాఱజూచి) అదేరక్తప్లాలిత దేహము నానీటిపడియకడ గడగికొని యీ మహావీరుడు తనమిత్రునితోగూడనిటే వచ్చుచున్నాడు.

(రామకృష్ణకవితోగూడి రాయలు ప్రవేశించుచున్నాడు)

అన్నపూర్ణాదేవి :

(రాయలగాంచి - బ్రమానపడి - నిస్తబ్ధురాలై తలవంచును)

పార్వతి :

(రాజకుమారితో) నీ ప్రాణరక్షకుడీ మహాపురుషుడేనమ్మా! భర్తృదారికా!

అన్నపూర్ణాదేవి :

(రాయలను గ్రీగంటజూచుచు తనలో)ఈ నవమోహనాంగుని దర్శించి నప్పటినుండి నాచిత్తమొక యపూర్వానుభవము నందుచున్నది - ఏదియో యనూహ్యమగువింతవికారము నన్నుతలపెట్టుచున్నది -

కేవలము ప్రాణరక్షకునియెడగలుగగల - భక్త్యాదరములిట్టులుండవు- ఇది యొక విలక్షణమగు భావసన్నివేశము ఈ నూతన సృష్టికి కారణ మెరుగజాలకున్నాను.

(రామకృష్ణకవిని నిర్దేశించి) రాకుమారీ! ఈ మహనీయుడుగూడ. మూర్ఛిల్లిన నీపైబడి దిక్కుదోపక దుఃఖింపుచున్న మమ్మూరడించి - తనయుత్తరీయము దడిపి తెచ్చిన జలము నీమోముపై జల్లుచు, మమ్మొ విసరునటుల జేసి నీవుకదలినందాక, తనమిత్రుని గూడ జూడబోని యుదారుడు.

అన్నపూర్ణాదేవి :

(చేతులుజోడించి, చెలులమాటున డాగి యేలజ్జాతిరేకమున) ప్రాణదాతలకు నానమోవాకసహస్రములు. (క్రీగంటరాయలంగాంచి సవిలాసముగ శిరము వంచుకొనును)

రామకృష్ణకవి :

(సంతసముమీర) మహారాజనందినీ! అనురూపవల్లభప్రాప్తియు నఖండసౌభాగ్యసిద్ధియుగల్గి, యనుపమాన యశోవిరాజితవై శత శరత్తులు వర్ధిల్లవలయును.

పార్వతి - భానుమతి

(కన్నులతో నవ్వుకొనుచు పరస్పరము చూచుకొందురు)

అన్నపూర్ణాదేవి :

(చెలికత్తెలతో) వీరిపరిచయభాగ్యము

రాయలు :

[రాజకుమారివైపు నిశ్చల దృష్టితో గాంచుచుండును]

రామకృష్ణకవి :

మేమిరువురముగూడ శ్రీ స్వామివారికడ నంతేవాసులమని చెప్పినచాలుననుకొందును

అన్నపూర్ణాదేవి :

(పార్వతివైపు సాభిప్రాయముగ గాంచును)

పార్వతి :

(రాయలవైపు దోయిలొగ్గి వినయ వినమితోత్తమాంగయై) మా భర్తృదారికకు ప్రాణభిక్షనిడి నేడు తాము మా కొనర్చిన మహోపకారము జన్మాంతమువరకు మఱువరానిది- మహావీరా!! తమ ప్రాణములను గూడ దృణములట్టుల భావించి మీరు చేసిన ఈ త్యాగమహిమచే మేమింతకును క్షేమముగ నుండగలిగినారము- అట్టి తమగు మా పాలిటికి దైవస్వరూపులు సర్వదా మా హృదయపీఠముల మిమ్మారాధింపుచుండుటకు తమ పరిచయము-

రామకృష్ణకవి :

[నవ్వుచు - అర్థోక్తిలోనే మాటనందుకొని] బాలికారతనములారా! మానవుడు తోటిమానవునకు జేయగల సాయమునకుమించి మేము మీ కొనర్చినది లేదు- ఇక మా పరిచయమా ? మా మిత్రుడొక సుక్షత్రియ కుమారుడు! నేనా యుదారున కాశ్రితకోటిలో నొకడను - బ్రాహ్మణుడను - మేమిరువురము నీ విబోధానంద గురుపాదుల సన్నిధిలో గొన్ని శాస్త్రముల నభ్యసింపుచు గొంతకాలముగ నున్నారము- మరి మీ భర్తృదారిక పరిచయమో ?-

పార్వతి :

(సాభిప్రాయముగ రాజకుమారి మొగమునుగాంచును)

అన్నపూర్ణాదేవి :

[మౌనమువహించి తలవంచుకొనును]

రాయలు :

(రాజకుమారిని పరమానందముతో జూచుచుండును)

రామకృష్ణకవి :

(పార్వతితో) పోనిండు. మా మహారాజకుమారునిదివోలె, మీ ప్రభునందిని] పరిచయముగూడ నత్యంతగోప్యముగ గాపాడదగిన దైనచో – నటులేపోనిండు.

అన్నపూర్ణాదేవి :

(వినయముతో దలవంచి యంజలిబద్ధయై) మా ప్రాణరక్షకులకు సర్వదా కృతజ్ఞులము మా యపారభక్తికి నిదర్శనమింతకంటె నేమిజూపింప జాలుదుము.?

రామకృష్ణకవి :

ఇందంతటి కృతజ్ఞతజూపింపదగినదేమున్నది ? సమయమున కిందుంటిమిగావున రాజకుమారినాఘోర సర్పబాధనుండి దప్పించితిమి. యేమానవుడైన నీమాత్రమునాయ మెవ్వరికైన జేయునుగదా !

అన్నపూర్ణాదేవి :

(పార్వతివైపు సాభిప్రాయముగ గాంచును)

పార్వతి :

మహాపురుషులారా మీబోటివారికివి సామాన్యమానవ ధర్మములనియే దోపవచ్చునుగాని ఆత్మబలిదాన మొనర్పగూడ సిద్ధపడి యితరులకు బ్రాణదాన మొనర్చినపుడాయితరులు తమప్రాణదాతల కామాత్రము తమకృతజ్ఞతనైన దెల్పుకొనకుండ నెటులుండగలరు.

అన్నపూర్ణాదేవి :

(చాటుగా రాయలను వాల్గూపుల గాంచుచుండును)

రాయలు -

(క్రిగంట నన్నపూర్ణాదేవిని మాటిమాటికి గాంచుచుండును)

రామకృష్ణకవి ;

[రాయలతో] ప్రభుపుత్రా! సంధ్యాకాల మతిక్రమించుచున్న దనుకొందును-

రాయలు - అన్నపూర్ణాదేవి :

(పరస్పరము గాంచుకొని ఉలికిపడి ఇర్వురును తమ తమ దృష్టుల మరల్చుకొని సహజముగా నుందురు)

పార్వతి :

[అన్నపూర్ణదిక్కై] భర్తృదారికా! కున్నృపతి పరిపాలనమువోలె నంధకార మవనినెల్ల బీడింప నాక్రమించుచున్నది - పరివారజనము - మనకై తహతహలాడుచు కరదీపికలతో నెదురువత్తురేమో? ప్రాణదాతలయాజ్ఞగొని నేటికి మన నివాసముల కేగుదము. పునర్దర్శన భాగ్యము లభింపవేడుకొందము.

అన్నపూర్ణాదేవి :

[ఆమోదసూచకముగా సంజ్ఞనొనర్చును]

పార్వతి :

(చేతులుజోడించి) ప్రాణరక్షకులకు మా ప్రణామసహస్రము. నేటికి మాయావాసమున కేఁగ ననుజ్ఞదయచేయుదురుగాక.

రామకృష్ణకవి :

మంచిది, అటులే జేయవచ్చును. మీ నివాస సమీపమునకు మిమ్ముజేర్పుటకు మేముకూడ వెంటవత్తుము. నడువుడు.

పార్వతి

(వినయముట్టిపడ) మీరాకంతశ్రమ మొసగనోపము, యిదే మా సేవకులు గూడకరదీపికలతో నిటువచ్చుచున్నవారు.

అన్నపూర్ణాదేవి :

[ఉలికిపడి యావైపునకుగాంచి మరల రాయలవైపు క్రీగంట మాటిమాటికి చూచుచు లుజోడించి మనోరంజనీ లతాపుంజముతో చెప్పినరీతిగా] సుగంధిళసుమనోమనోహారనికుంజవర ! అభివాదనములు. ఆమరణాంతస్మరణీయ్యా జటిల సన్నివేశమునిదె నేడుగల్పించి, జీవితాంతము మరచిపోవజాలని యటులనొనర్చితివి. యిక సెలవొసంగుదువా ? పోయివత్తును

రాయలు :

(ఆ పొదనుండి రెండుపూవుల గోసితెచ్చి రామకృష్ణకవి కొసగును)

రామకృష్ణకవి :

[చిరునవ్వుతో] మహారాజనందినీ ! ఏ సుమనసములింతటి మరవరాని సన్నివేశమునకు కారణములయ్యెనో ? అవె మరల స్వస్థానమలంకరింప నాతురత నొందుచున్నవి. మీరివిగ్రహింతురుగాక. వాటితో బాటు మా చిత్తములు గూడ ధన్యత నొందగలవు. (అన్నపూర్ణాదేవి కర్పించును)

అన్నపూర్ణాదేవి :

(దోయిలొగ్గి వినయముతో గ్రహించి కన్నుల కద్దుకొని) అనుగ్రహింపబడితిని. యిక సెలవు.

(చెలికత్తెలవెంట నడచుచూ మాటిమాటికి వెనుకకుతిరిగి చూచుచు అన్నపూర్ణాదేవి నిష్క్రమించును)

(అన్నపూర్ణాదేవియు, చెలికత్తెలును కంటికి కానరాకుండ బోయినను అవైపునకే చూచుచు స్తబ్ధుడై నిలువబడియున్న రాయలను బలవంతముగా వెంటబెట్టుకొని రామకృష్ణకవి శ్రీ విబోధానందాశ్రమము వైపునకు నిష్క్రమించుచుండగా తెరవ్రాలును.

## ప్రథమాంకము

## ప్రవేశకము :

(పటకుటీర సమీపమున నొక చెట్టుక్రింద బాలోచనాధీనమానస పార్వతి ప్రవేశించుచున్నది)

పార్వతి :

ఈ మారిసింహాచలయాత్ర కెట్టి దుర్ముహూర్తమున బయలు వెడలితిమోగాని అన్నిటను విధి వక్రమార్గముననే నడచుచున్నది. మొదట మనోరంజనీ కుసుమములు కోయబోవ మా రాజపుత్రిపై భీకర దర్వీకర మొండు దుమికి యెంతపని సేసినది. దైవమువలె సమయమున కా రాజపుత్రుడే తెంచి తన ప్రాణములుకూడ లెక్కచేయక నా సర్పముం పట్టుకొని యావలకుగొనిపోయి రక్షింపబట్టి సరిపోయినది గాని, లేకున్న యానాడే మాబ్రతుకులు బండలై పోవలసినది. ఆయాపదను తలంచుకొనియె మేమెంతయు వంతనొందుచుండ నేటి కారుదినములక్రిందట నొక తురుష్కసైన్య మాకస్మికముగా నేతెంచి మా గుడారముల ముట్టడించి యజాగ్రతగానున్న మారక్షకదళమును దళవాయిని, జయించి, బంధించి మా భర్తృదారికను, మమ్మును, దాసీజనములతోగూడ జెరబట్టికొని పోవుచుండ మా దీనాలాపములు విని యా రాజపుత్రుడే తన యంగరక్షక దళమును దోడ్కొని యేతెంచి ప్రళయరుద్రునివలె నా తురుష్కసేనపై దూకి భీకర యుద్ధమొనర్చి వారినెల్ల జీల్చి చెండాడి మమ్ముల నుగల గాపాడినాడు. ఆ మహావీర చూడామణికి మా ప్రభు కుటుంబ మెంతయు ఋణపడియున్నది. మొదటిమారా మహావీరుడు కాపాడినదొక్క మా భర్తృదారిక ప్రాణములనుమాత్రమే. కాని – యీమారు కాపాడినది మాయెల్లరి మాన ప్రాణములనేగాక, మారాజ్య గౌరవమును, మాప్రభుశేఖరుని మాన మర్యాదలను, కుటుంబగౌరవమును, సర్వమును రక్షించినట్లయినది. ఆ మహావీరున కేమొసగి వాని ఋణము తీర్చుకొన సాధ్యమగును? మా వెంటవచ్చిన సైన్యమునకు నాయకుడుగా వచ్చినవాడు

మాప్రభువువారి పాత్ర సామంతులలో కొకడగు సామంతవీర చూడామణి. అట్టివీరుడే ససైన్యముగా నోటుబడి తురుష్కులకు బందీయై యుండగా, ఆ మహారాజకుమారుడు తన యాంగ్ల క్షత్ర దళముతో మాత్రమే తెంచి, ఆ తురుష్కసైన్యముపై బడి యొనరించిన భీకర సమర ప్రకారము దల చుకొనిన నిప్పటికిని నా గుండె లదరుచున్నవి. ఎన్ని గాయములు తగిలి యెంత రక్తము స్రవించుచున్నను, వెనుదీయక శత్రుసంహార కార్యమును బూర్తి నొనరించి మమ్ముద్ధరించి బంధింపబడియున్న మా సేనానాయకుని, సైనికులను విడిపించి వారికి ఆయుధములు లభింపజేసి మమ్ము వారి రక్షణలో భద్రముగా నుంచుమనంతనంత, ఆ శూర సింహుడు, రణరంగమున వీరవిహారము సల్పుచునే యుండెనుగదా! మాకెల్ల విముక్తి లభించి శత్రువులెల్ల నిశ్శేషమైపోవు తరువాతనే, చిర రక్తస్రావమువలనను, దేహముననందగిలిన యసంఖ్యాక గాయముల మూలమునను స్మృతిలేక భ్రమింపబడి మూర్ఛిల్లినాడు. అట్టియెడ శ్రీ స్వామి వారేతెంచి తన శిష్యులచే నా మహావీరుని దేహము నాశ్రమములోనికి జేర్పించి గాయములగడిగించి యేమేమియో పసరులబూయించి తైలము రాయించి రక్తస్రావము నాపుజేసి దేహమున విరిగియున్న యాయుధశకలముల నూడబెరికించి, కుట్టదగిన గాయముల నెల్ల గుట్టించి, పట్టీలువేయదగిన వ్రణములకు బట్టీలు వేయించి, తగినమందుల సేవ జేయుచు నెన్నియోవిధముల చికిత్సనొసంగుచున్నారు. నాటినుండి నేటివరకు మా భర్తృదారిక నిద్రాహారములు మానియు స్వసుఖమునుగూడ విసర్జించి యీ రాజపుత్రుని కడ, రేయింబవళ్ళు గా చుకొనియుండి పరిచర్యసలుపుచున్నది. అంతఃపురమున భర్మడోలికలలో నూగుచు, సుఖమున సుకుమారముగా పెరిగిన మా రాజపుత్రి-సంతతము, శతసహస్ర దాసీ పరిచర్యలచే నుల్లాసముగా చరించిన మా రాజపుత్రి-యమ్మగూడ దరి జేరనీయక నా మహావీరుడగు రాజపుత్రునకి తానే సకలోపచారములు సలుపుచున్నది. జ్వర ప్రలాపాదులచే నవశుడై విస్మృతుడై, జీవిత

సంశయావస్థయందున్న యీ మహానుభావుని కంటికి రెప్పపోలిక నెల్ల వేళలగాచుకొని యుండి ఏఏసమయమున నేయే యౌషధము లొసంగవలెనో యెట్టి యుపచారము లొనర్చుచుండవలయునో వాటినెల్ల క్రమముదప్పక నాచరించుచు నా శ్రమచేతను విచారముచేతను జిక్కి సగమైపోయినది. మొన్నటిరోజున శ్రీస్వామివారు పరీక్షించి యిక ప్రాణభయములేదు' అని చెప్పిన తరువాతగాని కుదుటపడకపోయినది. అప్పటికిని పరిచర్యసల్పుటలో సమయమున నేమరుటయే లేదు ఇంతయు నిటులనుండగా రహస్యముగా మేమందరమెంత ప్రయత్నించియు నా రాజపుత్రు డేదేశమువాడో! వాని నామమెద్దియో? నించుకయు తెలిసికొనలేకపోయితిమి. ఆ రాజకుమారుని వారిరాజ్యమునకు తోడ్కొనిపోవ స్వరాష్ట్రమునుండి చతురంగబల యుక్తమగు నొకమహాసైన్యమేతెంచి యీవీరుని స్థితినిగాంచి ప్రయాణ మాపుకొని, విడిచియున్నది. ఆబహుళ సైన్యమున ప్రయత్నించినచో నాతని నిజవర్తమానము తెలియగలదను నాశతో మామాచాతుర్యములనెల్ల నుపయోగించితిమి. విశ్వప్రయత్నము సల్పియు నాసమాచారము నేమాత్రము నెఱుగజాలకపోయితిమి. ఏతద్దేశీయ రాజోద్యోగులయొక్క రహస్యగోపనశక్తిని మెచ్చుకొనక తప్పదు. అది యటులుండ యిచ్చట నడచిన వృత్తాంతమునెల్ల మా ప్రభువర్యుల కెటులనో తెలిసినవి. వెంటనే మరియొక సేనానాయకుని యాధిపత్యముక్రింద మరింతసైన్యము నిచ్చి తత్క్షణమే బయలుదేరి రావలెసినదిగా భర్తృదారికకు ప్రభువు లాజ్ఞాపత్రమును బంపియున్నారు. యిక నెక్కుడురోజు లిటనుండుటకు నుపాయము లేదు. మాప్రయాణ మీదినమో రేపో జరుగవచ్చును. మా రాజపుత్రిక నాకొరకెదురుచూచుచుండగలదు. నే నిప్పుడే వెళ్ళి నా యశక్తత నామెకు నివేదింపక తప్పునటుల లేదు.

(నిష్క్రమించుచు)

ఇది ప్రవేశకము.

ఓమ్

# ఆంధ్రభోజుఁడు

## (నాటకము)



### ద్వితీయాంకము

(విబోధానందస్వామి ఆశ్రమసమీపమందలి యొక వృక్షముక్రింద - పార్వతి భానుమతులతో సంభాషించుచు నన్నపూర్ణాదేవి ప్రవేశించుచున్నది.)

(పార్వతిని గాంచి) నీవేగివచ్చినపని యేమియు లాభింపలేదను కొందును.

పార్వతి :

(ఇంచుక సిగ్గుపడుచు) అవును రాజకుమారీ! నా యశక్తతకు నే నెంతయో లజ్జనొందుచున్నదానను. ఆ పని నే నించుకంతయును సాధింపజాలకపోయితిని.

అన్నపూర్ణాదేవి :

(ఆశ్చర్యము నభినయించి) చాల చిత్రముగ నున్నది. పంచ ద్రావిడ దేశ మధ్యగత సమస్త ప్రభువులయు - రాజ్యార్హులగు రాజకుమారులయు - చిత్తరువులెల్ల మన చిత్రశాలలో గలవు - ఈ మహావీరుని చిత్రమందు జూచిన గుర్తు వచ్చుటలేదు.

భానుమతి ;

ఈతడు రాజ్యార్హుఁడగు రాజపుత్రుఁడుగాకపోవచ్చునుగదా!

అన్నపూర్ణాదేవి:

అటులే యయిననో నతనికొలకు చతురంగబలములతోడి యింతటి పరివార మెందులకే తెంచెను ? ఇట్టి పరాక్రమము – ఇంతటి త్యాగము – ఇట్టి పరార్థపరత్వము–ఇంత యుదాంత– భావి మూర్థాభిషిక్తులయందుగాక యితరులయం దెట్లు గాననగు ననుకొంటివి ?

పార్వతి :

నిజము ! భర్తృదారికా ! నిజము ! సత్యమూహించితివి – కాని యీతని దేదేశమో తెలియనేరకున్నారము –

భానుమతి :

(ఏకసక్కెముగా) ఆ శీవి, ఆదర్పము, ఆ పరాక్రమము, ఆ సతీజన హృదయాకర్షణ దక్షత, యివియెల్ల నీ వీరుని దేశమునుగూర్చి తెలుపజాలవా ?

అన్నపూర్ణాదేవి :

(విసుగు నభినయించి) వాగకుము వదరుబోతా ! మొన్నటి యుద్ధమున నా సింహపరాక్రమము ప్రదర్శించిన, ఆ యతిలోక వీరత్వమును దర్శించినవారికి ఆతని దేశమెయ్యదియో నిజముగా తెలియనక్కరయే లేదు.

పార్వతి :

నిజము : సఖి, నిజము; మన ప్రభువరేణ్యుల యాస్థానమం దెందరో మహావీరులు, సామంతరాజులలోను, సేనాపతులలోను రాజపుత్రులలోను, సర్దారులలోను గలరుగదా; వారివారియుద్ధకౌశలములనెల్ల మనము గాంచియేయుంటిమి. ఇంతటి యమానుషపరాక్రమము–ఇంతటి అతిలోకఖడ్గచాలనా నైపుణ్యము. మనమెవ్వరికడనైన గాంచియుంటిమా ?

భానుమతి :

(బిగ్గరగా నవ్వి) కావుననేగదా: మొదటిమారు ప్రాణమును, రెండవమారు మాన ప్రాణములను గాపాడిన యా వీరశేఖరునకు మన మహారాజకుమారి తన సర్వస్వము సర్పించివైచినది.

అన్నపూర్ణాదేవి :

(ఉలికిపడి భ్రాంతయై తెచ్చిపెట్టుకొనిన కోపముతో) ఛీ! ఛీ! అధిక ప్రలాపినీ! నీ నోటికెంత యడ్డులేకుండబోయిన దేమి? తండ్రిగారి యధీనమునందున్న నేను వారి యాజ్ఞల నే శిరసావహించి యాచరింప దగిన నేను, స్వతంత్రించి నా సర్వస్వము నెటుల నర్పింపగలనని తలంచితివే? పాపిష్ఠిదానా.

పార్వతి :

చెలీ! ఆ యున్మాదిని మాటలకేమి గాని, ఆ మహావీరుని నిరుపమాన ధైర్యము, సాహసము, చాతుర్యము, గాంచి నేనునువిభ్రాంతి నొందితినమ్మా,

అన్నపూర్ణదేవి :

అవును. అది అట్టిదియే చూడుము.

పున్నమచందురుంగెలుచు మోమునఁనెప్పుడు మందహాసమన్
వెన్నెలగాయ గన్గవకు విందగుమూర్తి, రణాంగణంబునన్
గన్నులగెంపులీన, లయకాలభయంకర రుద్రమూర్తియై
ఛిన్నపరాంగముల్ గగనసీమల కంపుట చోద్యమయ్యెడిన్.

భానుమతి :

(ఉద్రిక్తయై) నిజము – నిజము. ఆ మహావీరుడు ఖడ్గమాత్ర సహాయుడై అసంఖ్య శత్రువుల నేకవీరుడై తలపడి వ్యూహముం జీల్చుకొనుచు నంతకునివలె ముందున కేగినతీరు భావనాతీతముగదా.

అన్నపూర్ణాదేవి.

(తృప్తితో నవ్వి) నీనోరిప్పుడుమాత్రము నిజము చెప్పినది భానుమతీ!

నిరుపమధీరతన్ ప్రళయనృత్యము సల్పెడు నీలకంఠుడా ?
దురమునదైవదూషకుల దున్మగ దూకినకాలుడా ? నిరం
తరమసురాళి దాకుచుమదంబడగించెడు కార్తికేయుడా ?
సరియెవరింకనీతనికి సంగరభూమిమహత్త్వ సామ్యతన్.

భానుమతి :

నిజము మహారాజనందినీ! నిజము, ఆవీరచూడామణి కభిముఖముగా శత్రువులపై శత్రువులు వచ్చి చచ్చిపడిపోవుచుండిరి. తాళఫలములవలె వారితలలెగురుచుండెను. కాలాగ్నివలె దుర్నిరీక్ష్యుడగు నాశూరపుంగవునకెదురుగావచ్చుటకెవ్వరును సాహసింపజాలరైరి.

పార్వతి :

అవును, అటులరాజాలకయేగదా కడకొక ముష్కరుడు దొంగవలె వెనుకనుండి భల్లమును విసరివైచినాడు ?

భానుమతి :

(ఈసడింపుగా) ఆ, విసరివైచినవాడేమి బాగుపడినాడు ? భల్లాఘాతముతోడనే విద్యుద్వేగమున వెనుదిరిగి విసరిన ఆ మహావీరుని కరవాలాఘాతముచే నా తుచ్ఛుడు హయముతో గూడ రెండుతునకలయి పడినాడు.

పార్వతి :

[ఆశ్చర్యముతో] ఆ గాయములనుండి చిమ్మనగ్రోవులవలె రక్తము చిమ్ముచున్నను లెక్కచేయక నామహావీరుడాపైనిగూడ నెందరు శత్రువుల మర్దించినాడో లెక్కయేలేదుగద ?

భానుమతి :

అవునాయవస్థలో గూడ నాపీఠచూడామణి శత్రుని శ్శేషమొనర్చి సేనదండనాథుని, సైనికులను, బంధనములనుండి విడివడచేసి మనల నెల్ల వారికప్పగించినపిమ్మట నే రక్తస్రావాధిక్యమున నిలువలేక మూర్ఛిల్లి హయమునుండి క్రిందకి జారిపడినాడు.

పార్వతి :

(దిగులుప) ఆతడు మూర్ఛిల్లి పడిన యాదృశ్యముం గాంచినంత నే నాకు నాప్రాణము లేపోయినట్లయినవి.

(కనులవెంట జాలువారు బాష్పముల తుడుచుకొనును)

అన్నపూర్ణాదేవి :

(వీరువురి సంభాషణయు నిర్నిమేషముగా వినుచుండును.)

భానుమతి :

అట్టివాడు కావుననే నాటినుండి (శ్రీ) స్వామివారొనర్చుచున్న చికిత్సలెల్ల నొకఎత్తుగాగా, మన భర్తృదారిక రాత్రింబవళ్ళు చెంత నుండి స్వయముగా సల్పిన మహోపచారములు శతగుణ మహత్తరములై ఫలితమొసగుటచే యీ మహాపురుషుడు జీవింపగల్గినాడు.

అన్నపూర్ణాదేవి :

(భానుమతినిగాంచి) ఇందులో నాగొప్పతన మేమియును లేదు. మనల సంతతి యాపదలో గాపాడనే తెంచిన యీ యుదారుడు గాయములచే కాయమెల్లనిండ, మూర్ఛిల్లి ప్రాణాపదనున్నప్పుడు సేవాజీవుల మగు స్త్రీలము చెంతనుండియు దగిన పరిచర్యలు సల్పకుండుట భావ్యముగా నుండబోదని చేతనైనసేవ యొనరుచుక సల్పుచుంటి నంతియేగదా!!

పార్వతి ;

నిజము మహారాజపుత్రీ నిజము. వేయిమంది పురుషులొనర్చిన యుపచారములకంటె, నోర్పును, నేర్పును తన సొత్తయినకాంత, తన యమృత హస్తముచే - నార్ద్రచిత్తముచే, ననుపమ సేవలొనర్చి రోగిని మృత్యుముఖమునుండియు మరలించుకొనిరాగల్గును. కావుననే సేవాభాగ్యమెప్పుడును స్త్రీలయొక్క హక్కు.

భానుమతి :

(నవ్వుచూ) కావుననే స్వామివారు "ప్రమాదస్థితిదాటినది యిక భయములేదు" అనిచెప్పెడునందాక మన భర్త్రిదారికసేవాభిలాష ఆహారపానీయములం గూడ నంటకుండ సేవచేయుచుండునట్లొనర్చినది.

అన్నపూర్ణాదేవి :

[చిరాకుపడి] నోరుమూయుము నీచురాలా! నీ తెలివికి సంతోషమయినది.

పార్వతి ;

[ఆకాశమునుపలక్షించి] మన ప్రయాణకాలమాసన్నమయి నటులున్నది.

అన్నపూర్ణాదేవి ;

[చూచియావేగముతో] అవును. ఇంక నతిత్వరితముగా నాశ్రమమునకేగి సెలవుగొని వత్తమురండు. [ముందుగా అన్నపూర్ణాదేవియు, తరువాతనామె చెలికత్తెలు నాశ్రమములోనికేగుదురు]

[ఆశ్రమములోపల దేహమందంతయు పట్టీలతో కృశదేహుడు మంచముపై పరుండి రాయలును సమీపమున గూర్చుండి మాటలాడుచు రామకృష్ణకవియు ప్రవేశింతురు]

రాయలు :

[నిట్టూర్చి] రాకుమారి ప్రయాణము నేడే నిశ్చితమయ్యెనా ?

రామకృష్ణకవి :

అవును. యిచ్చట జరిగినదెల్ల వారిసేనాపతి తనుప్రభువునకు వ్రాసియంపినాడట. ఆ మహారాజు మరొకసేనాపతి వెంట మరికొంత పరివారమునంపుచు తక్షణము ప్రయాణమై రావలసినదిగా నుత్తరు వంపినాడట. అందువలన వారెల్లరు నేడే వెడలిపోవనున్నారు.

రాయలు :

(పరధ్యానమున నాలోచింపుచు) ఆమె వారి డేరా లకడ కేగి యున్నదా ?

రామకృష్ణకవి :

లేదు. లేదు యిప్పుడే నీకించుక నిద్దురవట్టుటచే చెలికత్తెలతో మాటలాడుచు వెలుపలనిలువబడియున్నది.

రాయలు :

(మరల నిట్టూర్చి) పూర్తిగా కోలుకొనువరకైన నా యమృత మూర్తి సహవాసమునకు నోచుకొనని మందభాగ్యుడను.

రామకృష్ణకవి :

(నవ్వుచు) అటుల దలపనేల? నీవు సుకుమారియగు నా మహా రాజకుమారి సేవాభాగ్యమందిన యదృష్టశాలివి. అన్నపానాదులం గూడ తలంపక నా దేవీమూర్తి నీకొనరించిన యుపచారములూహా తీతములు

రాయలు :

(ముఖము వికసింప) సత్యము; ఆదయాశాలిని, నిజముగా దేవి మూర్తియే ఆ దేవి ఋణమును నే నెట్టులను దీర్చుకొనజాలను.

అన్నపూర్ణాదేవి ;

(చెలులతో కూడ ప్రవేశించుచు) మేమనుకొనదగిన మాటలనుమీరు బల్కుచున్నారు.

రాయలు :

(చూచి సంతసముతో) అదియెట్లుమహారాజనందినీ ? మృత్యుముఖ ద్వారమున జొరబారిన నన్ను భవదీయశిశిర హృదయపూర్వక మహత్తర సేవాసుధా ప్రదానమున బ్రతికించిన ప్రాణదాత్రివి గాదా?

అన్నపూర్ణాదేవి :

(నమ్రతతో) ఎవరెవరికి ప్రాణదాతలో యీ పవిత్ర సింహాచల క్షేత్రమునకును, శ్రీ నృసింహమూర్తికిని జక్కగా దెలియును.

పార్వతి :

(గోయిలాగ్రి) మహాపీ చూడామణీ తమకీమృత్యుముఖ ద్వార ప్రవేశమునకు కారణము మేమనునుసంగతి జ్ఞాపకముచేయ నవసరము లేదనుకొందును.

రాయలు :

అటులైన నేమి పార్వతీ ? మేము క్షత్రియులము యుద్ధవ్యసనాయులము దుష్టులగు [illegible] యుద్ధమునందంపక [illegible] యుట మా జీవితాశయము. [illegible] మేము యుద్ధమునకు పోవుటకు మీరే కారణమని యెవ్వరు చెప్పచ్చెదరు. [illegible] ఎందు [illegible]

దుష్టకార్యమొనర్చినను యుద్ధము తప్పునా ? యుద్ధముచేసిన గాయములుగాక తప్పవుకదా. గాయములు తగిలినపుడెల్ల మాకిట్టి మహాదృష్టము లభించుట పురాకృత బహుజన్మజన్మాంతర పరిపాకమే యగునను టలో సందేహమేమున్నది ?

అన్నపూర్ణాదేవి :

(ఇంచుక సిగ్గుపడి) కృతజ్ఞతకు నర్థమెరుగనివారనార్యజాతిలో గూడ నుండగనుకొందును. మీరు మాకొనర్చిన మహోపకారములలో మా సేవానిరతిలక్షాంశమునుగాదు.

పార్వతి :

[రాజపుత్రింగాంచి] దేవీ ప్రయాణకాలమతిక్రమించునట్లున్నది.

అన్నపూర్ణాదేవి :

(ఉలికిపడి తన మెడలోనున్న ముక్తాహారమునుతీసి సాభిప్రాయముగా పార్వతిచేతికొసంగును,)

పార్వతి :

(హారముతో రాయలను సమీపించి) మహాపురుషా మా మానప్రాణ సంరక్షకులకు కృతజ్ఞతతోడి యంజలి కంటె నొసగదగిన శక్తి మాకు లేకున్నను, చంద్రునికి నూలుపోగనునట్లు ప్రస్తుతము మేమొసగు దీనిని గ్రహింప ప్రార్థింపుచున్నారము,

రాయలు :

(రామకృష్ణకవివైపు చూచి) మిత్రమా! అశక్తుడనయిన నాకొరకుగా నీ వాహారము బగిగ్రహింపుము.

రామకృష్ణకవి :

(అంజలి చే గ్రహించి రాయలవైపు జూచును)

రాయలు :

నా మెడలోనున్న రత్న హారమును దీసి యీ ముక్తాహార మాస్థానము నలంకరింప జేయుము.

రామకృష్ణకవి :

(రాయలు చెప్పిన రీతిగా జేయును.)

రాయలు :

(చూచుకొని కృతజ్ఞతయు ఆనందమును మేళవింప) నా కొలదికిమించిన దీ బహుమానము. ద్విగుణముగా నిప్పుడు ఋణాగ్రస్తుడనయితిని. (రామకృష్ణకవింగాంచి)

మిత్రమా! సుధామశీతల కరపల్లవ సేవాభాగ్యముచే నా కమృతత్వమును బ్రసాదించిన యీ దేవతామూర్తికి మహారాజపుత్రికి పూజాకుసుమప్రాయముగా నా మెడనుండి తీసిన యీ రత్నహారము నొసంగుము.

రామకృష్ణకవి :

సఖా నీ యీ నిర్ణయము కడుంగడు హృద్యము (రాజపుత్రిని సమీపించి) విదుషీమణీ మా మిత్రుని యభీష్టమును సఫలీకృత మొనర్తువు గాక (అని సంతసముతో నొసంగును)

అన్నపూర్ణాదేవి :

(లజ్జయు, వినయమును మేళవింపదోయిలొగ్గి స్వీకరించి) మహాప్రసాదము ధన్యనయితిని (కన్నులకద్దుకొనును)

(విబోధానందస్వామి ఆకస్మికముగా ప్రవేశించి అందరినిగాంచి తృప్తితో) ఎటుల ధన్యవైతివి తల్లీ !

అన్నపూర్ణాదేవి :

(చూచి యులికిపడి నమస్కరించి లజ్జచే పలుకకుండును.

రామకృష్ణకవి :

నేను విన్నవింతును మహాత్మా ! తన ప్రయాణవేళ నీ మహారాజకుమారి తన ప్రాణరక్షకునకు భక్త్యుపహారముగా నా ముక్తామాలిక నర్పించినది. మా రాజపుత్రుడు సేనాసుత్రామ లొసర్చి తన ప్రాణము నిల్పినందులకు కృతజ్ఞతాపూర్వకముగా నాయనకు కీ రత్నహారము నొసగినాడు.

విభోధానందస్వామి :

(చూచి తృప్తిపడి) హృదయంగమమీనాసన్ని వేశము.

రామకృష్ణకవి :

కాని మహాత్మా నాదొకమనవి. మామిత్రుడాయన కొన్కాను వక్షమునదాల్చినాడు మఱి మా రాజసుతునికొన్క నీ ప్రభుకుమారి గూడ ——

విభోదానందస్వామి :

(అన్నపూర్ణాదేవి వైపు చూచును)

అన్నపూర్ణాదేవి :

(వినయముతో స్వామికి నమస్కరించి) మహాత్ములకు తెలియని దేమున్నది ? నాకీరత్నహారము పూజార్హమైనది. సమయమువచ్చునందాక దీనిని (శ్రీ) జగన్నాథస్వామివారితోపాటుగా నర్చనాపేటికలోనుంచి దినదినమును బూజించుకొనుచుండును.

విభోదానందస్వామి ;

కుమారీ ! విదుషివి, నీకు తెలియని దేమున్నది? అటులే కానిమ్ము మీ సేనానివచ్చి వెలుపలనున్నాడు. ప్రయాణము వేళమించుచున్నదని త్వరపడుచున్నాడు.

అన్నపూర్ణాదేవి :

(ఉలికిపడి వేగముగా శ్రీ స్వామివారి పాదములపై వ్రాలి కనులకద్దుకొని;
చిత్తము. సెలవుగైకొందును. గురుదేవులాశీర్వదింపుడు. (దోయిలొగ్గి
నిలువబడును)

విబోధానందస్వామి :

ఏకొదువయులేని నిన్నింకేమని యాశీర్వదింతును. త్వరలో
వీరపత్నివి. వీరమాతవునగుదువుగాక.

అన్నపూర్ణాదేవి :

(లజ్జపడి) తమకడ మరికొన్నిదినములు శిశ్రూష లొనర్చుచు
నుందమనుకొంటిని కాని తండ్రిగారి యాజ్ఞ యమోఘముగదా
(రాయలవైపు క్రీగంటచూచి ఏమియో చెప్పబోయి మాటాడజాలక మౌనముగ
నుండును)

రాయలు :

(ఖిన్నుడై తనలో) ఈరాజపుత్రి నా హృదయమునుల్లోలకల్లోలితము
నొనర్చుచున్నది. ఈ సుకుమారితో నెడబాటు అను నాలోచనయే
నాగుండియలో బండలను దొర్లించుచున్నది. అన్నపూర్ణాదేవి యవస్థ
గూడ నిటులేయుండదగునని యూహించుచున్నాడను. పొరపాటు
కాజాలదు నాయభిప్రాయమిదిగో !

చూ ఁయుజూడసట్టులను జూచుచుగుందు, బ్రయాణవార్త దా
నై చెవివేయజాలక మహామథనంబకు - గన్నులందు నీ
రాచుకొనున్ - దిశల్గను నయత్నముగా - బులకల్ ఘటించుదా
నీచపలాక్షి చిత్తమున నెట్టి మహారణముప్పతిల్లెనో ?

అగని పాతముసకసు జెక్కు చెదరని నాహృదయమున గల్గిన వ్యథం గాంచియే నేనా సుకుమారి హృదయవ్యథను గుణించుకొనుచున్నా ను. అహో! నాస్థితి దురూహ్యముగా నున్నదికదా—

వంశమేదో యెరుంగ - నివాసమంత,
కధికమెరుగను - సర్వస్వమర్పణమ్ము,
జేసితిని - దానికదియ నాచిత్తమామె,
వశముచెందె - నయో మయావస్థనుంటి.

దండనాథుడు.

(ప్రవేశించి స్వామివారికి నమస్కారమొనర్చి వినయముతో) మా భర్తృ దారిక ప్రయాణమునకన్నియు సిద్ధమైయున్నవి. తా మాజ్ఞనొసగిన మొదల వేగముగా —

విబోధానందస్వామి.

(అన్నపూర్ణ గాంచి) కుమారీ యిక నాలసింపదగు నవసరములు లేవనుకొందును.

అన్నపూర్ణాదేవి :

(స్వామివారితో) చిత్తము. (అని దండనాథుని గాంచి) ఇదె వచ్చునుం టిమి. నీవేగి మా పల్యంకికల నీ మార్గమున నంపుము.

దండనాథుడు.

(వినయముతో) భర్తృదారిక యనుమతి నాచరింతును.

[నిష్క్రమించును]

అన్నపూర్ణ దేవి :

(మరల స్వామిపాదములపై వ్రాలి) పునర్దర్శనము శీఘ్రముగా నగు నటుల నాశీర్వదింపుడు. (కన్నీటిని చెరగుతో నొత్తుకొనును)

విబోధానందస్వామి.

(ఆదరముతో నాయమశిరముపై తనచేతితో నిమురుచు) పిచ్చితల్లీ! స్వస్థచిత్తవై పోయిరమ్ము.

అన్నపూర్ణాదేవి :

(రాయలం గాంచుచు) వీరాగ్రణీ! ప్రాణరక్షకా!! సెలవొసంగుడు. (రామకృష్ణకవింగాంచి) మహాకవీ! సెలవొసంగుడు. పోవజాలక పోవజాలక రాయలను తిరిగితిరిగిచూచుచు నడక సాగించును)

రాయలు :

(సబాష్పస్తబ్ధతనంది చిత్తరువువోలె నుండును.)

[తెర వ్రాలును]

ఓమ్

# ఆంధ్రభోజుడు

## ( నాటకము )



## తృతీయాంకము

(విద్యానగర దుర్గములో నొకచోట - రాజభవనసమీప వసంతోద్యాన వనమధ్య నిర్మితచిత్రశాలయందు శ్రీకృష్ణదేవ రాయలు చిత్రపటముల వీక్షించుచు తదేకధ్యానములో ప్రవేశించుచున్నాడు - ఆభవనమంతయును - చట్రములలో బిగింపబడిన యనేకచిత్రఫలకములు - అన్నపూర్ణాదేవియొక్క - వివిధ సన్నివేశముల లోని వివిధభంగిమలలో చిత్రింపబడియున్న పూర్ణలిఖితచిత్రములు - కించిదూనలిఖిత చిత్రములు - రేఖామాత్రలిఖితములు - ఇటులనెన్నియో యానందమగ్గియుండెను. ప్రత్యేక పీఠములపై, లేఖునకందుబాటులోనుండునట్లుగా - వివిధవర్ణములతో నింపిన పింగాణి పాత్రలును, రకరకములకుంచెలును, లిఖితచిత్రపట సమీపముల నేర్పుగా నమర్చ బడియుండెను. చిత్రశాల నాలుగుశాలలందును ప్రశస్తములగు నిలువుటద్దములమర్చ బడి శోభించుచుండును)

రాయలు :

(చిత్రములవైపొరకజూచిచూచి, దీర్ఘముగ నిశ్వసించి) నా మదికినచ్చిన వాడా మహాకవియొకడే, శృంగారస స్వరూపమునకెంత సత్యముగ నిరూపణమొనర్పగలిగినాడు.

ఒకరుత్కంఠతతో - ననాతురత వేరొక్కండువర్తింప, వా
రికి సిద్ధించు సమాగమమ్మదియి సీ ! శృంగారమా ? కాదుకా
దకటా ! వీడి, పరస్పరప్రణయులై రాశ్యంబునన్ - దేహనా
శకతన్గాంచు, సమానురాగుల కథల్ సత్యంపు శృంగారముల్॥అని

అమ్మహాకవి శిఖామణికి నానమోహాక సహస్రములు. ఆ మహారాజ పుత్రికయు-నేనును- సమానురాగులమే యగుదుమని, దృఢముగా జెప్పగలను నేనా మనోహారిణిని ప్రాణాధికముగా ప్రేమించు చుంటినిగదా! ఆయమయును నాపయి బూర్ణానురక్తయనియే నమ్ముచున్నాడను - యెట్లందమా :

మదవతి మాటలతీరును
సుడతి ననుఁ గాంచుపట్టి చూపుల సౌరున్
మదిరాక్షివైఖరియు, దన
హృదయంబును విప్పిచెప్పవే ? నిక్కముగన్.

అటులుండియు - దైవనియతిచే బరస్పరమపరిచితులము- నే నే దేశమునకు జెందినవాడనో - వారికి దెలియనీయలేను. ఆ యమ యేదేశప్రభువు పుత్రికయో ? మే మెంత యత్నించియు గనుగొన జాలకపోయితిమి - విధివిలాస మత్యంత విచిత్రముగదా! గురుదేవులు మమ్మీగువుర నింత గోప్యముగ నుంచినందులకు దగినంత మహత్తర కారణ మేదియో యుండగలదు. ఈవల విశ్వప్రయత్న మొనర్చియు నేనా మెజాడ నెఱగజాలకబోయితిని - అనేక శతచాంగణసేవితుడనగు నా స్థితియే యిటులుండ-అబల-అసూర్యంపశ్య - అంతఃపురరక్షిత - అనవరతగురుజనాధీనజీవిత - ఆ రాజనందిని, మా వృత్తాంత మెటుల దెలిసికొనజాలియుండును ? అసాధ్యము -

(ఇంచుకసేపు కనులు మూసికొని మౌనముగా నుండి కనులు దెఱచి)

అహో ! నిత్యావసరములైన, సర్వవస్తువులందును నా కాయమన్న పూర్ణాదేవియే గానుపించుచున్నది. కనులుమూసినను, తెఱచినను, ఆయమయే దర్శనమిచ్చుచున్నది - అహోరాత్రములు ప్రత్యక్షమగుచునే యున్నది. ఈ స్థితిలో నాయమ యెవ్వరో దెలియుని యవస్థతో నే నెన్ని దినములు జీవింపగలను (కొంతసేపటులే నిర్విణ్ణుడై యని మేషదృష్టితో

నాకసమును గాంచుచు) ఆ మనోహారిణితో గూడి సింహాచల ప్రాంతమున సంచరించునపుడు, మనోరంజనీ కుసుమములకై గాలించినపుడు, నామదికి హత్తిన కొన్నికొన్ని రసవత్స్థలములకు సంబంధించిన, హృద్యవైఖరులను, చిత్రించి, మాత్రముంచుకొని మాటిమాటికి జూచుకొనుచున్నాడను, అవియే నా కోకించుక యూరటంగల్పింపగలవు.. మరొక విషయముపైకి మరల్పుదమన్నను మనస్సు మరలుట లేదు.

జాతివజ్రమ్ము - వర్ణముల్ క్షణముక్షణము
మార్చి, యత్యంతమోదమ్ము గూర్చురీతి
నరగడియకొక్క క్రొత్తసోయగముపల్చి
లేమ నాచిత్తసీమ బాలించె, నౌర!!

ఆ భంగిమలెల్ల నా శక్తికొలది చిత్రఫలకములమీఁకి గొంపు కొంటిని ఆ చిత్తరువులే యిపుడు నాకు జీవనాధారములై, నా ప్రాణములు నిల్పుచున్నవి.

రామకృష్ణకవి :

(ప్రవేశించి) జయము జయము సార్వభౌములకు - ప్రభువుల సాధనయిపుడెంతవరకు వచ్చినది (నలువైపుల జూచి, చిత్రములెల్ల దిలకించి, తృప్తితో) ఆహా - ధన్యురాలుగదా ! ఆ మహారాజనందిని !

ప్రభువులచే జిత్రింపబడిన యీ చిత్తరువులనెల్ల దర్శింతునుగాక- (తనకు సమీపమందున్న చిత్రపటమును దిలకించిచూచి యాశ్చర్యముతో) ఈ చిత్రముక్రింద నొకపద్యముగూడ వ్రాయబడియున్నది. పఠించెదను.

ఇంచుకవంచినట్టి శిరమిట్టటుదిప్పుచు - ఊవలొత్తియు
తుల్కుంచితపార్శ్వవేధులగు, తోరపుజూపులతోరణాలతో
ముంచి, యలంకరించెనిను, మోదమునొందవు - తృప్తితో
విలోకించవు - కాంతతాక బులకింపవు - స్థాణువువే నికుంజమా ! !

అహో ! కూలంకషమై ప్రవహింపుచున్నదీ మనోదఘ్నలావణ్య కల్లోలిని ఇక నీ రెండవ చిత్రమునుగాంతును. దీనిక్రిందగూడ నొక పద్యముగలదు.

దుర్వారవేగమున, బై
బర్వెడుఘోరాహిగని యవారితభీతిన్
నిర్వర్ణ తారకలతో
నుర్వరమూర్ఛగనబోవునువిదదలంతున్

ఇందొక వర్ణములు క్షరములనియెంచియేకదా! శాశ్వతత్వమునకీ యక్షరములు - గూడ జోడింపబడుట - చిత్రకారుడే కవియుగూడనైనచో నిట్టిసన్నివేశముల గాంచునదృష్టము సర్వదా లభించుచుండును -

కుసుమాపచయపారవశ్యమున. నన్యమనస్కయగు నీ రాజపుత్రికపై బడగవిప్పుకొని దుముకబోవుచున్న నీగిరినాగమెంత భయానకముగనున్నది -

రాయలు :

(మెఱుపువలెలేచి యావేశముతో) ఛీ - ఛీ - పాపీ

వికసితపుష్పరాశివలె, వెన్నవలెన్ - శరదిందుహృద్యచం
ద్రికవలె, నమృతమ్మువలె దివ్యరుచుల్వెదజల్లు రాజపు
త్రిక సుకుమారదేహము, నహో స్పృశియింపవే, విసమ్మునింపగా
సుకరమ ? దుర్భుజంగ ! దయజూపడితండు ప్రియాపకారులన్

రామకృష్ణకవి :

(చిరునగవున) ప్రభూ ! ఇంతకునిది చిత్తరువే సుమా !

రాయలు -

(ప్రకృతిస్థుడై యూషల్లజ్జతో) మహాకవీ ! చిత్తరువుగదా యిది ?

రామకృష్ణకవి :

(సఖేదము) ప్రభువుల నేనిట్టుగా . . . . . . . . . . . . . . . . . . . . . . .
భగవానుడగు . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
ఈచిత్ర మా రాజపుత్రి ప్రయోగాన . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . నర్తించి
నప్పటిది – మిమ్ముద్దేశించు, మిమతో . . . . . . . . . . . . . . . . . . . . . . . . వడుగు
చున్నది. దీనక్రిందనున్న పద్యమును . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

వాలుంజూపులు, హృద్గతంబగు సఖిప్రాయంబుఁ దెల్పంగ, సు
ద్వేలంబౌ ననురాగనిర్ఝరిణి తన్వీదేహమూర్ఛాంతము
ల్లోలంబై ప్రవహింప – గాద్గదికతో, లోమాంచితాంగంబుతో
నాలాపించి మిషన్నికుంజము సమభ్యర్థించుటల్ మెచ్చెదన్.

అహాహా! కన్నులకు గట్టినట్లున్న దీదృశ్యము! కవిత్వమును
బఠించుటతోడనే యీ సన్నివేశము కన్నులకుమొదట ప్రత్యక్షమగు
చుండ నిక చిత్ర ఘనశ్రమము. విడంబనామాత్రమే యగును,

రాయలు :

మిత్రమా! మిగిలిన చిత్రములెల్ల నిప్పటివర కసంపూర్ణములు.

రామకృష్ణకవి :

అదెటుల ప్రభూ! తమ హృదయఫలకమునందా చిత్రములెల్ల
సంపూర్ణతనొందియే యున్నవిగదా!!

రాయలు :

అవును. ఆ దేవీమూర్తి (తన హృదయమును జూపించి ఈ పూజా
మందిరమునందెన్నెన్ని భంగిమలతోడనో ప్రతిష్ఠింపబడి పూజల
నందుచునే యున్నది. [చింతనొంది] నా కంతకంటె నెక్కుడదృష్టము
బట్టునటుల దోపదు సఖా!

రామకృష్ణకవి :

అఖండశేముషీ సంపన్నులగు, అమాత్యశేఖరుల బుద్ధిబలమున నఖిల దిగ్జైత్రయాత్ర సల్పి, యార్యావర్త విజయలక్ష్మీ కరగ్రహణ భాగ్యమలవడ నున్న (శ్రీ)వారి మైత్రి కొఱకు భరతఖండమునందలి సమస్తరాజ్యాధి నేతలును బ్రాకులాడక తప్పదు. అట్టిచో మీ హృదయాధిదేవత, యేరాజన్యనందినియైనను, సప్పాజీ మీకు మహారాణిగా నొనర్పక మానరుగదా!!

రాయలు :

[యోజించి] సర్వసమర్థులగు సప్పాజీ చేయజాలక పోవరు. కాని యీ విషయము వారిమదికి దెచ్చుట యెట్లు ?

రామకృష్ణకవి :

[నవ్వి] తినకుండగనే రుచుల గ్రహించి చెప్పగల యా ధీశాలి, ప్రభువుల వేదనకు కారణ మిప్పటికే గ్రహించియుండును. దానికి తగిన ప్రతిక్రియ నొనర్ప నెంచక మిన్నకుండునా ?

రాయలు :

ఆ యాశయే నాకు ప్రాణములపై విరక్తి గల్పించుటలేదు. అష్టమదశయందున్నాడను కాని వారిప్రభావము దలంచుకొనుటచే నవమదశము దశలు భీతిచే నెడమైపోవుచున్నవి.

రామకృష్ణకవి :

ఆ మహానుభావుడు సర్వసమర్థుడు మా ప్రభువునకట్టి స్థితి గలుగనీయడు, నా కానమ్మకమున్నది.

రవి కిరణాలు పేనిదృఢరజ్జువులంబొనరించు - గాలితో
నవ భవనాళిగట్టు - జ్వలనమ్మున గోడలబెట్టు నిట్టిగా
జిపురులశత్రుసంతతులజీల్చు - జలమ్ముల రాలదేల్చు - నీ
తి విభవ నిర్జితోగ్రసుదు తిమ్మరుసా మహనీయుడల్పుడే ?

అయినను - మీరు విరక్తులై సర్వమును త్యజించి రాజ్యపాలనాభిలాష నుండ మాని, కింకర్తవ్యతావిమూఢులై యీ యుద్యానగేహమును వీడి రాకుండ రాత్రిందివములు తపించి కృశించిపోవుటవలన లాభమేమున్నది ! వారి వ్యవసాయమునకు కొంతదోహదము మీవలన గూడ గా దగియే యున్నదిగదా !

రాయలు :

మహాకవీ ! ఆ బాల్యమిత్రులము - మదీయక్షేమాభిలాష మీ రొనర్చుచున్న మీ యీ యుపదేశమున జాగరితులమైతిమి. నేటి నుండి మత్కర్తవ్యపాలన మొనర్ప బ్రయత్నింతుము, కాని, చిత్తము స్థిరముగానుండుట లేదు.

రామకృష్ణకవి :

మహామాత్యులవారు సమస్త రాజకార్యముల నిర్వహించుటతో బాటు - ప్రభువులచిత్తము స్థిరముగానుండునట్లొనర్చు నుపాయము గూడ యోజింపుచున్నారనుకొందును. అఖిలకళింగోత్కళాంధ్ర ప్రభువుల పుత్రికారత్నముల చిత్తరువులెల్ల తెప్పించి చూచుచున్నారు.

రాయలు :

(ఉచ్చపాటునొంది) మహాకవీ ! మా యశాంతికి కారణము వారి చెవికిగూడ నెక్కనిచ్చితివా ? ఎంతయుపచారము !

రామకృష్ణకవి :

తమరట్లేల దలంపవలయును ? అపారచారచక్షులై అశేష భరతఖండస్థ సమస్త దేశ వ్యవహారములనెల్ల దనధీచాతురిమీర - హృదయదర్పణమునం దేనిముసమునకానిముసము దర్శింపుచు ఎప్పుడే మూలనేవిషయము జరిగిన నంతలో దానిఁ దెలిసికొని ప్రతిక్రియా చరణ దక్షుడగు, నఖండమేధాసముద్రునకు-తమ రాజు హృదయమున నేముం డుటచేనింతచింతచే నంతనొందుచున్నాడో యోజించి, తెలిసికొనుట యనునదొక లెక్కలోనిదిగాదుగదా !!

రాయలు :

ఎంతసిగ్గుచేటు ? (లజ్జాతిరేకమున దలవాల్చి) నేను వారిమొగము నికనెటుల గాంచనోపుదును ?

రామకృష్ణకవి :

ప్రభూ ! ఇందు మీరొనర్చిన యకృత్యమేమున్నది ? అవివా హితులగు రాకుమారులకు - రసజ్ఞులైన వారికి - అనురూపకన్యకలం గాంచి ప్రేమించివివాహమాడ నెంచుట నింద్యకృత్యమని యెవ్వరును భావించుటలేదే ? లోకమెల్లను దానిని ధర్మ్యమైనదానినిగా నెంచి గౌరవింపుచున్నది. గురుజనులమొగ మెటుగాంతుమాయని విచారింప దగిన నేరమిందేమిగలదు ?

రాయలు :

పితృతుల్యులగు పెద్దలదృష్టికిట్టి విషయములు రానిచ్చుటంత మంచిదిగాదని నా యభిప్రాయము.

రామకృష్ణకవి :

వారిసమగ్రతయు - ఇంగితజ్ఞతయు - ముఖవైఖరీ విజ్ఞానమును ఇట్టి విషయములు వారిదృష్టికి రాకుండనుంపనెంత యత్నించినను, తృటిలో గ్రహింపగలవు - కావున దానికైనొచ్చుకొనుటయేల ?

రాయలు :

(లజ్జతో) ఇంతకు నీ విషయమై మీ గురువారితో సంభాషించితి రని నేనూహించుట సత్యమేయగునా ?

గాయకన్యకవి :

నేను వారితో నీ విషయమై భాషింపనేలేదు. వారొనరించు ప్రయత్నముల నెరింగి యూహించితిని.

రాయలు ;

(చకితుడై) ఇక నప్రమత్తుడనయ్యెదగాక ! (స్వగతమున బాధ నభినయించుచు) నాహృదయాగ్నిని మరచిపోగలనా? కర్తవ్యపాలనము నందశక్తుడనై గురుజనముల చిత్తముల కశాంతిని గలిగింపగలనా? నా యొక్కని కామ్యమును బూరించుకొనుటకొరకు, వ్యామోహితుడనై దోషినిగ జాలను - దక్షిణాపథ మాతృసేవను విస్మరింపజాలను - సర్వ భారత ప్రజాక్షేమమునకు, వలసినచో - ఆ యజ్ఞకుండమున నా జీవిత హవిస్సును వ్రేల్చనైనగలను. నా సర్వసుఖములందు బడి మాడి భస్మమై పోయినను - పోవుగాక - నా వలపు తలపులందు బూర్ణాహుతి సేయబడిన - బడుగాక - మదీయజన్మ సాఫల్యత నందినటుల సంతసింతును. కామదేవతోపాసనకై - నా క్షాత్రతేజమును నా దేశ మాతృపాదసేవా పటిష్ఠమగు సత్వమును - బలియొసగజాలను - అన్నపూర్ణాదేవి సంస్మరణమును త్యజింపగలనా ? ఆబద్ధము - అదియు జేయజాలను, కాని; సద్గుణమునే నా కర్తవ్యపాలన మొనర్చెదను.

(తెరలో వైతాళికులు - బిగ్గరగా)

కం॥ మండలికతపన శోభిత !
కుండలిపతిశయన కర్ణకుండలిత రసా
ఖండకవికావ్య ! దిగ్వే
దండశ్రుతిదళన ! కలహాశాధితపటహా ॥

"కం॥ బిసరుహనయనా ! నవవిధ
కుసుమాయుధ ! యువనకుధరకూటాంచల ! భూ
విసృమరతేజశ్చంపక
భసలదసత్కీర్తి మలినపరిపంథి నృపా ॥"

"ఉ॥ కాయమువంగితాముదిసె, గన్నులకుంబొరగప్పె, గాలుపే
దాయెనటంచు రోశి, నరసాధిపనందన కృష్ణరాయ ! యా
భూయువతీలలామ నినుబొందిన, నాదిభుజంగభర్తకున్
బాయనిచింతచేత దలప్రాణముతోకకురాకయుండునే॥"

"ఉ॥ ఏపున కృష్ణరాయజగతీశ్వరు ఖడ్గము, మింటమార్గమున్
జూచిన, బానుమండలము సొచ్చి, హుటాహుటి శత్రులేగుచో
రేపటిబాపనయ్య, పగలింటిమహోగ్రపు జంగమయ్య, యో
మాపటి దాసరయ్య, మముమన్ననసేయుమటందురెంతయన్"

(వైతాళికులు పఠనమొనర్చి విరమింతురు)

(వృద్ధకంచుకి ప్రవేశించి, రాయలవారికి వంగి నమస్కరించి, జయము జయము సార్వభౌములకు – (వినయము) మహామంత్రులు, తిమ్మరుసయ్యగార్లు – ఏలినవారితో ఏవో మంతనాలాడదలచి, ఆలోచనామందిరములో కూర్చుండివుండి, (శ్రీ)వారితో మనవిజేసిరమ్మని, నన్ను తమ సన్నిధికి పంపినారు – దేవరవారి చిత్తము.

రాయలు :

(కంచుకితో) ఇదే పోవుదము. దారిజూపుము (రామకృష్ణకవి దిక్కు) అప్పాజీని దర్శించివత్తుము. త్వరలో పునర్దర్శనమగునటుల ననుగ్రహింపుడు

రామకృష్ణకవి :

(సంతోషముతో) శుభమగుగాక – మేరుధీరులగు ప్రభువుల పయాణము – సకలాభీష్టసిద్ధిప్రదమగుగాక –

రాయలు :

(మందహాసముతో) మహాకవుల యోగీగ్యావ మనోఘముగదా!
(కంచుకిదిక్కు) ఇక సనుపుము.

వృద్ధకంచుకి :

(మందము పరిక్రమించుచు) దేవా! ఇటు యిటు –

(ఇర్వురును కొంతదూరము వేగి ఆలోచనాగృహమును జొత్తురు తెరయెత్తగా- మందిరములో నద్హాసనోపవిష్టులై తిమ్మరుసుమంత్రియును – రాయలును – సహాస్యముగ మాటలాడుకొనుచుందురు. సుందరమున వృద్ధకంచుకి కావలిగాయుచుండును)

(భృకుటితో) అప్పాజీ! అంతటి నాగోస్వామిస్వామితో, ఆగ్రహోదగ్రునితో – మనకు బాంధవ్యమా? –

తిమ్మరుసుమంత్రి ;

వత్సా! దాని కనేక కారణములు గలవు – వాటినిగాత్యాత సమగ్రముగ జర్చింపుకొందము – మొదటిమాట యేమన, ఆకట కేశ్వరుని పుత్రిక :- అనుపమ సౌందర్యనిధియే కాక; అనవద్య విద్యా విశారదయునుగూడ విని యుంటిని కావున, మీ జాయాపతీత్వమెల్ల విధముల దగినదని యోచించితిని సుమా!

రాయలు :

(ఆలోచింపుచు) ఆ బాలికపేరు తెలసికొంటిరా?

తిమ్మరుసుమంత్రి ;

తుక్కాదేవి యని వినియుంటిని – శుకశబ్దమున ఉత్కలభాషా వికృతి యని దలచుచున్నాడను –

రాయలు :

(కోపముతో) మరి యా కటకేశ్వరుని దురహంకారమునుగురించి యేమందురు? దానిని మనము సహించియేగదా వాని బాంధవ్యము నకు లోనగుట? –

తిమ్మరుసుమంత్రి.

వత్సా! మనసంకల్ప సిద్ధికై యిట్టి దురహంకారుల నెందరినో మనము వివిధోపాయముల లోబరచుకొనవలసి యున్నది. వీని నీ మార్గమున లోబరచుకొననే నీప్రయత్న మొనరించితిని. కాని అది యాదిలోనే బెడిసికొట్టినది (తలవాల్చును)

రాయలు :

వీనిని మనము రణ మొనర్చి లోబరచుకొనజాలమా?

తిమ్మరుసుమంత్రి.

వత్సా! తొందరపడకుము నేజెప్పునది శాంతముగవిని యాపైని నీ అభిప్రాయము దెలియపరచుము. (యోజించి,) ఆర్యావర్త మెల్ల మరుష్క సేనాప్రవాహములచే దలమున్కలై పోయినది. అన్యమతస్థులగువారం గుట సామ్రాజ్యములను స్థాపించి, పాదుకొనిపోయినారు. రత్నగర్భ యగు భరతఖండ మహదైశ్వర్యమెల్ల గొల్లకొట్టబడినది. పవిత్ర వేద మతములెల్లను భగ్నప్రాయములైనవి. తపోధనులగు మహర్షిపుంగవు లచే సంపాదితములైన, ధర్మగ్రంథములెల్ల, శ్రుతులు – స్మృతులు. పురాణములు – ఇతిహాసములు – దర్శనములు. పురుషార్థముల నాల్గింటిపైని విస్తారముగ, రచింపబడిన సర్వగ్రంథములును దగులబెట్టబడి భూతి మాత్రశేషములైనవి. గో బ్రాహ్మణార్తరావములతో నీపుణ్య భూమియెల్ల ఘూర్ణిల్లుచున్నది. గోమాంసభక్షణలతోడను మహాపతి వ్రతల మానభంగములతోడను పవిత్రహైందవుల బరమతస్థుల జేయుట తోడను – ఆర్యావర్తమెల్ల నట్టుపలె నుడికిపోయినది. కాని యోరుగల్లు సామ్రాజ్యము పుణ్యమాయుని, దక్షిణాపథము మాత్రము, అంతటి దురాగతముల పాలుగాకుండ గాపాడుకొన్నది, కాని కాల గతి నా మహాసామ్రాజ్యముగూడ పతనమైనంతనే మధ్యమున బహమనీ సామ్రాజ్య మేర్పడినది. దక్షిణాపథ ప్రాగ్భాగమునెల్ల నీ

రాయలు :

మీయానతి మాకుశిరోధార్యము. నాప్రశ్నమున కింకను నుత్తరము లభింపలేదు. మనము సంగరమొనర్చి వానిజయింపం జాలమా?

తిమ్మరుసుమంత్రి ;

తొందరపడకుము – నేను పైనిజెప్పిన యాసమున్నతుడగు సార్వభౌముడవునీవేయని గూడ తెలిసికొంటివా ?

రాయలు :

[ఆలోచించి] అనల్పశేముషీ మనీషుల ప్రజ్ఞాపాటవములను నే ననుమానించువాడనుగాను – కాని – గజపతి సైన్యముల నెదుర్కొని జయింపగల సైనికశక్తి మనకు గలదా? లేదా? తెలియ జెప్పుడు.

తిమ్మరుసుమంత్రి :

వత్సా! ఒక గజపతిసైన్యము నేగాదు. దానికి సాయముగ, నీ దక్షిణాపథమునంగల తురుష్కరాజ్యము లెల్ల నెత్తివచ్చినను, జయింపగల సైనికశక్తి నీకు గలదు.

రాయలు :

అటులైన మనము యుద్ధప్రయత్నమేల చేయగూడదు? గర్భశత్రువుతో నీ వియ్యపుజాబు లెందులకు? –

తిమ్మరుసుమంత్రి :

వత్సా! ఇది రాజనీతి–నా నీతికి మించిపోయినపుడు మాత్రమే మీ చేతికి బని గలుగును. అంతేగాని – సైన్యబలము గలదుగదా యని మాటిమాటికి దండోపాయము నే యుపాసింపబూనుటంత మంచి పనిగాదు. భూపతులకు సేనలు – మానిపతుల తపమ్ములవంటివి, చూడుము –

మునినాథుల్వ్యయముంబొసఁగక దపస్సుత్తుల్సల్పియార్జించు రీ
తిని, భూనాథులు సైన్యసంపదల నెంతేగూర్చి సంరక్షణం
బును సల్పుండగు - దీర్పరాని కొఱగా ముల్వచ్చసంగాని - రెం
టిని - నావంతయు ఖర్చుసేయఁదగ దిక్లేసెప్పి రార్యోత్తముల్ -

విశ్వామిత్రమౌని మారీచ సుబాహుదైత్యుల శపించి నాశ మొనర్పలేకయేనా! రామలక్ష్మణుల దోడ్కొనివచ్చినది?

రాయలు :

(ఆలోచించి) అయిన నిందు దనయభీష్టము దెల్పుము ?

తిమ్మరుసుమంత్రి ;

ఎత్తా! ఇంతకును మనము వ్రాసిన లేఖకు - గజపతి యంపిన ప్రత్యుత్తరమును నీకు వినిపింపనేలేదు.

రాయలు :

(నిరసనగా) అతడొసగెడు ప్రత్యుత్తరముగూడ నతనికన్నను నీచముగ నేయుండజాలును - చదువుడు -

తిమ్మరుసుమంత్రి :

(లేఖనందుకొని సెమ్మదిగా) "వంశమర్యాదలచేవాసించు నుత్తమ క్షత్రియ సార్వభౌముల పుత్రికను - దాసీపుత్రునకొసగుమని, యర్థించుటలో గల మీ యవివేకమును మేము మన్నింపజాలకున్నారము. ఇకనైన యోగ్యతనుపాసించుట నేర్చుకొనుడు."

ఇదియాతని బ్రత్యుత్తరము.

రాయలు

(బొమముడితో దీర్ఘాలోచన సల్పుచు నిశ్వసించి) అప్పాజీ! యేమిది? నేను దాసీపుత్రుడనా? (కోపముతో పండ్లు పటపటగొరుకుచు) వీని యీ వ్రాతకు కారణమేమి ?

తిమ్మరుసుమంత్రి :

మీ తల్లిగారును మీ పెదతల్లిగారును గూడా సుక్షత్రియుల ఇంటి యాడుబిడ్డలే యగుదురు. మీతండ్రిగారగు నరసింహదేవరాయ ప్రభువులు వీరిర్వురను ధర్మ్యవిధినుద్వాహమొనర్చుకొనినారు. సుప్ర సిద్ధ క్షత్రియవంశజాతలగు నా తిప్పాంబయు నాగాంబయు సమాన ముగా పతిదేవుని యనుగ్రహమునకు పాత్రురాండ్రయి యక్క చెల్లెండ్రవలే నెంతయో ప్రేమతో కాలము గడుపుచు వచ్చినారు. కాని కాలమహిమ ఒకనాడు వారిరువురును జదరంగమాడుచు ఈ మారు గెలిచినవారికడ నోడినవారారుమాసములూడిగము సల్పుచుండు నటుల పందెమొడ్డుకొనినారట. మీతల్లిగారోడిపోయిరి. అట్లయ్యును మీపెదతల్లిగారాయమనెంతో మన్ననతో గాంచుచునే వచ్చిరట ఆ యారుమాసములు నడుమనే నీవు జన్మించితివి. అపరవైనతేయునివలె నుదయించిన నిన్ను గిట్టనివారు కొందరుమాత్రము చాటుచాటున దాసీపుత్రుడు దాసీపుత్రుడని మాటాడుచూవచ్చినారు. జలమునంబడిన తైలమువలె దుర్వార్తలు నిముసములో వ్యాప్తినొందునుగదా! అటులే ఈ నీలివార్తయు దేశదేశములబొక్కి కటకేశ్వరుని చెవింగూడ బడి యుండవచ్చును. కావచ్చునుగాక ! ఆ దురహంకారి ప్రత్యక్షముగా ననకే యటుల వ్రాయుట వాని శౌర్యమునకు తార్కాణము.

రాయలు :

(ఆగ్రహముతో) ఆ – ఏమి వాని కండకావరము ?

గోసాహాయ్యముగోరు ద్రోణునిపయిం గోపించి పాంచాలరా
జే సన్మానమునందె నర్జునునిచే నే తన్మదాంధుండు, దా
నా సన్మానముబొందెడిన్ కటకరాజప్పా ' భవచ్ఛిష్యుచే
దాసీపుత్రు డెవండొ ? తా నెవడొ ? యుద్ధంబంధు దెల్పందగున్.

నవరాత్రోత్సవములు పూర్తియగుటతోడనే చైత్రయాత్రకు సన్నాహము లొనర్పుడు (కొంచెమునే పూరకుండి) భువనవిజయ సభానిర్మాణ మేఘట్టములో నున్నది ?

తిమ్మరుసుమంత్రి :

వత్సా ! పూర్తియయినది. కార్తాంతికులచే ముహూర్తము గూడ నిర్ణయింపబడినది. ప్రభువులపేరిటికి విజయదశమియే సర్వలక్షణ సంపన్నముగు సభాప్రవేశ ముహూర్తమని నిశ్చయింపబడినది. నాటికే తెంచునటుల మన సామంతులకును మిత్రరాజన్యులకును సరదార్లకును సమస్త సేనానాయకులకును మహాపండితులకును వీరులకును కళాకుశలురకు శ్రీమంతులకను ప్రముఖులకెల్ల నాహ్వానపత్రిక లంపబడినవి. శ్రీముఖములు జారీ సేయబడినవి. పట్టణములయందునూ పల్లెలయందును చాటింపులు వేయ నుత్తరువు లొసంగబడినవి. నవరాత్ర మహోత్సవములకును భువనవిజయ సభాప్రవేశ మహోత్సవమునకును ప్రయత్నములు చురుకుగా సాగుచున్నవి. వత్సా! నేటినుండి నీవు నీయిష్టము నను సరించియే వాటినెల్ల శ్రద్ధతో విచారించుకొనుచుందువనియాశింతును.

రాయలు :

(లజ్జతో) విచారించుకొనుట కష్టము కాదుగాని, పితృసమానులగు తమరు సర్వము నిర్వహించుకొనుచుండ నేనింతుక విశ్రాంతిగొనుచుంటిని.

తిమ్మరుసుమంత్రి :

కాదు వత్సా! మే మెందర మెన్నివిధముల విచారించుకొను చుండినను

రాజ్యపరిపాలనంబను రథము నడుప
నిరుసుబోలినవాడు భూమీశ్వరుండు
సైన్యధనచారశక్తులు సైంధవములు
మంత్రిసారథితోటిసమానుడగును -

కావున సర్వమును నీమీదనే యాధారపడియున్నది ఆ విషయ మునుమాత్రము మఱవబోకుము.

[తెరలో వైతాళికులు బిగ్గరగా]

''శ్రీవేంకటేశ పదప
ద్మావేశితసదయహృదయ ! హరనిటలనట
త్పావకపరిభావిమహః
ప్రావృతనిఖిలాశ ! కృష్ణరాయమహీశా.''

"శ్రీనందన సౌందర్య ! సు
ధీనందన ! వితరణావధీరితబలిరాట్
భానుజ! పరరాజన్య
ర్భాను భుజాహీంద్ర కృష్ణరాయనరేంద్రా"

"నాగాంబాసుత ! జితకద
నాగతమదనాగ సంగమానూపగృహా
భోగా ! భోగపురంధర !
భోగీంద్ర శయాన పురుషపూజాప్రవణా"

"శ్రీకృష్ణరాయమనుజేం
ద్రా! కాంతాపంచబాణ! నరసింహధరి
త్రీకాంతగర్భవార్నిధి
రాకాహిమధామ! కర్పూరదళవిరామా"

[అనిచదివి చాలింతురు]

తిమ్మరుసుమంత్రి :

కాలాతీతమైనది. కంచుకీ! ప్రభువులనంతఃపురమునకు దోడుకొని పొమ్ము. (నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)

---

## తృతీయాంకము

(భువనవిజయమహాసభ. (అన్ని హంగులతో గడువిశాలముగ నిర్మింపబడిన సభామంటపము - నడుమ దైవాంశమానుషాంశలయంతరమున నెత్తైయున్న చంద్రకాంత మణినిర్మితవేదికయందు నవరత్నఖచిత స్వర్ణసింహాసనముపై శ్రీకృష్ణదేవరాయలు సార్వభౌములాసీనులైయుందురు - చామరగ్రాహిణులిరుప్రక్కల నిలిచి మెల్లమెల్లగా విసరుచుందురు.

(సింహాసనమునంటి వెనుకగా రత్నఖచిత హేమదండము కలిగి మంచిముత్యముల జాలరులచే శోభించుచున్న వెల్ల పట్టుగొడుగు ప్రభుశిరముపై ప్రకాశించుచుండును పురోభాగమున యథోచితాసనములపై ప్రధానమంత్రియగు తిమ్మరుసు తదితర శాఖామంత్రులు చతురంగబలముల సేనానాయకులు సామంతరాజన్యవర్గము సరదారులు శ్రీమంతులు పెద్దలు, భూస్వాములు, పరదేశముల రాయబారులు వామదక్షిణ భాగముల వరుసలు దీర్చి కూర్చొని యుందురు. ప్రధానమంత్రి కభిముఖముగా నుచితాసనములపై రాజగురువులగు శ్రీమత్ తాతాచార్యులవారు గూర్చుండియుందురు. వారి నంటివరుసగా మహాకవులగు అల్లసాని పెద్దన, నందితిమ్మన, మాదయగారి మల్లన, ధూర్జటి కవి, రామకృష్ణకవి, కుమారభట్టుమూర్తి మొదలగువా రగ్రాసనములకూర్చుండి యుందురు. వారికభిముఖముగా శ్రీ విద్యారణ్య విరూపాక్ష పీఠాధిపతులగు జగద్గురువులును ఏతత్ సంస్థాన మహాపండిత వేదండములును, చతుర్వేదసమభ్యాపకులును, రాజపురోహితులును, సకలాగమవేదులును గూర్చుందురు. ఆ రెండుపంక్తులనంటి యథోచితాసనములపై గాయకశిఖామణులు శిల్పసమ్రాట్టులు చిత్రలేఖనకోవిదులు మల్లవిద్యాధురీణులును, భాస్కర్యకళాకోవిదులు నాసీనులై యుందురు, వీరి కావలగా మంటపమెల్లను దర్శనాగతులగు మహాజనులనేకులు - తత్తదుచితాసనములపై నిండి కూర్చుండి యుందురు. నడుమ నడుమ వేత్రహస్తులగు రాజభటులు నిలువబడియుండి నిశ్శబ్దమును సాధించుచుందురు. మహాప్రతీహారిం బురస్కరించుకొని ప్రధాన ద్వార

మందును పాణిద్వారములయందును, ద్వారపాలకులాయుధపాణులై కావలిగాయు చుందురు. పార్శ్వభాగముల ప్రత్యేకముగ నిర్మింపబడిన యదృశ్యగృహ ములలో రాణివాసస్త్రీలును రాజ్యమందలి గొప్పరేండ్లపడతుకలును నిండి ఇతరులు తమ్ము చూడరాకయే తామెల్లవిషయములచూచురీతి నీమహోత్సవమును దిలకించుచుందురు. రెండుబారులుగా దీరి వందులుమాగధులు వైతాళికులు భట్టులు నిలచి కైవారము లొనర్ప నారంభింపగా తెరయెత్తబడును)

శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వరా!
జయీభవ!. విజయీభవ! దిగ్విజయీభవ!

(ఈకైవారములన్నియు వందిమాగధాధులు రెండువరుసలుగా నిలువబడి ఒకవరుసవారు బిరుదములు చెప్పుచుండగా రెండవవరుసవారు జయశబ్దములను బల్కు చుందురు. మార్చిమార్చి ఈపద్ధతి సాగుచుండును)

శ్రీ శ్రీ శ్రీ విద్యానగర సమలంకృత భువనవిజయ మహాసభా మంటప నవరత్న సింహాసనాసీనా!—

జయీభవ! విజయీభవ! దిగ్విజయీభవ!

శ్రీ శ్రీ శ్రీ ఆంధ్ర కర్నాటక సముజ్జ్వల రాజ్యరమారమణా !-

జయీభవ ! . . . . . .

శ్రీ శ్రీ శ్రీ తుళువవంశపయఃపారావార రాకాసుధాకరా!

జయీభవ ! . . . . . .

శ్రీ శ్రీ శ్రీ "అఖండఖండపరశు కుండలిపరిబృఢా ఆఖండల, మహోద్దండ వేదండ డిండీర పుండరీకపటీర హీర హార తార తారకా చల నారదా పార-పారద శారదా శారదశరద శరరాజహంస విరాజ మాన కీర్తిచంద్రికాధవళిత బ్రహ్మాండభాండా"—

జయీభవ ! . . . . . .

శ్రీ శ్రీ శ్రీ "భాండాగారభరితనిబిడ ద్రవిణమణిగణగణనీయ వైభవాధరీకృతవైశ్రవణా"—

జయీభవ ! . . . . . .

శ్రీ శ్రీ శ్రీ "శ్రవణభూషాయమానసుధామధురకరణ నిపుణ, నిఖిలపురాణేతిహాస కథాప్రసంగా"—

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ "సంగరాంగణ జయారమాంగనా సమాలింగిత జాగ్రతనిజభుజాగ్రత ఖడ్గధారావిఖండిత విమతమండలీ గళగళద్రక్త ధారాప్రవాహాభిషిక్తశుభ్రదాప్రహర్షితరత్నాకరా"—

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ "కరారవిందబంధురాంబురుహ రేఖాద్యనేక శుభలక్షణ భ్రాజమానా"—

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ "మానవతీమనోహరాకార రేఖావిస్ఫురిత నవ నలకూబర జయంత, వసంత, యామినీకాంతా"—

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ 'కాంతస్వకీయ బాహుప్రతాప ప్రభావిఫాలిత, రసాలసాలకిసలయ, కింశుకప్రసవకాంచన కల్హార కురువిందకందళదళ త్కనక కేతకీప్రసూనా."

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ "సూనృతవచోవిసర్జిత హరిశ్చంద్రా!

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ "చంద్రసగభీరా!'

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ "ధీరజనహృదయ రంజకవిహారా!"

జయీభవ! . ... ...

శ్రీ శ్రీ శ్రీ హారవిభూషిత మహాకవి పండిత మండనాయమానమహా సభా భాసమానాంధ్రభోజా !

జయీభవ! ... ...

శ్రీ శ్రీ శ్రీ అంభోజాలయా ప్రతిమాన, నాగాంబికా నరసింహా రాయజాయాపతీ భాగ్యనిధానా౽పరబిడౌజా!!—

జయీభవ! ... ...

"భువనవిజయాఖ్యసం స
న్నవరత్నవిభాప్రభాత నలినాప్త! రమా
ధవచరణ కమల సేవా
ప్రవణమతీ! వీర రుద్రపర్వతవజ్రీ!!"

జయీభవ ! .. ...

ఏకచ్ఛత్రిత సర్వభూతల నృసింహేంద్ర క్షమాభృత్తపః
పాకద్యోతిత రూపమౌక్తిక తులాభార ప్రదానోన్నతా !
కోకస్తన్య సమాస్త్ర సన్నిభ ! హరితూర్యాలంకపోద్యద్యశ
శ్రీ కర్ణాట మహీశ! వైరి కరిరాట్సింహ ప్రతాపోదయా !!"

జయీభవ ... ...

సీ॥ తొలగెను ధూమకేతు క్షోభ జనులకు
నతివృష్టి దోషభయంబు వాసె,
గంటకాగమభీతి గడగె నుద్ధతభూమి,
భృత్కంటకంబెల్ల నెత్తువడియె,
పాసెనఘస్ఫూర్తి మరుభూములందును
నెల మూడువానలు నిండగురిసె,
నాబాలగోపాల మఖిల సద్ద్రవ్యజమును,
నానందమున సుభిక్ష నతిశయిల్లె.

ప్రజలకెల్లను గడు రామరాజ్యమయ్యె,
జూరు సత్వాడ్యు డీశ్వర నారసింహ,
భూవిభుని కృష్ణరాయ డభ్యుదయమంది.
పెంపుమీరగ ధాత్రి బాలింపుచుండ.

జయీభవ ... ...

"అన్నన్న ! తమరు సింహాసనంబెక్కిన
నిభరాజుతాగొండ లెక్కదొడగె
నయ్యారే ! తమరు పట్టాభిషిక్తులుగాగ
సింధురాణ్ణాత్రముల్చిమ్మగిల్లె
హైసరే ! తమరిపేరనినమాత్రముననే
కురుదేశమేల్రాజుగుండెలదరె
నోహో ! తమరు ఖడ్గమొక్కింత ముట్టిన
సకలారిసంఘముల్సంచలించె

మాయురే ! నరసింహకుమార ! వీర
తల్లజమ ! ఫుల్లపద్మాక్ష ! ధర్మమూర్తి !
స్వామి ! శ్రీకృష్ణదేవరాట్సార్వభౌమ !
ఘనవిరోధి నృపాసురకార్తికేయ ! ''

జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవ॥
జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవ॥

(ఈ జయజయధ్వానములు సభయెల్ల మారొ్మ్రోగుచుండగా - వందులు - మాగధులు - వైతాళికులు - భట్టులు - రెండుపంక్తులవారును - సార్వభౌములకు నమస్కరించి - వెనుకకు నడచుచు నోసరిల్లుదురు)

తిమ్మరుసుమంత్రి :

[రామకృష్ణకవినిజూచి కన్నులతో సంజ్ఞ చేయును.]

రామకృష్ణకవి :

[లేచి మహారాజపురోహితుని కై పుజూచి వినయముతో] పురోహితుల వారు సార్వభౌములను వేదమంత్రపూర్వకముగా నాశీర్వదింపుచు పరిషత్తు నారంభింతురుగాక.

[సాంగవేదాధ్యాయి మహారాజ పురోహితుడు లేచి అక్షతలు పుష్పములు లాజలు చేతిలో పట్టుకొని ప్రభుసన్నిధికి వచ్చి నిలచి]

హరిః ఓం-సంజ్ఞానమ్, విజ్ఞానమ్॥ కల్యాణః॥
శతమానంభవతి॥ ... ... ప్రతితిష్ఠతి -

[ఇటుల నాశీర్వాద మొనర్చి, అక్షతలు పుష్పములు సార్వభౌముల మస్తకముపయి నమ్రతతో వైచి వెనుకకు వెనుకకు జరిగిపోయి తన యాసనమున గూరుచుండును].

రామకృష్ణకవి :

[సార్వభౌముల గురువులును - మహాకవి పండితులునగు శ్రీ తాతాచార్యులను గాంచి] గురువర్యు లుపక్రమింతురుగాక -

తాతాచార్యులు :

[లేచి - అక్షతాదులందోయిట గ్రహించి సార్వభౌముల సమీపించి - మన్ననతో]

వీరాగ్రేసర కృష్ణరాయనృపతే ! త్వద్వైరికాంతావనే
ధావంత్యః - కుచయూన రోమలతికా వ్యాహారలీలాఘృతః
ప్రాప్తాః - కోక, మహేభపన్నగ శుకాన్ - రుంధంతి వక్త్రేందునా -
మధ్యేనాపికచేన, కంకణల సద్వైడూర్యరత్నైరపి॥
వీరాగ్రేసర కృష్ణరాయ ! భవతాకృత్తారణ ప్రాంగణే
ప్రౌఢాఃకేచనపారశీకపతయః - ప్రాప్తాఃపురీమామరీం
పీరుత్తేతిగురౌ, బలద్విషిసురత్రాణేతి, శచ్యాంపునః
బిబ్బీతి, ప్రణతౌ సలామితి సురాన్స్మేరాననాన్ కుర్వతే॥

[సార్వభౌముని శిరముపై సేసలుజల్లి వెనుకకు వచ్చి కూర్చుండును ]

రామకృష్ణకవి :

[అల్లసాని పెద్దనవైపు గాంచి] కవి పితామహులు; దయ చేయ వలయును.

పెద్దనామాత్యుడు :

(లేచి అక్షతాదుల దోయిలింట గ్రహించి సార్వభౌముల సమీపమునకు వచ్చి సాదరముగా ప్రభువుం గాంచుచు)

"శ్రీకృష్ణరాయ గుణ ర
త్నాకల్పా ! కల్పక ద్రుమాధికదాన
శ్రీ కుతుకాగత లోకా
లోకాంతరసకలసుకవి లోకస్తుత్యా"

(అక్షతాదుల ప్రభుశిరముపై జల్లి వచ్చి కూరుచుండును)

రామకృష్ణకవి :

(నందితిమ్మనం గాంచుచు) తిమ్మకవిగారు - దయచేయవలయును -

ముక్కు తిమ్మకవి :

(లేచి యక్షతాదుల దోయిటం గొని ప్రభువును సమీపించి)

చక్రవర్తి మహాప్రశస్తి నాడును నేడు
చెలగి ధర్మక్రమ స్థితిఘటించె
భూ భృదుద్ధరణ విస్ఫూర్తి నాడును నేడు,
గోరక్షణఖ్యాతి, గుదురుపరచె,
సాధుబృందావన సరసి నాడును నేడు
వంశానురాగంబు వదలదయ్యె
సత్యభామా భోగసక్తి నాడును నేడు
నాకల్పమవని నింపారనిలిపె

"నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మొందెను వసుదేవ మనుజవిభుని,
కృష్ణుఁడను పేర - నరసేంద్ర కృష్ణదేవ,
రాయఁడను పేర నాఁడిదారాజుఖుండు"

(అక్షతాదులు ప్రభుశిరముపై జల్లివచ్చి కూరుచుండును)

రామకృష్ణకవి :

(ధూర్జటికవిఁ గాంచి) కవిహర్యక్షా దయసేయవలయును-

ధూర్జటి :

(లేచి యక్షతాదులనెల్ల దోయిటం గ్రహించి ప్రభు సమీపమున కేఁగుదెంచి వినయముతో)

"నరులలోన నరాధిపస్ఫురణ మెనయు
నతఁడు నేనని భగవంతుఁడనిన వాక్య
మెఱుఁగరె ? తదంశజుండు శ్రీకృష్ణరాయ
లెంచిచూచిన సామాన్య నృపుఁడె మహిని"

(అక్షతలు ప్రభుశిరముపై జల్లి వచ్చి కూరుచుండును)

రామకృష్ణకవి :

(మాదయగారి మల్లనకవిం గాంచి) కవికుంజరమా ! రండు

మాదయగారి మల్లన :

(లేచి యక్షతాదులు [illegible] ప్రభు[illegible])

"విశ్రుత [illegible] కృష్ణవిభుఁ డిట్లంగల్వాపో, నాటి భే
రీ రావంబులు [illegible] ప్రీలింప భీరాత్ముడై
[illegible] వెన్నాడు స్వి
[illegible]"

(అక్షతాదులు ప్రభు[illegible] వచ్చి కూరుచుండును).

రామకృష్ణకవి :

(కుమారభట్టువైపు గాంచి) కవిశిరోమణీ ! రమ్ము.

కుమారభట్టు :

(లేచి పుష్పాంజలిని దోసిటఁగొని, వినయముగను)

ప్రబల రాజాధిరాజ వీరప్రతాప
రాజపరమేశ్వరా ! మూరు రాయగండ !
ద్వేషిధరణీశ రూపచిత్రిత హిరణ్య
గండపెండేర భాసితోద్దండ చరణ !"

(పుష్పాంజలి ప్రభుపాదములపై జల్లివచ్చి కూరుచుండును)

ధూర్జటి :

(లేచి రామకృష్ణకవివైపు గాంచి) కవిశిరోరత్నమా ! మమ్మెల్లర నీవు నిర్దేశించితివిగదా! నీ యాశీస్సులు ప్రభువుల కందవలదా ! కవిమండలికి ప్రతినిధినై నేను వినయముగా నిన్ను నిర్దేశించుచున్నాను.

తిమ్మన :

రామకృష్ణకవీ ! నీమిత్రుఁడు నాశీర్వదింపుము !

రామకృష్ణుడు ;

(లేచి అక్షతాదులదోయిట గ్రహించి ప్రభువును సమీపించి)

"వ్యాయామస్థిర సంధిబంధ కటుకార్యజ్ఞాను గక్షోణి భృ
త్కాయగ్రావ భిదావిధాభి దురదోః ఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయః కీర్తిభర ప్రపంచవర పంచారామ రామామణీ
గేయామేయ జయాంక పంకజ భృంగంగీకార ధీరాకృతీ॥"

వేదండభయదశుండాదండనిర్వాంత
వమధువుల్ పైజిల్కు వారిగాగ
తత్కర్ణ విస్తీర్ణతాళవృంతోద్ధూత
ధూళిచేటల జల్లు దుమ్ముగాగ
శ్రమబుర్బ్వరత్తురంగ మనాసికాగళ
త్పంకంబువైచు కర్దమముగాగ
గుపితయోధ్యాక్షిప్త కుంతకాంతార ఖే
లనములు దండఘట్టనలుగాగ

జెనటిపగరప్రతాపంబు చిచ్చులార్చు
కరణిగడిదేశములు జొచ్చి కలచియలచు
మూరురాయర గండాంక, వీరకృష్ణ
రాయ భూభృద్భయంకర ప్రబలధాటి

''కాంతాలతాంత శర ! - యే
కాంతికభక్తి ప్రతోషితాంభోధిసుతా
కాంతాప్రతాప, రవి శశి
కాంతాయిత, విమతనృపతి కాంతాహృదయా.''

(అక్షతాదులను ప్రభుశిరస్సునం జల్లి వెనుకకు బోవును)

తిమ్మరుసుమంత్రి :

[లేచిసభనెల్లగాంచి యత్సాహముతో] శ్రీ శ్రీ శ్రీ ఆంధ్రభోజాపర నామవిరాజితులగు శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముల - భువనవిజయ మహోత్సవ శుభసమయమున మహదాస్థాన కవి పండితమండలి మాత్రము శ్రీవారికాశీస్సులొసంగుటయైనది, సార్వభౌమ సందర్శనార్థము - నూతనముగా నరుదెంచియున్న కవులుగాని పండితులు గాని ఇతరములగు నేయేకళలయందైన ప్రావీణ్యతగలవారలే తెంచి

యున్నచో - వారెల్లరు బ్రహ్మోత్సవమునకు నేతెంచి శ్రీ సార్వభౌముల సన్నిధానమున దమతమ కౌశలములు ప్రదర్శించి శ్రీవారి యనుగ్రహ పాత్రులుగావచ్చును - (ఆసనమున గూర్చుండును)

ఒకవిలాసిని :

(ప్రవేశించి సార్వభౌములవారి వినయాతిశయముతో సాష్టాంగముగ నమస్కరించి మహామాత్యులనుగూడ నమస్కరించి, కవిపండిత సభాసదులకు నమస్కరించి పత్రికనొక దానిని, రామకృష్ణకవి చేతికొసగును - రామకృష్ణకవి గూడ పత్రికను మహామాత్యుల కొసగబోవ - మామంత్రిశేఖరులు దానిని చదువుమని, రామకృష్ణకవికే సంజ్ఞ యొనర్ప రామకృష్ణకవి - శ్రీ సార్వభౌములకభిముఖుడై యిట్లు చదివెను)

" శ్రీ శ్రీ శ్రీ మహారాజాధిరాజ, మహారాజపరమేశ్వర, మూరురాయరగండ, ఆంధ్రకర్ణాట క్షమామండల సార్వభౌమ, శ్రీ శ్రీ విరూపాక్ష దేవతానుగ్రహపాత్ర, శ్రీ విద్యానగర రత్నసింహాసనాసీన, కవిపండిత మత్తేభపరిపోషక, శ్రీ నరసింహదేవరాయ శుక్తిముక్తాఫలాయమాన, శ్రీ శ్రీకృష్ణదేవరాయసార్వభౌములకు, శతసహస్ర ప్రణామ పూర్వక విజ్ఞాపనములు, సంస్కృతాంధ్రాద్యనేక భాషలలో పాండిత్యమును సంపాదించి, చతుష్షష్టి కళాపరిచయమును గూడ నార్జించుకొని, సంగీత–సాహిత్య–కవిత్వరచనా–నృత్యనాట్యముల మర్మములవగాహనకొనరుచ్చుకొని, అనేక దేశములలో ననేకరాజన్యసభాంతరాళములనుచిత గౌరవసన్మానములనంది, సన్మానపత్రములను – సముచిత బిరుదములను గైకొనియున్న మేము – పండిత సార్వభౌములును సమస్తకళాపోషకులును, మహాకవి పండితమండలీ విరాజితులును, మహోదారులునగు – దేవరవారి సందర్శనార్థమీ శుభసమయమున నేతెంచియున్నారము – శ్రీవారిసన్నిధిని – మావిద్య ప్రదర్శించి సార్వభౌమానుగ్రహపాత్రలమై ధన్యతజెందగోరు – 1, సంగీతసర్వస్వవేదిని 2, సాహిత్యసర్వస్వవేదిని - 3. కవిత్వసర్వస్వవేది. 4, నృత్త నృత్యనాట్యకళాసర్వస్వవేదిని –

అని చదివి - సార్వభౌములవైపును - మహామాత్యులవైపును - సాభిప్రాయముగ తిలకించును.)

తిమ్మరుసుమంత్రి.

(సార్వభౌముని సాభిప్రాయముగ గాంచును)

రాయలు :

(తిమ్మరుసుమంత్రివైపును - రామకృష్ణకవివైపును చిరునగవుతో గాంచును).

తిమ్మరుసుమంత్రి :

(లేఖంగొనివచ్చిన వారవనితతో) మా సార్వభౌములవారి సింహాపీఠమునకు వామభాగమందున్న రంగస్థలమునందు, వారు నల్వురును బ్రవేశింప వచ్చును - ప్రక్కవాద్యగాండ్రు మొదలగువారెల్లరు నందు గలరు - వారికి సర్వవిధముల సాయమొనర్తురు - మీ యజమానురాండ్రు నల్వురును - ఒక్కొక్కమారుగా - వరుసగా వారివారి విద్యలం బ్రదర్శింప శ్రీ సార్వభౌములవారి యానతి యైనది.

లేఖావాహకురాలు :

(సార్వభౌములకు మహామంత్రికి వంగి వినయమున మ్రొక్కి) చిత్తము దేవరవారి యాజ్ఞప్రకారమే.

రామకృష్ణకవి :

మదిరాక్షీ ! ఆ విదుషీమణుల నల్వురను సపరివారముగ నందు జేర్చుటకును - వారికి గావలసిన సదుపాయములనెల్ల సమకూర్చుటకు నిదె మా ప్రతీహారులు నీవెంట వత్తురు తోడుకొనిపొమ్ము.

లేఖావాహకురాలు

(వంగిమరలనమస్కరించి) మహాప్రసాదము. [ప్రతీహారులిర్వురు వెంటరా వెడలిపోవును]

[దౌవారికుడొకడు బ్రవేశించి వినయముతో నమస్కరించి] జయము జయము సార్వభౌములకు - కవీశ్వరుడనని చెప్పుకొనుచు ( శ్రీవారి

దర్శనముగోరుచు బ్రాహ్మణుడొకడు ద్వారమునందున్నాడు. శ్రీ సార్వభౌముల చిత్తము.

తిమ్మరుసుమంత్రి :

[రాయలవైపుగాంచి - వారియభిమతమెరిగి] తత్క్షణము ప్రవేశపెట్టుము.

దౌవారికుడు :

(సార్వభౌములకు - మహామంత్రీశ్వర్యులకు వినయముతో నమస్కరించి) చిత్తము. (అనినిష్క్రమించును)

[ప్రవేశము - ఒకబ్రాహ్మణకవి - ఆడంబరమగు - వేషముతో ఠీవితో సభనంగలయజూచుచు]

రామకృష్ణకవి :

[అతనివేషమును రీవిని - ఆడంబరమునుగాంచి చిరునవ్వునవ్వి - తిమ్మరుసు మంత్రింగాంచును]

తిమ్మరుసుమంత్రి :

(గంభీరముగా తలయూపును)

ఆ వచ్చినకవి :

[సార్వభౌమునివైపుగాంచి, కుడిచేతినిపైకెత్తి బిగ్గరగా]

"గడియకు నూరుపద్యము లఖండముగారచియించువాడ, నె
వ్వడులిఖియింపలేనిగతి - పండితుడెవ్వడదేమి దెల్పినన్;
గడగడనిర్ఝరమ్ముగతి గంటము నిల్పకవ్రాయువాడ, ద
త్తడిగతిదూకునాదుకవితల్ నరసింహుని కృష్ణరాన్మణీ ॥

మీ కవులసమర్థతతో
నా కవితా శక్తిమన్ననంగనవలె, సు
శ్లోకులు, విద్వద్వరులగు
మీకడనేదేల్పుడయ్య మేదినిపాలా !

ఒకపండితుడు

మీ నివాసగ్రామనామమెద్ది ?

వచ్చినకవి :

కొండవీటిసీమకు జెందియుండునొక్క
యూరు సూరులు, కవులు, నొప్పారవెలయు,
మా నివాసమ్ము సతతరమానివాస
మరయనద్దాని నామ మనంతవరము॥

మరొకపండితుడు :

మీ నామధేయము ?

వచ్చినకవి :

(తలనుపైకెత్తి దర్పముమీర)

కాదననేలనాజననకాలమునందుదరమ్ము నందు, బు
ష్పాదులమాలవోలె గనుపట్టెడు జిహ్నము గానుపింపగా
నాదరమొప్పజూచి, బుధులందరు సంతసమంది, నన్ను దా
మోదరుడంచుబిల్వనదె భూమి మదీయము నామమయ్యెడిన్.

మొదటిపండితుడు :

భేషు ! భేషు ! అడిగిన ప్రశ్నప్రశ్నమునకును బద్యములతోనే సమాధాన మొసగునటులున్న దే !

వచ్చినకవి :

[సకిలించిరీవిజూపుచు]

అడిగిన ప్రశ్నలకెల్లను
వడివడి ప్రత్యుత్తరములు పద్యంబులతో
నుడువుదు, నందుల కైగద
పుడమిజనము లాశుకవి విభుండంద్రు ననున్॥

సార్వభౌముడు :

[వినువుతో - తిమ్మరుసుమంత్రివైపు చూచును]

తిమ్మరుసుమంత్రి :

(సాభిప్రాయముగ రామకృష్ణకవిని గాంచును)

రామకృష్ణకవి :

(వచ్చినకవివైపుజూచి) ప్రశ్నలగు ప్రత్యుత్తరములెల్ల పద్యములతో నొసగినంత శీఘ్రముగ – నేనిసన సమస్య నొసగినను పూరింపగలవా ?

ఆ వచ్చినకవి :

(రామకృష్ణకవివైపు గాంచుచు)

ఎట్టి కఠినపు సమస్యయు
నిట్టే పూరింతు విబుధులెంతయు మెచ్చన్
బట్టుమనిననొక గడియయు
బట్టదు - ప్రశ్నింపుమయ్య ! పండితవర్యా !

రామకృష్ణకవి :

చాలసంతోషము - (ఆస్థానవిలేఖరినొకనింబిలిచి) నీవొక గంటమును తాళపత్రమునుగొని యిటురమ్ము.

విలేఖరి

(అటులే ప్రవేశించును)

రామకృష్ణకవి :

నీవీ వేదికపయిగూర్చుండి. వ్రాయుసిద్ధముగనుండుము నేనిప్పుడొసగనున్న యీ సమస్య నీయాశుకవిపూరణమొనర్చునంతలో నీవు వ్రాయగలవో! లేవో! శ్రీ సార్వభౌములును సదస్యులును దిలకింప గలరు !

విలేఖరి :

[అటులేసన్నద్ధుడయి] చిత్తము. సిద్ధముగానున్నాడను.

రామకృష్ణకవి :

(వచ్చిన ఆశుకవితో) ఇదెసమస్యనిచ్చుచుంటిని.

"కుంద్రుడుణాచివాలహాళికి కుంజరమ్ములీల్లవే ! "

వచ్చినకవి ;

(విని - యోచింపసాగును)

రామకృష్ణకవి ;

(కొంతసేపు నిదానించిచూచి గడియారమున గంటల నిర్ణయించు గణకుని వైపు జూచి) కాలజ్ఞ పండితా ! ఈ కవి ఈ సమస్య నెంతసేపటిలో పూరింపగలడో గమనింపుచుండి నేనీసమస్య నీతనికొసగిన విఘడియ మొదలుకొని పూరణ మొనర్చిన యావిఘడియవరకు గాగల ఘడియలు విఘడియలవ్రాసి యుంపదగును.

కాలజ్ఞుడు

(వినయముతో) చిత్తమటులే యొనర్తును.

వచ్చినకవి :

(ఇంకను యోచనసేయుచునే యుండును)

మొదటిపండితుడు :

ఆశుకవి వృషభుని దుందుడుకుడిగినది-ఈ సమస్యయాతనిక పక్వకపిత్థప్రాయమైనది.

రెండవ పండితుడు :

ఏమైనను నిట్టి మహాసభలో నింతటి సాహసకృత్యము కూడదు, మతిమాలిన దురహంకారమే గాక, ప్రభువుల తెల్పించినవల మహత్త్వ నాలోచించిన వాడవుగాదు—

వచ్చినకవి :

[ఇంకను యోచింపుచునే యుండును]

మూడవపండితుడు :

ఇంకనాదూకుడడగిపోయినట్లే ముందుగా కంఠస్థము చేసికొని వచ్చిన పద్యములను వల్లించినంతమాత్రమునే యుండునా ? రామకృష్ణకవి చంద్రునితోటి వాదవైఖరి ?

వచ్చినకవి :

(సగము మ్రింగి రామకృష్ణకవిదిక్కై) కుంద్రమునాచియనన నర్థముగుట లేదు, ఆశబ్దమునకర్థము దెలిపిన –

మొదటిపండితుడు :

[కల్పించుకొని] అట్లనుగుట తప్పుగానేరదు. కుంద్రమునాచియనగా తెల్లటిబల్లియని యర్థము.

వచ్చినకవి ;

(మరలయోచింప నారంభించును)

మరొకపండితుడు :

(హేళనగా) నీయిష్టమువచ్చినంతకాలము యోచింపుము.

(పూర్వోక్తవార వనిత మరలప్రవేశించి - సార్వభౌములకును-మంత్రిశేఖరులకును - కవిపండిత మండలికిని వినయముతో నమస్కారముసల్పి)

శ్రీవారియాజ్ఞాప్రకారము మాయజమానురాండ్రు రంగ సీమను బ్రవేశపెట్టబడి సన్నద్ధతతోనున్నారు. శ్రీవారి యాజ్ఞయే యిక దరువాయి.

తిమ్మరుసుమంత్రి :

(రామకృష్ణకవివైపుజూచి) ఈ యాశుకవిసంగతి తేలుటతోడనే వారినారంభింపమనుటకేమియు, నాక్షేపణముండదనుకొందును.

రామకృష్ణకవి .

(ఆశుకవిదిక్కై) సమస్యాపూరణ మెంతలోనున్నది ?

వచ్చినకవి :

(రీవియించుకయడగ) దుష్కరప్రాసము సాధ్యపడుటలేదు.

రామకృష్ణకవి :

(హేళనగా)

"ఎట్టి కఠినపు సమస్యయు
నిట్టే పూరింతు విబుధులెంతయు మెచ్చన్"
బట్టుమనిన నొకగడియయు
బట్టదు" అని గదా నీ ప్రతిజ్ఞ-

ఆశుకవి :

అయినను గడియమీరినదా ?

రామకృష్ణకవి :

(కాలజ్ఞునిదిక్కై) కాలజ్ఞపండితా ! ఈ సమస్య నీతనికొసగి యెంతకాలమైనది ?

కాలజ్ఞుడు

ఒక ఘడియపైని యేబది మూడు విఘడియలును నాల్గైపైని నిరువది లిప్తలును గడచినవి.

రామకృష్ణకవి :

రెండవఘడియ పూర్తి గావచ్చినదన్నమాట? ఆశుకవీ! ఆ సమస్యనిక పూరింపనక్కరలేదు. మా లేఖరియొద్ద గల గంటమును తాళపత్రమును దీసుకొనుము.

ఆశుకవి :

(సాలోచనగా నటులే జేయును)

రామకృష్ణకవి :

"గడియకు నూరుపద్యములఖండముగా రచియించు పరీక్ష పూర్తియైనది. ఇక రెండవది — "గడగడ నిఘ్నగమ్ముగతి గంటము నిల్పక వ్రాయు" పరీక్షను బ్రారంభింపబోవుచున్నాడను.

ఆశుకవి :

(ఒకచో గూరుచుండి వ్రాయ సిద్ధపడును)

రామకృష్ణకవి :

"వక్కలుచాలేదు నే గొని
[illegible]ల్లో బోసుకొంటి + + + +"

అని ఆప్రసం.

ఆశుకవి :

(రామకృష్ణకవి చెప్పినది వ్రాసి యీ కడపట చెప్పిన నాల్గక్షరములను చా-చా-చా చాకని వ్రాసి ఇంచుక యోచించి) ఆ తరువాత.

రామకృష్ణకవి :

యెక్కడిదొంగలు దోచిరో

ఆశుకవి :

(వ్రాసి) ఆ.

రామకృష్ణకవి :

అక్కరకును లేకపోయెనయ్యో × ×

ఆశుకవి

(కొంత వ్రాసి యిక వ్రాయలేక నిలిపివేయును)

రామకృష్ణకవి :

(ఆశుకవిని గాంచి) పూర్తి జేసినట్లున్నదే ?

ఆశుకవి :

(తలనడ్డముగ ద్రిప్పుచు) ఉహుహు - ఇట్టిపనికిమాలిన ధ్వనుల నుచ్చరింపుచు పద్యములు జెప్పి వ్రాయుమనిన నెవ్వరు వ్రాయగలరు ?

రామకృష్ణకవి :

ఇతరు లెవ్వరిసంగతియో నెందులకుబోనిమ్ము. నీసంగతిని జెప్పుము. యేమైనట్లు ?

ఆశుకవి :

అర్థగర్హితములును-లిఖించుటకసాధ్యములునగు వ్యర్థశబ్దముల నుచ్చరించి వ్రాయుమనికోరుట సభామర్యాదయగునా ?

---

\+ + + + ఈ నాలుగక్షరములను మూతిపొడిగించి నాలుకతో నూర్ధ్వదంతపంక్తిని దాకుచు మనము పెంపుడుకుక్కను బిలుచునపుడు చేయుధ్వనివంటి ధ్వని జేయవలయును- × × ఈ రెండక్షరములు నూర్ధ్వాధోదంతములను బిగించి జిహ్వాగ్రముచే దంతసంధిని దాకినట్లు గాజేయుచు వ్యర్థముఅనునట్లు ధ్వని చేయవలెను.

రామకృష్ణకవి :

సభామర్యాదలు, సమగ్రముగ నెరిగిన, విజ్ఞునివలె మాటాడు చుంటివి, ఆ మర్యాదలను నీవెరిగియే ప్రవర్తించితివా ?

ఆశుకకవి :

( రామకృష్ణకవితో ) వీటిని మీరు వ్రాయుడు జూతును.

రామకృష్ణకవి :

(కోపముతో నుగ్రుడై) ఇక మర్యాదగా నోరుమూసికొనుట నీకు క్షేమము. మహాసార్వభౌమ సన్నిధిలో దిగ్దంతుల వంటి మహాకవి పండితులసమక్షమున బుద్ధిలేని వ్యర్థప్రతిజ్ఞల జేసినది నీవా ? నేనా ? ఏకొంచమో - ఛందస్సు తెలియుటతోడనే - వాక్యముల గణబద్ధ మొనర్చి వెదురుతడకవలె బద్యము లొకించుక యల్లుటచేతనైన మాత్రముననే - నోటికి వచ్చినట్లెల్ల మాటలాడుట కిది మహారాజ సభ యనుకొంటివా ? మద్యవిక్రయశాల యనుకొంటివా ? అప్రాచ్యుడా ? గడియకు నూరుపద్యములని లొడలొడ వాగుటతోడనే సభయెల్ల దద్దరిల్లిపోవుననుకొంటివిగాబోలు. ప్రాజ్ఞలక్షణము వినయము గాని, దురహంకారము గానేరదు- సమర్థులగు మహాపండితులు, మహా కవులుగూడను దాము కించిద్జ్ఞులమని వాకొనుచుందురే ? "మందః కవియశః ప్రార్థీగమిష్యామ్యుపహాస్యతాం" మనిచెప్పిన కవికుల గురు వగు కాళిదాసమహాకవిసార్వభౌమునికంటెను గొప్పవాడనని యెంచి తివిగాబోలు.

లోకంబుంగని, విద్వదంబుధుల నాలోకించి, తద్గ్రంథముల్
సాకల్యంబుగ గాంచి, సత్కవి వచస్స్వాదుత్వ నిష్యందుతో
శ్రీకావ్యాళిబరించి, నీ వణువుగా జిత్తమ్మునందెంచవా?
నీకి గర్వము లేశముం డగదుపో,- నిర్భాగ్య దామోదరా॥

పైకంబొప్పగజూత భూరుహతతిం బాధునక్రలస్థాయి, నా
కాకంబెప్పుడు గూయుచుండు. మది జీకాకొంద, వర్షర్తునం
భేకంబుల్రొదబెట్టి నట్లరతువా ? పృథ్వీశు విద్వత్సభన్
నీకి గర్వము లేశముందగదుపో నిర్భాగ్య దామోదరా !॥

ఆశుకవి

(అవమానముతో - లేచిపోవ ప్రయత్నించును.)

తిమ్మరుసుమంత్రి.

(అనునయస్వరముతో) దామోదరకవీ ! ఇంచుకతడవాగుము – శ్రీ శ్రీ సార్వభౌముల దర్శన మొనర్చినవాడెవడు గాని, రిక్తహస్తములతో నీ సభనుండి వెడలిపోవుట యదృష్టపూర్వము –

(కార్యదర్శివైపు సాభిప్రాయముగ గాంచును)

కార్యదర్శి

మహామంత్రి యభిప్రాయమెరిగి వినయముతో నేగి, యొక పళ్ళెరమున కొన్ని బహుమతులను గొని తెచ్చి - యాశుకవి కొసగును).

ఆశుకవి :

(వినతుడై యా బహుమతుల గ్రహించి వెడలిపోవును)

తిమ్మరుసు మంత్రి :

(కార్యదర్శితో)· పరిచారిక నొకరితంబు తెంచి–సంగీతసాహిత్యాది సర్వస్వవేదినులతో – "ఇకమీ కార్యక్రమ మారంభింపవచ్చు"నని తెలియజెప్ప బంపుడు.

కార్యదర్శి :

మహామాత్యులయాజ్ఞాప్రకారమే- (అని వెనుదిరిగిచూచి) ఇదిగో – వారియొద్దనుండి పూర్వపరిచిత సందేశహారిణి యేతెంచుచున్నది.

తిమ్మరుసుమంత్రి.

(కార్యదర్శి చూపిన దిక్కునకు గాంచి - తృప్తి పడును)

లేఖావాహకురాలు:

(ప్రవేశించి సార్వభౌములకును - మహామాత్యులకును వినయముతో నమస్కరించి దోయిలొగ్గి) వరా యేలికసాములు సిద్ధముగా నుండిరి. ఇక ప్రభువుల యాజ్ఞ !

తిమ్మరుసుమంత్రి ;

ఇక త్వరగా నారంభింపవచ్చునని శ్రీ సార్వభౌముల యాజ్ఞగా వారికి జెప్పుము పొమ్ము -

లేఖావాహకురాలు ;

దేవరవారి యాజ్ఞాప్రకారమే - [వినయముతో వంగి నమస్కరించి - వెనుకకు వెనుకకు నడచిపోవును]

[రంగస్థలమునందు వివిధవాద్యములు మ్రోగును].

అందరు .

[రంగస్థలముపై దృష్టి సారింతురు]

లేఖావాహకురాలు :

(తెరయెత్తుకొని ప్రవేశించి - రంగసమ్ముఖమున "సంగీత సర్వస్వవేదిని" అని వ్రాయబడియున్న ఫలకమును వ్రేలాడగట్టి లోనికేగును)

తెర యెత్తినంతనే - రంగమధ్యమున పట్టుపరుపులచే నలంకృతమైన దివ్యాసనముపై - సుఖాసీనయై లోకోత్తర సౌందర్యవతి,- వివిధమణిమయాభరణ విరాజిత, - సువర్ణపుష్ప లతాపరిశోభిత కౌశేయవసనధారిణి, - వింశతివర్ష ప్రాయ, - సంగీత సర్వస్వవేదిని ప్రవేశించును,

(వివిధవాద్యగాండ్రును అష్టస్థానములలో గూరుచుండియుందురు)

[సంగీత సర్వస్వవేదిని - లేచి వినయవినమితోత్తమాంగయై - ముందుగా శ్రీ సర్వభౌములకును తరువాత మంత్రామాత్యులకును - ఆపైని పండితకవి, సామంత మహా జనులతో నిండిన సభకు వరుసగా నమస్కరించి కూరుచుండి హృదయంగమముగా బాడుట కారంభించును.]

[సమయానుకూలముగా ప్రక్కవాద్యములు మ్రోగుచుండును.]

నాటరాగం - రూపకతాళం

శ్రీరామచంద్రా శ్రితపారిజాత,
సమస్తకల్యాణ గుణాభిరామః,
సీతాముఖాంబోరుహ చంచరీకో
నిరంతరం మంగళమాతనోతు॥

- మాళవ రాగం - రూపకతాళం -

1) ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదమ్,
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్,
కేశవ ! ధృతమీన శరీర ! జయజగదీశ హరే !

2) క్షితిరతి విపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్ర గరిష్ఠే-
కేశవ ! ధృత కచ్ఛపరూప ! జయజగదీశ హరే !!-

3) వసతిదశన శిఖరేతవలగ్నా-
శశిని కలంక కలేవనిమగ్నా-
కేశవ ! ధృతసూకర రూప ! జయజగదీశ ! హరే !!

4) తవకర కమలవరే నఖ మద్భుత శృంగమ్
దలిత హిరణ్యకశిపు వర భృంగమ్-
కేశవ ! ధృత నరహరిరూప ! జయజగదీశ ! హరే !!

5) ఛలయసి విక్రమణే బలి మద్భుత వామన
పద నఖ నీరజనిత జన పావన.
కేశవ ! ధృత వామనరూప ! జయజగదీశ ! హరే !

6) క్షత్రియ రుధిరమయే జగ దప గత పాపమ్,
స్నపయసి పయసి శమిత భవతాపమ్,
కేశవ ! ధృత భృగుపతిరూప ! జయజగదీశ ! హరే !॥

7) వితరసిదిక్షురణే - దిక్పతి కమనీయమ్,
దశముఖమౌళి బలిం రమణీయమ్,
కేశవ ! ధృత రఘుపతిరూప ! జయజగదీశ ! హరే !॥

8) వహసి వపుషి విశదే వసనంజలదాభమ్,
హలహతి భీతి మిళిత యమునాభమ్।
కేశవ ! ధృత హలధరరూప ! జయజగదీశ ! హరే !॥

9) నిందసియజ్ఞ విధేరహహ శృతిజాతమ్।
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్।
కేశవ !ధృత బుద్ధశరీర ! జయజగదీశ ! హరే !॥

10) మ్లేచ్ఛనివహ నిధనే కలయసి కరవాలమ్।
ధూమకేతు మివకిమపి కరాళమ్।
కేశవ ! ధృత కల్కిశరీర ! జయజగదీశ ! హరే !॥

11) శ్రీ జయదేవ కవేరిద ముదిత ముదారమ్।
శృణు శుభదంసుఖ దంభవసారమ్।
కేశవ ! ధృత దశవిధరూప ! జయజగదీశ ! హరే !॥

వేదానుద్ధరతే జగన్నివహతే భూగోళముద్బిభ్రతే
దైత్యాన్దారయతే బలించలయతే, క్షత్రక్షయం కుర్వతే,
పౌలస్త్యంజయతే, హలంకలయతే, కారుణ్యామాతన్వతే
మ్లేచ్ఛాన్మూర్ఛయతే, దశాకృతికృతే, కృష్ణాయతుభ్యం నమః॥

(దశావతార ధవళమను నీ యష్టపదిని - పాదమున కొక్కొక్క రాగము చొప్పున రాగమాలికగా - నత్యద్భుతముగా - సభ యెల్ల బులకించునటుల గాన మొనర్చును)

పండితులు - కవులు :

(మహదానందమున దలలూపుచు) అహో! గానముగాదిది, సుధా నిర్ఝరిణి-

సార్వభౌములు .

(ఆనందాతిరేకమున దన్మయావస్థ నొందును)

సంగీత సర్వస్వ వేదిని

(ముఖారిరాగ మాలాపించి సభ యెల్లమంత్ర ముగ్ధకాగా)

ముఖారిరాగం - ఆదితాళం

"కృష్ణం కలయసఖి - సుందరం బాల" కృష్ణం - కలయ॥

1) కృష్ణం - గత విషయ తృష్ణం జగత్ప్రభ విష్ణుం,
సురారిగణ జిష్ణుం - సదా బాల ॥కృష్ణంకలయ॥

2) నృత్యంత మిహముహు రత్యంత మపరిచిత-
భృత్యానుకూల మఖిల సత్యం సదా బాల ॥కృష్ణం॥

3) ధీరం భవజలధిపారం - సకలవేద సారం,
సమస్త యోగితారం. సదా బాల ॥కృష్ణం॥

4) రాధారుణాధర సుధాపం - సచ్చిదానందరూపం,
జగత్త్రయ భూపం, సదా బాల ॥కృష్ణం॥

5) దామోదర మఖిల కామం - పరం పున
శ్శ్యామాకృతి మసుర భీమం సదా బాల ॥కృష్ణం॥

6) అర్థం - శిథిలీకృతాఽనర్థం - శ్రీనారాయణతీర్థం,
పరమపురుషార్థం - సదా బాల ॥కృష్ణం॥

(అను తరంగమును - అత్యద్భుతముగా గానమొనరించి - తరువాత మోహనరాగ మాలాపించి - సమ్మోహితులుగానెల్ల సభాసదుల నొనర్చి యెల్లరితల లుయ్యాలలూగగా)

మోహనరాగం - ఆదితాళం

పల్ల॥ ననుపాలింప, నడచివచ్చితివో - నా ప్రాణనాథ !॥

అను॥ పల్ల॥ వనజ నయనమోమును జూచుట జీ
వనమని - నెనరున - మనసు మర్మముదెలిసి ॥నను॥

చర॥ సురపతి నీలమణి నిభ తనువుతో
కరమున శరకోదండ కాంతికో
ధరణి తనయతో త్యాగరాజార్చిత. ॥నను॥

(అను కీర్తన నత్యంతాద్భుతతరముగ గాన మొనరించి- ఆ సుత్తునుండి సభాస్తారులెల్ల కోలుకొ[illegible]టకు ముందుగానే - కలప్రియరాగ మాలాపనజే[illegible])

కలప్రియ రాగం - ఆదితాళం

పల్ల॥ చేతులారా - శృంగారము - జేసిచూతునో? శ్రీరామ !

అనుపల్ల॥ సేత[illegible]ధనా! సురపతి సరసీరుహభవాదులు[illegible]గడ॥చేతు॥

చర॥ 1. మెరుగుబంగారం దెలుబెట్టి, మేటియౌ సరిగవల్వాలు గట్టి
సురుచిరసుమములు సిగనుండజుట్టి-సుందరమగుమోమున
ముద్దుబెట్టి ॥చేతు॥

2. అణిముత్యాల క్రొత్తదండవేసి, హవునుగా పరిమళగంధము
బూ[illegible] కలవాణి సురటిచే విసరగ - వాసివా[illegible] యనుచు
త్యా[illegible]రాజనుతుని ॥చేతు॥

(స[illegible]సభులు[illegible] చిత్తసుఖుల నొనగ్పుచు నత్యద్భుతముగా [illegible]న మొనరించి సుధాస్రవ మేంబ[illegible]గా - [illegible]డను శ్రీరాగమా[illegible]లాపించి, లేచి - స[illegible]భాములకు మహామాత[illegible]లిసను - [illegible]నగాజి మండలికిని - [illegible]భినంద[illegible]మాచరించి - [illegible]దామినివలె తెరలోని[illegible]సను.) [illegible]పెగ[illegible]రయు. ప్రక్క[illegible]వాద్యములు - విశ్రాం[illegible]తముల నా[illegible]పించుచు-[illegible]భను [illegible]ంగ జేయుచుండును-పూర్వ[illegible]రిచిత - లేఖా వాహ[illegible] గాలు తెర వత్తుకొని [illegible]సెలెంచి [illegible]ంకేత [illegible]సర్వస్వవేదని,, యను ఫలకమునీని ఆ[illegible] వేశమున నే"[illegible]సాహిత[illegible] సర్వస్వ[illegible]" అని వ్రాయబడియున్న ఫలకమును దగిలించి [illegible]దలిపోవును)

పెద్దనమహాకవి

(ఆనందతన్మయత్వముతో నందితిమ్మకవిని చూచుచు) మహదానందమైనది - ఇట్టి సంగీత మనితరలభ్యము.

నందితిమ్మకవి :

(మహదానందపారవశ్యమును జెందుచు) తన బిరుదమునకారయెల నాగ సర్వవిధముల నర్హురాలననిపించుకొన్నది

ధూర్జటికవి ;

[పరమానందమున జేష్టలుడిగి] అహో ! సంగీతముగాదిది. సుధా స్రవంతి, శ్రోతల నజరామరుల జేసినదిగదా ?

సార్వభౌముడు :

(సింహాసనముమీద మహదానందము మోమునందు ప్రస్ఫుటమగుచుండ రసోపాసకుడై కూర్చుండియుండును).

రామకృష్ణకవి :

[సంతోషాతిరేకమును గన్పరచుచు] అవధులు దాటిన యీయానందముచే సభ యెల్ల నుఱ్ఱూతలూగుచున్నది - గాన మాగిన వెనుక నింత కాలమునకుగూడ మనములు కుదుటబడజాలకున్నవి - అని దంపూర్వమీగానమాధుర్యము -

[రంగస్థలమున మరల నారంభసూచక వాద్యములు మ్రోగుచు - తెర యెత్తబడగా - నందరు నటువైపు జూతురు]

(ప్రవేశము, వేషము నించుక మార్చి- వస్త్రాభరణాదికములలో మార్పు లొనరించి - సంగీతసర్వవేదినియే - వేదికపై యాసన మధిష్ఠించి-)

(తెరయెత్తుటతోడనే లేచి-వినయవినమితోత్తమాంగయై శ్రీ సార్వభౌములకును - తిమ్మరుసుమంత్రికిని పండితకవిమండలికిని - మహాసభయంతటికిని నమస్కరించి, వారి సౌముఖ్యమును - గురుతించి - కూరుచుండును.)

అందరును-

[సంగీత సర్వస్వవేదనియే - మరల సాహిత్యసర్వస్వవేదనియైనదని గుర్తించి విభ్రాంతి నందుదురు]

తిమ్మరుసుమంత్రి :

(గురుతించి - తల యూపుచు - కవిపండితమండలివైపు జూచి) ఇక సాహిత్యచర్చ కుపక్రమించుడు.

రామకృష్ణకవి :

(పెద్దనంగాంచి) కవిపితామహులారంభింతురా ?

పెద్దన మహాకవి :

వినుమిరత్నమా !

శ్లో॥ స్తనమండలమాశ్రిత్య, నఖస్యవరయోషితామ్
కదాఽఽకర్ణయతేగీతిః, రమయాసహరంగరాట్"

ఈ శ్లోకమును సమన్వయమొనర్చి విశదీకరింపుము.

సాహిత్య సర్వస్వవేదిని :

(కొంచెము కాల మాలోచించి) ఆంధ్రకవితాపితామహా!

రమయాసహరంగరాట్, వరయోషితాంగీతిః కదా-ఆకర్ణయతే-
తదా - ఖస్యమండలం ఆశ్రిత్య - నస్తన - గర్జితం మా కురు-
అనిన సమన్వయము సరిపడును.

జలద! శబ్దమునో పయోదశబ్దమునో అధ్యాహారముగా గ్రహింపదగును.

పెద్దన మహాకవి.

(తృప్తిపడి) మిన్నుల సంతసించితిని. (తిమ్మకవివైపుగాంచును)

నంది తిమ్మనకవి.

(ఆలోచించి) విదుషీమణీ!

"విరాటనగరేరమ్యే కీచకాదుపకీచకం - అత్రక్రియాపదం- వక్తవ్యం"

సాహిత్యసర్వస్వవేదిని.

(యోచించి) రమ్యేనగరే - కీచకాత్ - ఉపకీచకం - విః - అట - అనుట బాగుగునని భావింతును.

నందితిమ్మకవి :

సంతసించితిని. చక్కగా నాలోచించితివి.

మాదయగారి మల్లన

సాహితీ తిలకమా !

శ్లో॥ "వనేజాతా - వనేత్యక్తా - వనేతిష్ఠతి నిత్యశః,
పణ్యస్త్రీ - నతుసావేశ్యా" ఇది తెలుపవగును.

సాహిత్యసర్వస్వవేదిని :

(కొంచెమాలోచించి) నావయుని చెప్పిన నేమియు పొరపాటుండదని భావించుచున్నాను. సరియగునా ?

మాదయగారిమల్లన ;

(ఆమోదమున శిరఃకంప మొనరించుచు) అందుకుసందేహమేమున్నది ?

ధూర్జటికవి :

సాహితీలోకశ్యమంతకమా !

శ్లో॥ "శీతలా సారసంవాహి - సరోజ వనమారుతః-
సంక్షోభయతి పాంథస్త్రీ నిశ్వాసైరివ మాంసలః॥"

ఈ శ్లోకమున కర్తృపదమును - గాలింపగలవా ?

సాహిత్యసర్వస్వవేదిని :

(కేలికగా) సరోజవనమారుతః అనువాక్యమును సరః-జవన మారుతః అని విభజించిన - కష్టకష్టకరి యే కర్తృదోషమనుగాదా ?

(తృప్తిపడి) అవును - సులక్షణముగా గాలించితివి.

సార్వభౌములు ;

(తమ గురువును మహాపండితుడునగు శ్రీ, మత్తాతాచార్యులవైపునకు - సాభిప్రాయముగ జూచును]

తాతాచార్యులు :

(సార్వభౌములయభిప్రాయమున మనసునకుదెచ్చికొని) సాహితీ సమరాంగణ వీరవిహారకారిణి! చారుశీలే !! వక్ష్యమాణశ్లోకస్య సముచిత వ్యాఖ్యాం - త్వత్సాహిత్యహాటకనికషోపలస్య - వైయాకరణ వాణ్యావద -

"దంష్ట్రాగ్రగ్రస్తా - ప్రాగ్ద్రాక్ క్ష్మా-
మంబ్వంతస్థా ముచ్చిక్షేప,
దేవద్రుట్క్షి ద్ధ్వఋత్విక్స్తుత్యో-
యుష్మాన్పాయాత్సర్పాత్కేతుః॥" ఇతి-

సాహిత్యసర్వస్వవేదిని :

[మరలనొకపరిజదువుడనియడిగి - యొకటిరెండుమారులు జదివించుకొని విని - యాలోచించి) దంష్ట్రాగ్రస్య అగ్రాణ్యా - ప్రాక్-పూర్వం = ద్రాక్ - శీఘ్రం = క్ష్మాం-పృథ్వీం = అబ్వంతస్థాం-పాతాళస్థాం = ఉచ్చిక్షేప - ఉత్క్షిప్తవాన్ = దేవాన్ ద్రుహ్యంతీతి - దేవద్రుహః-అసురాః - తాన్-క్షిణోతీతి - దేవద్రుట్క్షిత్ = ఋత్విగ్భిః స్తుత్యః- ఋత్విక్స్తుత్యః = యః-సర్పానత్తీతి - సర్పాత్-గరుడః = స ఏవ కేతుః ధ్వజో యస్యేతి-సర్పాత్కేతుః సోఽవిష్ణుః ఆదివరాహరూపీ-యుష్మాన్-

శ్రీ విద్యానగర భువనవిజయనామక మహత్సభామంటపాంతరాసీన - మహామాత్య-మహాధికారి-మహావీర-మహాపండిత-మహాకవి-మహాజన సముదాయం - తన్మధ్య సువర్ణపీఠికా బహుమూల్య నవరత్న సింహాసనాసీనం శ్రీ శ్రీ శ్రీ నరసింహ శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమ తల్లజంచ - అఖండైశ్వర్యం - సర్వద్దిగంత విజయంచ-దత్వా-రక్షత్విత్యాశీర్వాదః =

తాతాచార్యులు

(విని పరమసంతోషముతో) సమీచీనమ్-సమీచీనమ్ = మహదానందకందళితమ్ మమహృదయం - తృప్తోస్మి-

సార్వభౌములు :

(సాభిప్రాయముగ రామకృష్ణకవిని గాంచును)

రామకృష్ణకవి :

(సాహిత్యసర్వస్వవేదిని గాంచుచు) మాగురువుగారాశీర్వదించి నటుల - సాహితీసమరాంగణ వీరసామ్రాజ్ఞి! నేను తక్రమువంటి వాడను. అన్నింటను బూర్తియైన వెనుకగాని నావంతురాదు. నా యీ ప్రశ్నమును గూడ విని త్వరితముగ దానిం దెల్పితివేని - వేగముగ నీవేగి నీ తృతీయభూమికాధారణ మొనర్ప వీలగును.

"నరసింహ కృష్ణరాయల
కరమరుదగు కీర్తి యొప్పె - కరిభిద్గిరిభి,
త్కరి కరిభిద్గిరి గిరిగిభి,
త్కరిభిద్గిరిభి త్తురంగ కమనీయంబై॥"

దీనికి ప్రతిపదార్థముం జెప్పి వెడలిపొమ్ము.

సాహిత్యసర్వస్వవేదిని

(నవ్వుచు - నొక్కింత యోచించి తలయూపుచు) మహాకవిసార్వభౌమా! అవధరింపుము. కరిభిత్ = శంకరుని వలెను-గిరిభిత్కరి = ఐరావ

తేమువలెను - కరిభిద్గిరి = కైలాసము వలెను - గిరిభిత్ = వజ్రాయుధము వలె - కరిభిత్ = వెన్నెలవలె - గిరిభిత్తురంగ = ఉచ్చైశ్రవమును మించి - కమనీయంబై = మనోహరత్వముగలదై - శ్రీ నరసింహ కృష్ణరాయ సార్వభౌముల - కమనీయమగు కీర్తి యొప్పెను - మీపులన సదృశమగు యశమ్ము శోభిల్లెను.

(అని లేచి వినయవినతాంజలియై - శ్రీశ్రీ సార్వభౌముల కారంభించి, మహామాత్యులకు క్రమముగా సభకెల్ల దోయిలొగ్గును)

(సభాసదు లెల్లరును కరతాళధ్వనాలతో దమ సంతోషము వ్యక్తపరతురు)

వహవా - శహబాస్ - భళీ

అను ధ్వనులు సభయెల్ల మారుమ్రోగును.

సాహిత్యసర్వస్వ వేదిని.

[వెనుకకు వెనుకకు నడచుచు నిష్క్రమించుటతోడనే తెరవ్రాలును. విశ్రాంతి సమయానుకూలములగు ప్రక్కవాద్యములు మ్రోగ నారంభించును]

పూర్వపరిచిత వారకాంత.

(ఏతెంచి, సాహిత్య సర్వస్వవేదిని యను ఫలకము నూడదీసి - యాచోట "కవిత్వసర్వస్వ వేదిని" యని వ్రాసియున్న ఫలకమును దగిలించి వెడలిపోవును) ఇంచుకయాగి తెర యెత్తబడగా రంగమధ్యము నందుగల దివ్యాసనముపయి పూర్వపునవితయే, వేషమును మార్చి కూరుచుండియుండును. తెర యెత్తుటతోడనే లేచి శ్రీ సార్వభౌములు మొదలుగా - వరుసగా ఆ మహాసభాస్తారులకెల్లను గడుంగడు వినయముమీర నమోవాకములర్పించి మరల నాసనముపై గూరుచుండును)

సార్వభౌముడు

దృశ్యాదృశ్యస్మిత మొనరింపుచు జూచిగురుతించును)

తాతాచార్యులు.

(చూచి పట్టరాని సంతసమున) చిరంజీవీ!! సర్వజ్ఞవయ్యు, నొకే వ్యక్తిగా బరిచితవగుటకంటెను వేర్వేరు వ్యక్తులుగా భూమికలమార్చి పరిచితవగుట యెంతయు జమత్కారముగా నున్నదిసుమా!

తిమ్మరుసుమంత్రి.

(కవులవైపునకుగాంచి నవ్వుచు) జాగేల-నీపరీక్షగూడ నారభింపుడు.

ధూర్జటికవి.

పురంధ్రీరత్నమా! మనోహర సమీరకుమారునకు మాంద్యమేర్పడిన కారణమును-హృద్యమగు నొకయనుష్టుప్‌తో-నభివర్ణించుము.

కవిత్వసర్వస్వవేదిని

(ఇంచుక యాలోచించి)

శ్లో॥ "లతాంపుష్పవతీం స్పృష్ట్వా స్నాతోవిమలవారిషు-
పునస్పర్శన భీత్యేవ - మందంచలతి మారుతః॥"

2వ పండితుడు

(ఆనందాతిరేకమున) శహబాస్ — సహ వావహావా - చాలా చక్కగా నిర్వచించినది.

మాదయగారి మల్లన :

కవయిత్రీ తిలకమా ! మధుమాసము సర్వజగదానందకారకము గదా ! కాని దానియందలి దోసమునొక యనుష్టుపుతో జెప్పుము.

కవిత్వసర్వస్వవేదిని ;

(ఇంచుక యాలోచించి)

శ్లో॥ మాలతీ విముఖశ్చైత్రః - వికాసీ సర్వసంపదామ్,
ఆశ్చర్యం జాతిహీనస్య, కథం సుమనసః ప్రియాః॥"

1 వ పండితుఁడు :

(సంతోషమతిశయిల్ల, భేష్ ! భేష్ ! మాయిరే చమత్కృతి.

నందితిమ్మకవి :

విమషీరత్నమా ! వర్షర్తుశోభను గూర్చి - స్వభావోక్తి మధురముగా నభివర్ణింపుము,

కవిత్వసర్వస్వవేదిని

(ఇంచుక కాలమాలోచించి)

శ్లో॥ "మండలీకృత్య బర్హాణి - కంఠైర్మధుర గీతిభిః,
కలాపినః ప్రనృత్యంతి కాలే జీమూత మాలిని॥"

2 వ పండితుఁడు

(పరమానందమునను పొంగి, అహో ! ఈ స్వభావోక్తి మాధుర్యమత్యద్భుతముగానున్నది,

పెద్దనమహాకవి :

కాంతాశిరోరత్నమా ! విద్యానాథమహాకవీంద్రకృత ప్రతాపరుద్రీయమునందలి—"దూరాదాకర్ణ్యవిశ్వప్రసృమర- నృపాః పూర్ణ కర్ణజ్వరార్తాః"–X అను శ్లోకమునకు కేవలాంధ్రీకరణముగాకుండ-అందలి భావమును స్వారస్యమును పోగొట్టకుండగనే - (శ్రీ) (శ్రీ) మనసార్వభౌములపరముగా - వారి శత్రురాజులపాటులం దెల్పుచు సరసముగా నాంధ్రమున నభివర్ణింపుము,

కవిత్వసర్వస్వవేదిని :

(ఇంచుకతడవాలోచించి)

శ్రీ లీలాత్మజ ! కృష్ణరాయ ! సమరోర్విన్నీదు వైరిక్షమా,
పాలుర్వీగి హయాధి రూఢులగుచున్బారన్వనీ శాఖిశా,
ఖాలగ్నాయితకేశ పాశుల యియ్యాగన్నేకిసల్గొట్టి యు
య్యాలో జొంపములంచు బాడుదురు భిల్లాంభోజ పత్రేక్షణల్"

పెద్దనమహాకవి :

శహబాష్ - మాతృకకు మెఱుగులుదిద్దుచున్నదీ దుహితృక-

1 వ పండితుడు

అవును. మాతృకలో - భయభీతులైయెనగావచ్చునుగాక. శత్రునృపులు పరమమూఢులుగా గానుపించుచున్నారు. కంటకములను ప్రతినృపతులుగా దలచుటలో ఇక్కడ దుహితృకలో" నుయ్యాలో జొంపములని పాడినది-ప్రభుభీతి నెరుగని యాటవికస్త్రీలు.

2 వ పండితుడు

కడు బాగుగ నున్నది. (మందహాసమొనర్చి) బాధితుడా - అధికారచ్యుతుడగు ప్రవాసి నృపాలుడు, పాడినవారా నాగరికతాశూన్యలును భయమన నెట్టిదో యెఱుగనివారునగు భిల్లాంభోజాక్షులు. ఇది మాతృకకు మెరుగు దిద్దునదిగాక వేరేమి ?

రామకృష్ణకవి

[ఆనందపారవశ్యమున నవ్వుచులేచి] కవయిత్రీ శ్యమంతకమా! ఏతద్భువనవిజయ మహాసభావైభవమును, ఈశరల్లక్ష్మీశోభను బోల్చుచు మధుర మధురముగా నొక సీసపద్యమునను గ్రహింపుము.

కవిత్వ సర్వస్వవేదిని.

[ఆలోచించి] కృతజ్ఞురాలను. ఇదె చెప్పుచుంటిని.

శ్రీ మన్మనోజ్ఞముల్ సితకాంతముల్ - రెల్లు
వెన్నెలు చామరాల్వేలయు శోభ
సలలిత హృద్యవాసనలిచ్చు, సారస
సుమనస శ్రేణి యుత్సుకత సొంపు
నిర్జల కాదంబినీ ఖండముల్ - ధవ
ళాత పత్రస్ఫూర్తుల గల సొబగు-
గుములుగ సద్ద్విజకులము - రాజును, గురు,
కవి, బుధగణము పిక్కటిలు సొరు !

“భువనవిజయ వైభవమున గువలయమ్ము
గెలిచి యేలంగ దక్షుడౌ - కృష్ణరాయ,
సార్వభౌముని గూరిమిసతి వెలుంగు,
రాజ్యలక్ష్మీలలామ - శరత్తునందు”

(సభాసదులెల్లరును కరతాళధ్వనులొనర్చుచు కోలాహలము సల్పుదురు - ధ్వని నిలుచుటకుకొంత కాలమగును)

కవిత్వసర్వస్వవేదిని

[లేచి-శ్రీ సార్వభౌములకు మహామాత్యులకు కవి పండితులకు సభకెల్లను వినయముతో నమస్కరించి, వెనుకకు వెనుకకు నడచుచు లోనికి నిష్క్రమించును]

యవనిక పడిపోవును

(పూర్వపరిచిత లేఖావాహకురాలేతెంచి తెరవత్తుకొని ప్రవేశించి - కవిత్వసర్వస్వవేదిని, యని వ్రాయబడియున్న ఫలకమునుదీసి వైచి యాస్థానమునందు ‘నృత్తనృత్య - నాట్యకళా సర్వస్వవేదిని” యని వ్రాయబడియున్న ఫలకమును వ్రేలాడదీసి వెడలిపోవును. విశ్రామసమయ వాద్యములు మ్రోగ నారంభించును)

తాతాచార్యులు :

కాంతారత్నములలో - నిట్టిసర్వతోముఖప్రజ్ఞగల వైదుష్య మీకాలమున నదృష్టపూర్వము సుమా !

ధూర్జటికవి :

అంతియేగాదు. అశ్రుతపూర్వముగూడను - తెరయెత్తబడును. వాద్యములు సమయానుకూలముగ మ్రోగనారంభించును. సభ్యులెల్లరుగాంతురు. రంగమధ్యమున పూర్వపరిచిత - విదుషియే మనోజ్ఞమగునొక ప్రత్యేక భూమికనుదాల్చి - భరతశాస్త్రోక్త వేషమును పాదములంగదలిన గలగలమని మ్రోయుచు లెక్కననుసరించియున్న

గజ్జలతో - భువికవతరించిన యూర్వశివి బురుడింపుచు - లయానుగుణములుగా - ప్రక్కవాద్యముల ధ్వనులు మేళవింప, రాజహంసవలె సభాసదుల హృదయ ఫలకములయందు దనదివ్యాకృతియచ్చువడగా విద్యుద్వేగమున నొకవిలాసభంగిమను బ్రదర్శించి గణపతిప్రార్థనాగీతమును బరింపుచు - నృత్తమారంభించి. తరువాత వాణీప్రార్థనాగీతమునుబాడి - భరతశాస్త్రోక్తరీతిని తాళములతో గొలువుసల్పను-

ఆ ధ్వనుల కలయిక - సభాస్తారుల చిత్తములందొకవిధమగు పారవశ్యమునొడగూర్చను - తరువాత వరుసగా - (శ్రీ) (శ్రీ) సార్వభౌములకు - మహామాత్యులకు - కవిపండితులకు మహాజనులకెల్ల నత్యంత వినయముతో నమస్కారములొనగించి జయజయదేవహరే అను నష్టపదిని బాడుచు నభినయించును

యమునా కల్యాణిరాగం - ఆదితాళం.

"జయజయ దేవహరే - హరే-"

1) శ్రితకమలాకుచమండల : ధృతకుండల !
ధృతకుండల కలితలలిత వనమాలా ॥జయజయ॥

2) దినమణి మండల మండన, భవఖండన !
భవఖండన ! మునిజన మానస హంస ॥జయజయ॥

3) కాళియ విషధర గంజన, జనరంజన !
జనరంజన ! యదుకుల నలిన దినేశ ॥జయజయ॥

4) మధు మురనరకవినాశన ! గరుడాసన !
గరుడాసన ! సురకుల కేళినిదాన ॥జయజయ॥

5) అమల కమల దళలోచన ! భవమోచన !
భవమోచన త్రిభువన భవన నిదాన ! ॥జయజయ॥

6) జనక సుతాకుచ భూషణ ! జితదూషణ !
జితదూషణ ! సమరశమిత దశకంఠ ! ॥జయజయ॥

7) అభినవ జలధర సుందర ! ధృతమందర !
ధృతమందర ! శ్రీ ముఖచంద్ర చకోర ! ॥జయజయ॥

8) తవశరణే ప్రణతావయం - ప్రణతావయ మితిభావయ
ఇతిభావయ కురుకు శలంప్రణతేషు ॥జయజయ॥

9) శ్రీ జయదేవక వేరిదం - కురుతేముదం,
కురుతే ముదం మంగళ ముజ్జ్వలగీతి ॥జయజయ॥

(సభయొల్లచిత్తరువుపోలిక చేష్టాశూన్యమగును)

పెద్దనమహాకవి :

[చూచి తన్మయుడై] విధాత - కనుగవను - కర్ణయుగ్మమును సృష్టించినందులకు ఫలమిప్పుడు గనుపట్టినది.

రామకృష్ణకవి :

(నవ్వుచు) "చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధి బొడమిన దొలువదో బుట్టువును గన్నపితామహులకు గూడ నబ్బురము గలుగుచున్నదా ?

పెద్దనకవి :

ఇట్టి సన్నివేశములనుగాంచనిచో నా పద్యమేజనించదు-

ధూర్జటికవి

(పెద్దనకవిని రామకృష్ణకవినిగాంచి) మనసంభాషణకేమి ప్రతిదిన ముండునదేగదా ! యించుక కాలమూరకుండుడు !

రామకృష్ణకవి :

నవ్వుచు అహో ! రసికకవి తల్లజము ధూర్జటిమహాకవి యేకాగ్రతకు, మనసంభాషణభంగమొనర్చెనట్లోలెను.

ధూర్జటికవి :

నాకేనా ? మీకుమాత్రమీత్రిలోక సుందరి దివ్యనాట్యమేకాగ్రతతో చూడదగినటుల లేదా ?

రామకృష్ణకవి :

నిక్కముగా నట్టులేయున్నది. మరలనారంభింపబోవుచున్నదటుచూడుడు.

నృత్తనృత్యనాట్యకళాసర్వస్వవేదిని

[పటదీనవదనమును బ్రదర్శించుచు మకరందలహరివలె హృద్యముగా-కన్నడ రాగమాలాపించి)

"యమునాతీర వానీర - నికుంజే మందమాస్థితమ్
ప్రాహ ప్రేమభరోద్భ్రాంతం, మాధవం రాధికాసతీ"

కన్నడరాగం - ఏకతాళం

సావిరహే తవదీనా = సావిరహే

మాధవ ! మనసిజ విశిఖభయాదివ - భావనయా - త్వ
యిలీనా - సావిరహే తవదీనా॥

1) నిందతిచందనమిందు కిరణ మనువిందతి ఖేదమధీరం.
వ్యాళనిలయ మిళనేన గరళమివ - కలయతి మలయసమీరం
మాధవ! మనసిజ విశిఖభయాదివ భావనయా = త్వయిలీనా॥సావిర॥

2) అవిరళని పతిత మదన శరాదివ, భవ దవనాయవిశాలమ్-
స్వహృదయ మర్మణి వర్మ కరోతి సజల నళినీదళజాలమ్॥
మాధవ ! మనసిజ విశిఖభయాదివ = భావనయా = ॥సావిర॥

3) కుసుమ విశిఖశర తల్ప మనల్ప విలాస కలాకమనీయం,
వ్రతమివ తవ పరిరంభ సుఖాయ కరోతి కుసుమశయనీయం॥
మాధవ ! మనసిజ = ॥సావిర॥

4) వహతి చగళిత విలోచన జలధర మానన కమలముదారమ్
విధుమివ వికట విధుంతుద దంత దళనగ ళితామృతధారమ్॥
మాధవ! మనసిజ = ॥సావిర॥

5) విలిఖతి రహసి కురంగ మదేన భవంతమ సమశరభూతమ్
ప్రణమతి మకర మధో వినిధాయ - కరేచ శరం నవచూతమ్॥
మాధవ! మనసిజ విశిఖ = ॥సావిర॥

6) ధ్యానలయేన పురః పరికల్ప్య భవంతమతీ వదురాపమ్,
విలపతి, హసతి; విషీదతి, రోదితి, చంచతి, ముంచతి, తాపమ్
మాధవ! మనసిజ విశిఖభయాదివ = ॥సావిర॥

7) ప్రతిపద మిదమపి నిగదతి మాధవ! తవచరణే పతితాహమ్,
త్వయి విముఖేమయి సపది సుధానిధి రపితనుతే తను దాహమ్॥
మాధవ! మనసిజ = ॥సావిర॥

8) శ్రీ జయదేవ భణిత మిదమధికం యది మనసా నటనీయం,
హరి విరహాకుల వల్లవ యువతీ సఖీవచనం పఠనీయమ్॥
॥సావిరహే తవదీనా॥

ఆవాసో విపినాయతే - ప్రియసఖీ మాలాపి జాలాయతే,
తాపోపిశ్వ సితేన దావద హనజ్వాలా కలాపాయతే,
సోఽపి త్వద్విరహేణ హంతహరిణీ రూపాయతేహాకథమ్,
కందర్పోపియ మాయతే విరచయన్ శార్దూల విక్రీడితమ్॥

సాగ్వభావములు :

(గాఢముగా నిట్టూర్పువిడచి, యేదియో జ్ఞప్తికి వచ్చినివానివలె - చింతాకులుడై బాష్పపూర్ణనేత్రాంచలముల నితరులెవరైనగాంచురేమోయని ప్రక్కకుదిరిగి కూరుచుండును] ఆ విదుషీమణి ప్రదర్శింపుచున్న హావభావహావచాచితికి సభయెల్ల నుత్సాహతరంగితమై యుఱ్ఱూతలూగిపోవును

తాతాచార్యులు :

(విస్మృతావస్థనుండి తేరుకొని ప్రకృతిస్థుడై) అహూ! భరతమహర్షి మరల స్త్రీరూపమున నవతరించినాడు–

రామకృష్ణకవి :

(నవ్వుచు! నందీశ్వరుడన్నారుగారు – కొంపదీసి గురువరేణ్యులు?

తిమ్మరుసుమంత్రి :

(సార్వభౌములను గాంచుచున్నవాడు – రామకృష్ణకవి యీ మాటను విని యించుక నవ్వును)

నృత్తనృత్య – నాట్యకళాసర్వస్వ దేవిని :

కీర్తన : బేగడరాగం – రూపకతాళం

పల్ల॥ నిన్నుగని పరవశనైతిరా ! శ్రీకృష్ణదేవ !
నన్ను రక్షించి యేలుమురా ॥నినుగని॥

అ॥ పల్ల॥ ఎన్నోవిధములవిని – యేమేమోయనుకొంటి
కన్నులగన్నంతకలరూపుతెలిసెరా ॥నన్ను॥

చర॥ చిన్నదానననున్ను – చిడిముడిబెట్టకు
కన్నెతనమున నీకై కాచియున్నానురా !

సన్నుతాంగా ! ప్రాణాది – మత్సర్వ మర్పణము సేసితి –
విన్నపమువిని కరుణతో గడువేడ్క నన్నేలుకొనవటర ॥నిన్ను॥

2) చిత్తజుడమ్మక చెల్ల పూములుక్కల
మొత్తపుమ్మలన్విసరి – మొత్తుచున్నాడురా।
కత్తుల కొఱవు లాజీల్చుచు కాల్చుచునున్న వవేమో,
మిత్తినోటి కబళమే యయ్యేగద బ్రతుకు – నా

కిత్తరిని నీప్రాపుదక్క తదితరమేలేదు బ్రదికింపగ
తత్తరం పడిరార! జీవితదాన మొనరింపరా సామి !॥
నిన్నుగని పరవశనైతిరా, శ్రీకృష్ణదేవ ! ॥నిన్ను॥

(విషాదాతిరేకమున బాడి-కన్నీరుగార్చి కార్చి కార్చి, విస్మృతయై మూర్ఛను శొంది క్రిందపడిపోవును)

(చిత్తరువులమాడ్కి జేష్టలుడిగి నృత్యగానముల సొక్కి పార వశ్యము నొందియున్న సభాసదు లెల్లరు నొక్కమారుగా నులికిపడి స్తంభించిపోయి తిలకింతురు)

(మ్రోగుచున్న వాద్యము లన్నియును నొక్కమారుగా నాగిపోయి, నిశ్శబ్దమునం దొకవిధమగు విషాదము గల్పించును.)

సార్వభౌములు :

(ఉద్వేగాతిరేకమున నులికిపడి, సింహాసనమునుండి - చివాలున లేచి దిగి రాబోయి, యిటునటు గాంచి, లజ్జితుడై యంతలో స్థిమితపడి మరల గూర్చుండును).

తిమ్మరుసుమంత్రి.

(ఇదియంతయును యెరుగనట్టులనే బాఱజూచుచుండి, అంతలో నావేశ మునుబొంది భ్రుకుటితో - సాభిప్రాయముగ ప్రధాన కార్యదర్శిని జూచును)

ప్రధానకార్యదర్శి :

(రంగస్థలమును సమీపింప నేగునంతలో వారవనిత లిరువు రేతెంచి, రంగ వేదికపై మూర్ఛిల్లియున్న నా విదుషిని దగ్గరి, శైత్యోపచారము లొనర్చుచుండగా తెర వ్రాలును).

సభ యెల్ల నా యలజడినుండి క్రమముగా దేరుకొనును. మరల యథావిధిగా వాద్యములు మ్రోగ నారంభించును. తెర యెత్తగా సమున్నతాసనముపై నృత్తనృత్య నాట్యకళాసర్వస్వ వేదిని, ఆసీనయై యుండును వారవనిత లిర్వురును జెరియొకవైపున నిలచి వీవనలు విసరు చుందురు.

ప్రధానకార్యదర్శి :

(మరల ప్రధానామాత్యుని సమీపించి విధేయతతో నిలువబడును).

తిమ్మరుసుమంత్రి :

(సార్వభౌముని వైపు సాభిప్రాయముగ గాంచును)

సార్వభౌములు ,

(తిమ్మరుసుమంత్రిని సాభిప్రాయముగ గాంచును)

తిమ్మరుసుమంత్రి :

(ప్రధానకార్యదర్శిని చెంతకు బిలిచి, రహస్యముగ జెప్పును)

ప్రధానకార్యదర్శి :

(లోనికేగి - పరిచారికలచేత, నమూల్యవస్త్రాభరణములు, బంగారు నాణెములు - మొదలగు వాటి ననేకములగు బంగరుపళ్ళెరములలో నెత్తించుకొనివచ్చును.)

తిమ్మరుసుమంత్రి .

( పరమసంతోషముతో నృత్తనృత్య నాట్యకళాసర్వస్వవేదినింగాంచి)
విదుషీమణి ! మీ సంగీత సర్వస్వవేదినికిని, నృత్తనృత్యనాట్యకళాసర్వస్వవేదినికిని: నల్వురకును వేర్వేరుగా - నాలుగేసి పళ్లెరములతో- వస్త్రాభరణ సన్మానాదికమేగాక - వారివారి కళావైదుష్యములకు పరమానందమొందిన శ్రీ శ్రీ సార్వభౌములు - నాల్గువెయ్యిన్నూటపదారులు (స్వర్ణముద్రికలు) బంగరునాణెములను బంగరుజరీపనిజేసిన పట్టుశాలువలతోగూడ బహూకరింపుచున్నారు-

(పరిచారికలా పళ్లెరములనెల్ల రంగస్థలముపైకి ఆబిడసమీపమున గొనిపోయి యా విదుషీమణి కందింతురు.

నృత్తనృత్యనాట్యకళాసర్వస్వవేదిని :

(వినయముతో లేచి వాటినెల్లనందుకొని కన్నులకద్దికొని చెంతగలనొక మేజాబల్లపైనుంచి చేతులుగట్టికొని నిలువబడును)

తిమ్మరుసుమంత్రి :

ప్రక్కవాద్యములు నిర్వహించిన కళాకారులబృందమునకు మా ప్రధానకార్యదర్శి యథాసత్కారమిప్పుడే యొనర్పగలడు,

ప్రధానకార్యదర్శి

(పరిచారికలచే - మరల పళ్లెరములలో నేవేవియో బహుమతులు బంగరునాణెములుగొని తెప్పించి వారికెల్ల నిప్పించును) వారెల్లరు నాబహుమతులనందికొని పరమానందముతో శ్రీ సార్వభౌములకును ప్రధానామాత్యులకును నమస్కరింతురు

పెద్దనకవి :

(విదుషింగాంచి) చిరంజీవీ ! నీబిరుదనామములు మమ్ము సంతుష్టి పరచినవి. వాటికెల్లను నీవర్హురాలవేసుమా ! కాని నీ నిజనామ మెఱిగించి మమ్ములను ధన్యులనొనర్పుము.

విదుషీమణి :

(పెద్దనకు నమస్కరించి) కవిపితామహుల యాజ్ఞ యనుల్లంఘనీయము - మాతలిదండ్రులు నాకిడిన నామధేయము మణిమంజరియని.

పెద్దనమహాకవి :

(సంతోషించి) సర్వవిధములదగిననామమది.

తాతాచార్యులు :

(ఆనందముతో) యుక్తముగానున్నది.

ధూర్జటికవి ;

(నవ్వుచు) మిగిలినముప్పేరి నిజనామము లేవో

మణిమంజరి :

అవి వారివారినడిగి దెలిసికొనవచ్చును.

తిమ్మరుసుమంత్రి :

కవయిత్రీ రత్నమా ! (శ్రీ) (శ్రీ) సార్వభౌములవారికి తమ యాస్థానమునందష్టదిగ్గజములను పేర నెసిమిదిమంది కవి సింధురముల (బోషింప) నలంకరింపజేయు నెన్నియో దినములుగా నభీష్టముగలదు. ఇప్పటివరకు కాగ్గురు కవివరులు మాత్రము లభించినారు. చిన్నవాడైనను కుమారభట్టుగూడ నెన్నదగినవాడే యనుకొనిన నాతడేడవవాడగును. ఆ మిగిలిన స్థానమును నీవు పూరించుటవలన శ్రీ సార్వభౌముల యభీష్టమైయున్నది.

మణిమంజరి ;

(ఉలికిపడి దోయిలొగ్గి) మహాప్రసాదము-శ్రీవారియానతి శిరసా వహించుచున్నదానను-

తిమ్మరుసుమంత్రి :

(మరొక్కమాట) నేటినుండి నీ వాస్థానకవయిత్రివేగాక - ఆస్థాన గాయనీపదమును, ఆస్థాననర్తకీపదమును, ఆస్థానసాహితీసదస్సభ్యురాలి పదమునుగూడ నొందుచున్నావు. దివాణమునందే, నీకును నీ పరిచారికలకును వాసయోగ్యమగు సౌధముగూడ నొసగబడుచున్నది. పై నల్వురివేతనములును - బహుమతులు గూడ నెప్పటికప్పుడు నీ కందుచుండ నేర్పాటు లొనరింపబడును.

మణిమంజరి .

(పరమానందముతో, (శ్రీ)వారిచే సర్వాంగీణముగా సత్కరింపబడితిని. వారి యాజ్ఞలకు సర్వదా విధేయను. నాకొలదికి మించిన సన్మానమిది.

రామకృష్ణకవి :

(తృప్తిగాంచి, రత్నమా రీతుపార్థివః, ఈ జాతి వజ్రము తనకుదగిన స్థానమున ఖచితమగుచున్నది-

మణిమంజరి :

(తిమ్మరుసుమంత్రిని గాంచి వినయమున ాంజలిబద్ధయై) తమరొసగిన యీ వరములను శిరమున వహించి, సేవించుకొందును— నాజన్మము ధన్యత నొందినది—

రామకృష్ణకవి :

(నవ్వుచు) ధన్యతనొందినది నీ జన్మముగాదు. శ్రీ సార్వభౌమా శ్రితులైన - కవిపండితమండలుల జన్మము శ్రీ విద్యానగరాస్థాన మహాసభాస్తారుల జన్మము ఆంధ్ర కర్ణాటదేశీయ మహామహుల జన్మము. అష్టదిగ్గజముల నెన్నుకొనిన శ్రీ వారు ఆంధ్రభోజప్రభువై యాఠ్యావర్తమెల్ల ప్రకాశింపగలరు - సార్వభౌమసదస్సునాటినుండి - సంపన్నమగుచున్నది.

పెద్దనకవి :

నిజము. నిజము - సంపన్నమేగాదు—సుసంపన్నమైనది.

మిగిలినకవులెల్లరు :

భేష్-శభాష్ - వహవా - ఇత్యాది వాక్యములచే తమతమ యానందములను దెలియపరతురు.

తిమ్మరుసుమంత్రి :

మానినీమణీ! నీగానసభలకుగాని - నీనృత్యసభలకుగాని నీ వెన్నుకొనిన ప్రక్క-వాద్యముల కళాకారులకుగూడ మానసనేతనములును నివసించుటకు భవంతులునుగూడ సంస్థానమే యొసంగుచుండగలదు.

మణిమంజరి :

(నమస్కారముద్రతో) తమయానతికందరమును బద్ధులము.

((పక్క వాద్యములను నియమింపబడియున్న మగువలెల్లరును లేచి శ్రీసార్వభౌమ మహామాత్యులను నమస్కరించి) ధన్యుల మైతిమి. శ్రీవారియాజ్ఞను శిరసాధరించుచున్నారము. (వెంటనే)

వందులు, మాగధులు, వైతాళికులు బారులుదీరి బిగ్గరగా కైవారములొనర్పనారంభింతురు.

శ్రీ శ్రీ శ్రీమన్మహారాజాధిరాజరాజపరమేశ్వరా !!
జయీభవ ! విజయీభవ ! దిగ్విజయీభవ – శ్రీ శ్రీ శ్రీ

మదాంధ్ర కర్ణాట సామ్రాజ్య విద్యానగర సమలంకృత – భువనవిజయ మహాసభామంటప మధ్యస్థ నవరత్నఖచితదివ్యసింహాసనాసీనా !!

జయీభవ ! విజయీభవ ! దిగ్విజయీభవ – శ్రీ శ్రీ శ్రీ ఆస్థానకవీశ్వరాష్టదిగ్గజభరిత మహాసభాంతరాళ నిత్యకవితావ్యాసంగ విభ్రాజమానా !! జయీభవ ! శ్రీ శ్రీ శ్రీమదాంధ్రభోజమహారాజ బిరుదవిరాజమానా !! జయీభవ విజయీభవ – దిగ్విజయీభవ –

"దయమానాక్షి విలోక, లోకహిత కృత్ప్రారంభ, రంభాకుచ
ద్వయదుర్గాధిపతిత్వ పత్పరితగాథావ్యక్త దోస్సార, ! సా
ర యశస్సాంద్ర దిశాంత; శాంతహృదయారంగన్న యాచార చా
రయుతోపాయ విచార; చారణగణ ప్రస్తూయ మానోదయా॥"

'నాగమాంబాధి భూనారసింహాత్మజా !
భోగలీలా పరాభూత సంక్రందనా !
త్యాగ విద్యావిషద్యాయిత ప్రాభవా !
సాగరాంతక్షమా సంపదే కాస్పదా !"

"యాదవత్వమున సింహాసనస్థుడుగామి
సింహాసనస్థుడై వెన్నుమెరయ
గొల్లయిల్లాండ్రతో గోడిగించుటజేసి
పరకామినీ సహోదరత జూప

మరి జరాసుతునకై మధురడించుటజేసి
పరవర్గ దుర్గముల్బలిమి గొనగ
పారిజాతము నాసపడి పట్టితెచ్చుట
నౌదార్యమున దాని నడఁగుపరుప.

"గోరి తొలిమేన దనకైన కొదువలెల్ల
మాన్పుకొనవచ్చి భువనైక మాన్యలీల
నవతరించిన కృష్ణుడౌ ననగమించె
నరసవిభు కృష్ణరాయ భూనాయకుండు॥"

"పరిపంథి దోర్బల సమి
త్పరి పర్థిష్ణు ప్రతాప దహనారణివే
సరస కళాధోరణివే
నరసాధిప కృష్ణరాయ నాయకమణివే"

శ్రీశ్రీశ్రీ తుళువంశపయః వారావార రాకాసుధాకరా !!
జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవా—

శ్రీశ్రీశ్రీ నాగాంబికా నరసింహరాయ జాయాపతీ
భాగ్యనిధానా పరబిడౌజా !!
జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవా—

శ్రీశ్రీశ్రీ త్రిలిఙ్గ కర్ణాటక దేశ సరోజసరోవరయుగ్మైక భాను
మండలశోభా భాసమానా !!
జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవా—

శ్రీశ్రీశ్రీ కవిపండితమండనాయమానా వరధారానగరా
ధీశ్వరా !!
జయీభవ, విజయీభవ, దిగ్విజయీభవా—

[ తెరవ్రాలును ]

# ఇ ది చ తు ర్థాం క ము.

[ ప్రవేశము ]

(కటకపురపు కోటలో మహారాజాంతఃపురములోని తుష్టాదేవీ సౌధమునకు జెందిన యుద్యానవనములో చేతిలో పూలునిండిన బుట్టను దాల్చి విచారవదనముతో— ప్రవేశము భానుమతి - పుష్పములగోయును)

భానుమతి :

(నిర్వేదముతో నిట్టూర్పు నిగుడించి ఏరూ భర్తృదారిక యనుభవింపు చున్న వ్యధకు పారము గనుపట్టకున్నది. ఎన్నెన్ని రీతుల శైత్యోప చారము లొనర్చుచున్నను, బాధ శమింపలేదు సరిగదా! ఎన్నియో రెట్లధికమగుచున్నది.

"నిదురబోవదు రేబవల్నిమసమైన
ముట్టదాహార పానీయములను - విడదు
పడక -జిక్కియు శల్యమై పాలిపోయె
బ్రాణవిషయక సంశయావస్థ గలిగె''

మేమేమి చేయగలము. అజ్ఞాతకులశీల నివాసవిషయుడగు నా రాజపుత్రునితో. పరిచయమైనది మొదలుగా నాయమస్థితి యొకవిధ ముగా నుండి యుండి, యిప్పటి కీవిధముగా బరిణమించినది—

(మరల గాఢముగా నిట్టూర్చి) తామరాకులతో దామరపూలతో దయానరొర్చిన శయ్యపై బరుండబెట్టి, తామరపాకులవీవనలతో విసరుచుంటిమి. పన్నీటితో దడపుచున్న యీ వివిధ పుష్పములను బైనగప్పచుంటిమి. పచ్చకర్పూరముతో గలిపిన మలయజములదుచనే యుంటిమి. ఎన్ని చేసినను తాపభరమతిశయింపుచున్న దేగాని - ఇంచు కైననుపశమించుటలేదు - అహో! మన్మధునిదుడుకుచేష్టలు - అతి లోక వైదుష్యవిరాజమానయగు మా రాజకుమారికే యిట్టిచెట్ట

గల్పించినాడు - మాభర్తృదారికనిట్టిస్థితినుండి యెటుల బ్రతికించుకొన గలవారమో నాకు దోచుటలేదు. ఇప్పటికైన నా శూర శిఖామణి యగు రాజపుత్రుడెవరో ? వాని దేశ మెద్దియో ? మొదలగు వివరములు తెలియగల్గినచో నాయము బాధశమింపజేయుటకే దేని మార్గమూహింప వచ్చును. అర్హుడైనచో పెద్దలకు దెల్పియో ? అనర్హుడైనచో మరొక రీతిగనో తగిన తెఱవు నెఱకపిలగును - కాని ఇంతకును వానిజాడయే గురుతింపనేలేక పోయితిమే ! యేమి చేయగలము యెందరు వేగుల నియమించియు-నేమేమి ప్రయత్నములొనర్చియు, నింతకైన నాతని నిజనామమును గూడ దెలిసికొనజాలకపోయితిమే ? ఒకవేళ నాతడెవరో తెలిసికొంటిమే యనుకొందము. అయినమాత్ర మేమిలాభము. భరత ఖండమునందిప్పుడున్న క్షత్రియవంశములలో నత్యున్నత వంశము దమ దనునహంకారముతోనుండిన మా ప్రభువతనికి దమపుత్రిక నొసంగుట కంగీకరింపవలదా ? భర్తృదారిక పడుచున్న సంతాపమును జూడజాలక మా మహారాణిగారితో నీయమవిషయమెల్ల మెలమెల్లగా జెప్పితిమి. వినియామె వేదనజెందినదేగాని, యామెయుమాత్ర మేమి చేయగలదు. ప్రభువుతోనిట్టి విషయమేమియును జెప్పసాధ్యముగాదుగదా !
[ప్రొద్దువైపు పాఱజూచి] అరే నేనువచ్చి చాలతడవయిపోయినది. పార్వతి యొక్కరితయే మా రాజపుత్రిక చెంత నుండగలదా ? కోసినవరకీ పుష్పములనీపూటకుపయోగించుకొందుము. నేనికత్వరితముగా నాచోటికేగ వలయును. (నిష్క్రమించును)

ఇ ది ప్ర వే శ క ము

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## పంచమాంకము

### రంగము ౧

(కటకపురదుర్గమునందలి యంతఃపురములో, తుఖ్ఖాదేవి సౌధమునకుఁజెందిన యుద్యానవనమధ్యమునందలి మాధవీమంటపమునందు పద్మపత్ర - పద్మరచితశయ్యపై విరహబాధ ననుభవింపుచు, తాపభారమున బొరలుచు, నిట్టూర్పులు నిగుడింపుచున్న దీనమూర్తి, కృశాంగి, తుఖ్ఖాదేవి, సమీపమం దుపచరింపుచున్న పార్వతియు ప్రవేశింపుచున్నారు)

తుఖ్ఖాదేవి :

దుర్భరము సఖి ! యీ బాధ దుర్భరము ! (కన్నీటితో నేడ్చును)

పార్వతి :

(చందనములది తామరాకు వీవనతో విసరుచు) ఊరడిల్లు మూరడిల్లుము విదుషీరత్నమవు నీవే యిటులైన నెట్లమ్మా ?

తుఖ్ఖాదేవి :

(తాప మభినయింపుచు) అయ్యయ్యో! ఎట్లూరడిలుమనుచున్నావే? యేమిజూచుకొని యూరడిల్లుదునే ?

రాగం - చక్రవాకం - రూపకతాళం

పల్లవి॥ ఎట్టులోర్తునె చెలియా? ఎట్టులోర్తునే చెలియా?
ఈ వ్యథాభరమ్మును నే ॥నెట్టులోర్తునే॥
అనుపల్లవి॥ కట్టడిదైవమ్ము నన్ను కడతేర్చక పోయెగదే ॥ఎట్టు॥
చరణం॥ కట్టా యీ తాప మెంతకాల్చుచున్నదే తనువును?
గట్టిగ విసరకు, నిప్పుల కణములు రాలుచున్నవి ॥ఎట్టు॥
2. తామరాకు వీవన నాకేమియు సుఖమొసగుటలేదేమో
మైకము గ్రమ్మెడు - నెంతయు బాధించెనమ్మ ॥ఎట్టు॥

పార్వతి :

(విచారమును గ్రుంగుచు) ఏమిచేయగలను తల్లీ! నీబాధ నుపశమింపజేయుటకు, నా శరీరమును బలిగా యిమ్మందువా? యిచ్చుటకు సిద్ధముగానున్నాను కాని, అంతకంటే నేనేమి జేయగలను రాకుమారీ!!

తుష్ణాదేవి :

(విచారభారముతో కన్నులరమోడ్చి) అవును - అంతకంటె నీవుమాత్ర మేమిచేయగలదానవు (నిస్పృహ నభినయించును)

పార్వతి :

(నిట్టూర్పు విడచి) అప్పటికిని, నీ యీ స్థితిని మహారాణీవారికి దెలిపితిమి.

తుష్ణాదేవి :

(రిచ్చవడి) అయ్యయ్యో! ఈ విషయమును మాతృ శ్రీవారికేల దెల్పితివే? పార్వతీ?

పార్వతి :

ఏమిజేతునమ్మా? నీ స్థితిజూచిన గుండెలు వ్రీలిపోవుచున్నవి. మీ రక్షణకై వారేదైన మార్గ మాలోచించగలరేమో యని మదిలో నూహించి యటుల జేసితిమి.

భానుమతి ;

(పూలబుట్టతో ప్రవేశించి) భర్తృదారిక కెటులున్న దే పార్వతీ'—

పార్వతి .

పూలుగోసికొనివచ్చుట కింతయాలస్యమేల జేసితివే! భానుమతీ?

తుష్టాదేవి :

(తాపముచే నిటునటు కొట్టుకొనును)

భానుమతి :

(రాజపుత్రికను గాంచి, అయ్యో! నాతల్లి కెంతబాధగలిగినదమ్మా! నే బూలకేగుచుండ మహారాణీవారు నన్ను బిలువనంపి భర్తృదారిక కెటులున్నదని ప్రశ్నించినారు.

పార్వతి :

ఆ - తరువాత—

భానుమతి :

నేనిచటి వృత్తాంతమును సర్వము నివేదించితిని.

పార్వతి :

మహారాణీవారేమని సెలవిచ్చినారు ?

భానుమతి :

కొంచెముసేపటిలో వీలైనచో ప్రభువులతో గలసిగాని-లేనిచో తామైనగాని వచ్చి చిరంజీవిని జూచిపోవుదుమనినారు.

తుష్టాదేవి :

[విషణ్ణవదనముతో] ఏమిపని జేసితి రే ? నేనిట్టిస్థితిలో వారి నెటుల దర్శింపగలను ? ఏమని సమాధాన మొసగగలను ? తండ్రిగారినిగూడ భిలుచుకొనివచ్చునా ?

భానుమతి :

ఎవరు వచ్చిననేమి! నీవించుక యూరడిల్లి నేదదేరియున్నచో వారు వచ్చి మాటలాడిపోయెదరు.

తుక్షాదేవి :

(విచారభారముతో) (పరధ్యానముతో) అహో మందభాగ్యను మాన ప్రాణ సంరక్షకునికి దూరమై, మరణింపనుంటిని—

పార్వతి :

(వినజాలక చెవులు మూసికొని) అమంగళము ప్రతిహతమగుగాక. పరమాత్మా! మా రాజపుత్రిని రక్షింపుము. (పాఱజూచి) బాష్పవారిచే సిక్తమగుచున్నను మదభర్తృదారిక శోభ ద్విగుణముగ గన్పట్టుచున్నది.

జలకణ సిక్తమయ్యు జలజమ్ము మనోహరతన్వెలంగు - ను
జ్వలతరశోభచే వెలయు, వర్షకణమ్ములు నిండనార్ద్రమై
బొలిచెడు పూవుదీవ - యటపో - మనమందు నితాంతచింతనా
కులయగు రాజనందినికి గ్రొమ్మెఱుగిచ్చెడు బాష్పబిందువుల్॥

తుక్షాదేవి :

( మెల్లగా కనులువిచ్చి చెలికత్తెలను గాంచును )

పార్వతి :

(పైటచెరగుతో తుక్షాదేవి కన్నీటిని దుడుచును)

భానుమతి :

(దుఃఖముతో గద్గదకంఠయై). తల్లీ : నీ పాలిటి కెంత దుఃఖము ప్రాప్తించినదమ్మా ?

తుఖ్బా దేవి :

ఈ మాటలకేమిగాని సఖి! ఆ మహావీరుడు సంగర రంగమున, ముష్కర తురుష్కసైనికవధమును ముగింపబోవుచు, దన సైనికుల నుద్దేశించి. బిగ్గరగా పల్కిన వాక్యములు నీ కింకను మరపునకు వచ్చి యుండవనుకొందును.

భానుమతి

(విచారముతో తనలో) ఆ రాజపుత్రుని మరపింప మే మెన్ని రీతుల బ్రయత్నింపుచున్నను మాటిమాటి కాతని స్మరణయే – ఎల్లప్పు డదే చింతతో వంత నందుచున్నది. (ప్రకాశముగ) వాటెని మరతుమన్నను మరువగలమా! తల్లీ !!

తుఖ్బా దేవి ·

(పరధ్యానముగా నాలోచింపుచుండి) ఆ వాటెని జెప్పుము.

భానుమతి :

"శరణనువాని గొట్టకుడు, శస్త్రవిహీనుల జంపబోకుడీ-
దురమున గాయముల్దగిలి ధూళిని బొర్లెడివారినెల్ల, నే
ర్పరచి చికిత్ససల్పుడు - శరంబులు పైబడ గ్రిందగూలియు
పిరియును నాడక న్మొఱలబెట్టెడు దీనుల నుద్ధరింపుడీ"

తుఖ్బా దేవి :

(కన్నీరు విడచుచు) పగతురపై గూడ నింతటి దయావృష్టి గురిపించెడు నా ఘనునకు నామీద నింతటి నిర్దయ గలుగుటకు కారణము తెలియలేదు.

భానుమతి :

ఆయన యవస్థగూడ, నీ యవస్థకంటె దక్కువగా నున్నదని, నీ వెట్లూహించితివమ్మా తల్లీ!

పార్వతి :

అదియు నిజమే, మన మెవరమో యాయనమాత్ర మెటుల దెలిసికొనగలుగును-

తుష్ఖా దేవి :

[ఆశ్చర్యముతో జూచి] అటులగునందువా ?

పార్వతి :

తప్పకుండ, ప్రయాణవేళ నీవొసగిన ముక్తావళి దాల్చినప్పు డాత డాడిన మాటలు వింటిమిగదా ! కడకు గురుదేవునితో నీవనిన మాటలు వినినతర్వాత నెంతయో మురిసిపోయినాడుసుమా !!

తుష్ఖా దేవి :

(దుఃఖపడి) అహో మందభాగ్యను, నా ప్రాణదాతకట్టి హృదయవేదనం గల్పించియు, నేనింకను జీవములతో నున్నదానను-

భానుమతి :

ఊరడిలు మూరడిలుము రాజపుత్రీ !

తుష్ఖా దేవి :

(దీర్ఘముగా నాలోచింపుచు దనలో) ఆ మహావీరుని మిత్రుడు తన శక్తియుక్తుల కొలది ప్రశ్నించినను - నా జాడ దెలుప నశక్తనైతిని. నా కిట్టిశిక్ష న్యాయమేతండ్రీ! జగన్నాథదేవా ! ఈ వ్యథ యెట్టిదియో నే ననుభవింపుచుంటిని. నా ప్రాణరక్షకునకుమాత్ర మిట్టి వ్యథాభారమ్ము గూర్పకుము. వలయునేని నా ప్రాణముల బలిగొని యైన నా మహానుభావుని చల్లగా కాపాడుము !!

[నమస్కరింపుచుండ తెర వ్రాలును.]

పంచమాంకము 1 రంగము

## పంచమాంకము రంగము - ౨

(సింహాచల ప్రాంతమున - శ్రీ వినోదానందాశ్రమ సమీపమునగల పూర్వ పరిచితారణ్యమునందు - శ్రీ విద్యానగర సార్వభౌముల స్కంధావారము, వివిధవర్ణ విరాజిత పటకుటీరములు బారులుతీర్చివైవబడియుండును. గజఘీంకారములు హయ హేషలు - సైనికులకోలాహలముతో - నాప్రాంతము శబ్దాయమానముగనుండును. సమయము సాయంకాలము అస్తమిత రవి కిరణప్రభావముచే పశ్చిమాకాశమత్యంత మనోజ్ఞముగ నొప్పారుచుండును, ప్రకృతశోభ సర్వజన హృదయముల నాకర్షింపు చుండును )

(సభామందిరమునకుగాను వేయబడిన పటకుటీరమునకు వెలుపల బారులుదీర్చి నిలువబడి - ప్రవేశము వందులు - మాగధులు - వైతాళికులు)

శ్రీ శ్రీ శ్రీ - ఆంధ్రకర్ణాటరాజ్య రమారమణా !! జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ - శ్రీ శ్రీ శ్రీ మూరురాయరగండా !! జయీభవ !!

శ్రీ శ్రీ శ్రీ - భాషాలంఘిత భూపాలభుజంగా జయీభవ ...

శ్రీ శ్రీ శ్రీ - తుళువవంశపయః పారావారరాకాసుధాకరా ! జయీభవ!—

శ్రీ శ్రీ శ్రీ - శత్రురాజ వదనరాజివిభాసిత, కేయూరకటకాది హాటకభూషణ విభాసురా !! జయీభవ !

శ్రీ శ్రీ శ్రీ - కారుణ్య రసపూరితాంతరంగా !! జయీభవ — జయీభవ !

శ్రీ శ్రీ శ్రీ - భీరుజనసంరక్షణౌచిత్య కటాక్ష వీక్షణా ! జయీభవ!

చక్కెర విలుకాని చక్కందనముగల్గి
చొక్కమౌ నార్వీటి బుక్కరాజు
సాకల్యముగ కీర్తి సర్వదిక్తటులందు
ప్రాకటస్థితి నిల్చునౌకువారు

కంటకరాజన్య గర్భంబుల గడంచి,
లీలచేమించు నందేలవారు
ధాటీ నిరాఘాట ఘోటీహత విరోధి
కోటులై వెల్గు వెల్గోటివారు

చండ తరశౌర్యులగు కురాసానివారు-
బూదహాలివారు మొదలగు భూమిపతులు,
కొలువ సింహాసనంబున గొలువుదీరు
రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయమౌళి"

జయీాభవ - విజయీాభవ - దిగ్విజయీాభవ !

"ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె,
వినుకొండ మాటమాత్రన హరించె
గూటముల్చెదరంగ గొంపపీడగలించె
బెల్లముకొండ యచ్చెల్ల జెఱిచె
దేవరకొండ యుద్వృత్తి భంగముజేసె
జల్లిపల్లె సమగ్రశక్తిఁ ములిసె
గినుకమీర ననంతగిరి క్రిందుపడజేసె
గంబంబుమెట్టు గ్రక్కన గదల్చె

"బలని కాయంబు గాలిమట్టులన యడచు
గటకమును నింకననుచు నుత్కలమహీశు
డనుదినమ్మును వెరచు నెవ్వనికి నతడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుడు"

జయీాభవా - విజయీాభవా - దిగ్విజయీాభవా -

"మునుకొనికొండవీటికడ మూఢతరుద్రుడు కృష్ణనందనున్
మనసిజునిన్దహించెనది మానుషమే ? నరసింహకృష్ణరా
యనృపతి, కొండవీటికడ నాహవభూమి, ప్రతాపరుద్రనం
దనుడగు వీరభద్రు గరుణామతిగాచె జగత్ప్రసిద్ధిగన్"

జయీాభవ - విజయీాభవ - దిగ్విజయీాభవా -

"వర్ణనీయకీర్తి వైభవా ప్రభూతభూతి దృ
క్కర్ణకుండలావి తీర్ణ కర్ణ దీర్ణ హృద్భ్రమ
ద్దుర్ణయారి మానహారి దుర్భరాన కార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి కొంతవీడు మండలా''

జయీభవ – విజయీభవ దిగ్విజయీభవా –

వందులు – మాగధులు – వైతాళికులు – ఓసరిల్లుదురు –

(తెరయెత్తుటతోడనే –పూర్వపరిచితములగు గండశిలలపై [జిట్టడవిలోనివి] కూర్చుండి శ్రీ శ్రీ శ్రీ విద్యానగర సార్వభౌములు శ్రీ కృష్ణదేవరాయలు రామ కృష్ణకవితో సంభాషించుచు ప్రవేశింపుచున్నారు)

శ్రీ సార్వభౌముడు

[నలువంకలబాఅజూచి, దీర్ఘమగు నిశ్వాసము వదలును]

రామకృష్ణకవి :

[ఉలికిపడి ప్రభువునుగాంచి] పూర్వస్మృతులు జాగరితములగు చున్నటులున్నవి. ప్రభువులకు

సార్వభౌముడు :

(కొంచెముసేపు మౌనముగానుండి విచారము జిప్పిలుచుండ) అవును సత్కవీంద్ర వచోమృతాస్వాదన పారవశ్యముతోడను – మణిమంజరీ మృదుమధుర సంగీత, హృదయంగమాభినయ – మనోజ్ఞకవితా చాతుర్య తన్మయత్వములతోడను పట్టుదలతో నిగ్రహించుకొనుచు వచ్చిన మనస్సు— భయంకరసంగర రంగస్థలముల, దురహంకారులై విజృంభించిన రిపువీరులతో, నిరుపమాన కౌశలమున దురంబొనరించుట తోడ మరపునకువచ్చి, యింతకాలమునుండి మానుకొనివచ్చుచున్న గాయము – ఈ చిరపరిచిత ప్రదేశములగాంచిన తోడనే సెలవైచి మరలబాధింపసాగినది.

రామకృష్ణకవి :

(భ్రూభంగ మొనర్చుచు) అట్లైన నీస్కంధావారమును మరింత ముందునకుఁబోయి వైచినచో - బాగుగనుండెడి దేమో గదా!

సార్వభౌముడు :

(ఉద్రిక్తుడై) దీనివలన ప్రాణము లేపోయినఁబోవుఁగాక - గురుపాదుల దర్శన మొనర్పకుండ ముంపుల కెట్టు లేగగలము. చిరకాలానుభుక్తములగు నీ సుందరప్రదేశముల మాత్రము దర్శింపకుండ నెటు లుండగలము?

రామకృష్ణకవి :

కావున గురుపాదుల పాదసందర్శనమును వీడకుండ. నీరెండు దినములును వారిసాహచర్య భాగ్యము నే గలుగ జేసికొనుచుందము.

సార్వభౌముడు :

[అస్తిమితుడై] అది మరింత ప్రమాదకరమని భావింతును. నా హృదయము విదళనోన్ముఖమగు నగ్నిపర్వతమువలెనున్నది. ఈ స్థితిలో వారినంటిపెట్టుకొని యుండుటలో మహాపరాధము శుభసూచనలున్నవి.

రామకృష్ణకవి :

(విచారమునిండినమనస్సుతో) అయిననిక కర్తవ్యమే లేదా? ఆ యగ్నిపర్వతమటుల ఘటాలున బ్రద్దలుగావలసిన దేనా?

సార్వభౌముడు :

(ఆమాటవినిపించుకొనకయే లేచిపోయి - మనోరంజనీ లతానికుంజమును సమీపించి, దానినించుకసేపు దడవుచు స్పర్శసుఖంబభినయించి, దానిపైబ్రాలి

"ఇంచుకయైన మార్పుగనుపింపదు, నాటివిధమ్మె సొంపుగ
న్పించును, జందనద్రుమమునే తన తీవలు జుట్టుముట్టగా
నెంచగదగ్గ మార్పొకటియే - రమణీయత నా శకుంతలన్
గొంచెము సేయజాలుననుగుం జెలిలేదిట నెంతజూచినన్"

[నలువైపులబాఱజూచి] దీర్ఘముగా నిశ్వసించి]

"నాటి సౌందర్య వారాసి నాతలపున
దగిలినంతనె, హృదయమ్ము దావవహ్ని
పాలబడి, - మండి. మండి, తాభస్మమగును
ఎటులనీవ్యథ నకటా ! భరించువాడ"

(చింతాతిరేకమున - గనులలో బాష్పమునిండును)

రామకృష్ణకవి :

(నిర్విణ్ణుడై) తమయీస్థితిగాంచిన నాచిత్తము త్తలంపడుచున్నది, మహామాత్యుల యోజనలకు విరుద్ధముగా దమ యీ స్థితి జైత్ర యాత్రాభంగకారి కాజాలదుగదా !

సార్వభౌములు :

(చింతదిగమ్రింగ బ్రయత్నమొనరించి పట్టుదలతో) అటులెన్నటికిని గాజాలదు మిత్రమా ? ఆరంభించిన నీ జైత్రయాత్రయిటుల సాగిపో వలసినదే - ఆంధ్రమహావీరుల పరాక్రమప్రకటన భీకరడిండిమధ్వాన ములతో నార్యావర్తమెల్ల బ్రతిధ్వనించిపోవలసినదే.

రామకృష్ణకవి

(సంతుష్టిలో) ధన్యులంసార్వభౌమా ధన్యులం మిము పతిగా బడసిన కర్ణాటాంధ్ర రాజ్యలక్ష్మి పరమధన్య-

సార్వభౌములు :

(ఆకాశములక్షించి వ్యథాభరముతో) కొలిమినుండి కాచి యిప్పుడే వెలికిదీయుచున్న యయోగోళమటుల బ్రాగ్దిక్కునందు చంద్రుడుద యింపుచున్నాడు. పూర్ణిమనేడేగదా !

రామకృష్ణకవి :

అవును. మిత్రమా ! పూర్ణిమనేడే ! (ఆకాశముపలక్షించి)

"సాధుజనుల కాజన్మ విరోధులైన
ముచ్చులకు దైవమితడు తమ్ములకు వైరి
యందులకుగాదె ఛాయాగ్రహమ్ములతని
మీదికిందూకి రాకల గ్రమ్మంగుచుంట"

సార్వభౌముడు

(మిగులబాధనభినయించి) మిత్రమా! ఇకనాపుము.

రామకృష్ణకవి :

[పశ్చాత్తాపమునభినయించి] ఈ స్థలమహిమయే యట్టిది. యేమి పల్కినను మా ప్రభువుల గష్టపెట్టుటకే యగుచున్నది. ఇక నేను మౌనమునే యుపాసింతునుగాక.

సార్వభౌముడు

(బాధతో తాపమునభినయించి) మన్మధుడనంగుడేల యయినాడు! అంగములేనివాడీరీతిగ నన్ను బాధింపగలడా? (ఆకాశముపలక్షింపుచు నంజలిఘటించి) భగవాన్ మకరధ్వజ!! విరహిజనదర్పదళనద్విభుడ!

"గట్టిగ బుప్పబాణముల గర్ణములంటగలాగి, డెందము
న్గొట్టుము - దానికంటెనిక గొప్పపనుల్మరి యేమొనర్తువీ
పెట్టెడిబాధ గుండియలు గ్రీలగజేసిన జేయనిమ్ము యి
ప్పట్టున బ్రాణము ల్తనువుబాసిన బాయగనిమ్ము - దర్పకా

రామకృష్ణకవి :

(ఉలికిపడి రెండుచెవులు మూసికొని) అమంగళము ప్రతిహతమగు గాక - ప్రభూ! యీదర్పకునిధాటికిటులైతిరా! (తనలో)

'శతసహస్ర ధనుర్ధర పతుల, దుర్తిని
గెల్చి చెండాడు మాప్రభుసింహ మకట!
చెఱకు విల్కానిచేతికి జిక్కియెటుల
దల్లడిల్లుచునున్నాడు? దైవమాయ!!"

విబోధానందస్వామి :

(గండశిలమాటునుండి యాకస్మికముగ ప్రవేశించి నవ్వుచు) వత్సలారా ! జీవితములో నెప్పుడో యొకమారు ప్రతివారికనుభవములోనికి వచ్చునదేగదా యిది.

"ఒక పదార్థము రెండుగా నుత్తరించు
మనధనుర్ధరు లెందరో గలరు గాని
రెండినైక్యమ్ము బఱచెడు పృథులశక్తి
గల మహాత్ముండు మారుడొక్కరుడగాడె ?"

సార్వభౌముడు :

(గండశిలనుండి దుమికి గురుదేవులకు నమస్కరించును)

రామకృష్ణకవి :

(గండశిలనుండి దుమికి గురుదేవులకు నమస్కరించును)

విబోధానందస్వామి :

(వారిర్వురి శిరములపై చేతులుంచి సంతోషముతో) దీర్ఘాయుష్మంతులు గండు. అభీష్టసిద్ధి శీఘ్రముగనే యగునుగాక.

రామకృష్ణకవి :

ఈయసమయమున దామిటకు దయచేసితిరేల ?

విబోధానందస్వామి :

ఈ పర్వదినంబున సాధింపదగిన నొకయోషధికొఱకు చంద్రోదయ సమయమున వెదకుచు - నిటువచ్చి మీ సంభాషణమును కొంతకుకొంత వినుటతటస్థించినది. (రాయలనుగాంచి) వత్సా ! విజ్ఞాననిధివి సర్వవిద్యా రహస్యవేదివి - ధీరోదాత్త నాయకలక్షణ విలక్షితుడవు నీవుగూడ నిట్లులగుదువనియూహింపనైతివి సుమా !

సార్వభౌములు :

(లజ్జనొంది శిరమువాల్చి గురుదేవుని పాదములగాంచును)

విబోధానందస్వామి

వత్సా ! విజయుని యపరమూర్తివై విజృంభించి శతృరాజుల నిర్జించి, కవిపండితమండలి నాదరింపుచు కళాసర్వసముద్ధరింపుచు ధర్మముదప్పక ప్రజల బాలింపదగిననీవు బేలవై యిటులగుట **తగునా !**

కర్మవశంబున స్జగతి గల్గును సర్వము - విజ్ఞులెల్ల నా
మర్మము వెల్లడింప వినమా ? గతజన్మసహస్రలబ్ధమౌ
కర్మము జీవులన్నల జగత్తున కీడ్చుచు నేగుచుండు, దా
శర్మముగోరు జీవులకు శ్వాసయు బీల్వ స్వతంత్రమున్నదే ?

దట్టముగా హిమమాచ్ఛాదింపుచున్నది – ఆశ్రమములోనికేగు దుమురండు. (శ్రీ విబోధానందస్వామియుందును – వారిద్దరును వెను కను ఆశ్రమముదిక్కుగా నడతురు)

[తెర వ్రాలును]

ఇది పంచమాంకము

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## షష్ఠాంకము

### రంగము ౧

(స్కంధావారముమధ్య సార్వభౌముని రహస్యాలోచనాపట కుటీరము రహస్యముగ సంభాషించుచు సార్వభౌములు తిమ్మరుసుమంత్రియు ప్రవేశింతురు)

తిమ్మరుసుమంత్రి :

వత్సా! ఈకార్యము నీవాలోచింపుచున్నంత సులభమైనదికాదు ఆ పాత్ర సామంతు లెంత శూరశిఖామణులో అంతట యుద్ధనీతి విశారదులు. ఇక ప్రభుభక్తి పరాయణతయందు వీరిని జెప్పి యితరులను జెప్పవలయును.

సార్వభౌములు :

దండోపాయము వీరియం దుపయోగింపడందురా!

తిమ్మరుసుమంత్రి :

(తల నడ్డముగద్రిప్పుచు) అవును వీరియందు దండోపాయము ఫలకారికాకపోగా మరింత విషమింపవచ్చును.

సార్వభౌములు ;

మన బలముతో వీరి దుర్గములనెల్ల వరుసగా జయించుకొనుచు పోయినచో వీరు లోబడిపోరా?

తిమ్మరుసుమంత్రి :

(నవ్వి) కటకముపై కెత్తివచ్చిన శత్రురాజులెల్ల జేయుపని యదియేయని వీరెరుగకపోలేదు అందుచే: నా రణ నీతిని సులభముగా నిరుపయోగ మొనర్తురు.

సార్వభౌముడు :

(ఆశ్చర్యము నభినయించి) ఆదెటులసేతురు ?

తిమ్మరుసుమంత్రి :

దానినే చెప్పబోవుచుంటిని. ఇదంతయు ఘోరారణ్యప్రదేశము దీనినెల్ల మన బలములతోగూడి చల్లగాదాటి యొక దుర్గమును ముట్టడింతుమనుకొనుము దుర్గములోనివారు మన కొలదిసేనతో యుద్ధమొనర్చుచునే రహస్యమార్గములగుండ వారి సంపదను - సేనను - దాటించి వారి ప్రభువులతో గలసి కుటుంబసమేతముగా నేగి సమీప భీకరారణ్య మధ్యమున దమ రక్షణకొఱకు నిర్మించుకొనియున్న నభేద్యములగు మండల దుర్గములలో జేరిపోవుదురు. వాటి యానుపానులెల్లను, వారికిదక్క మఱెవ్వరెరుగజాలరు. మన సైన్యము లా దుర్గముపై ముట్టడిచేసిచేసి, విసిగి, నిర్నిద్ర పరాక్రమముతో లగ్గల శెగ ప్రాకి లోనికేగి ద్వారముల దెరచి సేననెల్ల లోనికి జేర్చుకొనువేళకు, ఆ మనతో పోరుచున్న కొలది సైన్యముగూడ రహస్యమార్గములంబడి పలాయితమగును. ఇంతపనిజేసి జయించిన మనకు కడకు లభించునదేది? ఏమియులేని శూన్యదుర్గము మాత్రమే వానిని స్వాధీనపరచుకొని, యందు మన సైన్యమును కొంత నిల్పి, వారికి భోజనాది పదార్థముల సమకూర్చి ముందునకు సాగుదుము. అటుల నాలుగైదో దుర్గముల స్వాధీన మొనర్చుకొనుసరికి మన సేనయు తరిగిపోవుచుండును. వస్తుసరఫరాలుగూడ తరిగిపోవుచుండును. పోవుకొలదిని శత్రుదేశము మన రాజ్యమాతకు దూరము. సరఫరాలందుట యెంతయో కష్టమగు

చుండును. మనము మన దేశమునుండి మరికొంత సైన్యమును బిలిపించు కొనవలసియుండును. ఆహారాదికము మరింత కావలసియుండును. శత్రు రాజ్యప్రజలు మన కేవస్తువులును లభింపనీయరు. ఒకవేళ లభించిన నవి విషలిప్తములైయుండును. తృణజలాదికమెల్ల విషమయమై గుఱ్ఱములు, యేనుగులు, సైన్యము బహుళముగ మరణింపసాగును మనముపోయి పోయి రాజధాని సమీపింపబోవుసరికి మండల దుర్గములలోని సామంతులు వారి సైన్యములతో వెడలి మనము జయించివచ్చిన వారి దుర్గములనెల్ల రహస్యమార్గములగుండ జొచ్చి యే యర్ధరాత్రముననో అందుంచివచ్చిన మన సేనలనెల్ల నాశనమొనర్చి మరల దుర్గముల స్వాధీనమొనర్చుకొని యందలి యాహారాదికమును, మారణాయుధములతో గూడ వశమొనరించుకొనుటయేగాక మనకు వచ్చుచుండు వస్తునగధరాల నడ్డగించి కొల్లగొట్టసాగుదురు. మన సైన్యములు రాజధానిని ముట్టడించువేళకు ఆ సామంతుల సైన్యములెల్ల మన సైన్యముల ముట్టడించి, మనచుట్టును చక్రబంధనము గావించును. లోనుండి ప్రభుసైన్యములతో సమరము పైనుండి సామంత రాజ సైన్యములతో సంగరము. తిండిలేదు. క్షుత్పిపాసలతో సంతర్యుద్ధము ఆయుధములు తరిగిపోవును. ఆ ద్విముఖరణమునం దడక త్తెరలోని పోక గతి బట్టును. వత్సా! ఆలోచింపుచుంటివా? మనసునకు వచ్చుచున్నదా?

సార్వభౌములు :

(ఉద్విగ్నులై) అప్పాజీ! అటులైన కటక రాజును జయించుట మనకు సాధ్యము కాదందురు.

తిమ్మరుసుమంత్రి :

నేనటులనుటలేదు. కేవల బాహుబలమును నమ్ముకొని దండోపాయము మాత్ర మవలంబించువారిగతి యిటులగునని చెప్పుచున్నాను.

సార్వభౌముడు :

(ఆలోచింపుచు) సరి యీ విషయమై మీరనున దేమియో సెల విండు.

తిమ్మరుసుమంత్రి :

అందులకేగదా! పెద్దలు నాలుగుపాయముల నిర్దేశించినారు. సామ దాన భేదములు మూడును కార్యకారులు కానప్పుడే దండోపాయమును నమ్ముకొనవలయును.

సార్వభౌముడు :

(ఉద్రిక్తుడై) అప్పా! నేటితో నాంధ్ర కర్ణాట దేశములు పర రాజుల పాలనకు జిక్కి-నజిస్కగాక (శ్రీ) హరిహరరాయ బుక్కరాయ సంపాదిత - (శ్రీ) విరూపాక్ష దేవకృపా కటాక్ష రక్షిత విద్యానగర సామ్రాజ్యము విధ్వస్తమైపోవదగిన యోగమున్నచో బోనిండు- ఆంధ్ర మహావీరుల పౌరుషాగ్ని జ్వాలలు జల్లారిపోవలసియున్నచో నటులనే గానిండు. భగవదిచ్ఛ యెటులున్న నటులగాగలదు - కాని కటక రాజును జయింపకయే వెనుదిరుగుట నా యభిమతముగాదు-

తిమ్మరుసుమంత్రి :

అటులనే వత్సా! ఏమంత యుద్రేక మందెదవు నేను మాత్రము నీ యభిమతమునకు వ్యతిరేకినా? రాగల కష్టసుఖములం గూర్చి యాలోచించుకొను చున్నారము. నేను ముందే చెప్పియుంటినిగదా! నా నీతికి సాధ్యము గాకపోయినపుడు మాత్రమే నీ చేతికి బని తగులగలదని, నామాట కెదురుచూచుచుండుము. ఇప్పుడొక చక్కని యుపాయము స్ఫురించినది- "అహం హితత్కరిష్యామి - పరంపురుష కారతః - దైవం హీనమయాశక్యం"

సార్వభౌముడు :

(అంజలిబద్ధుడై) నా యెరిగినింతవరకు తమ ప్రయోగ కౌశలము వ్యర్థమగుట - జరుగని కార్యము. అప్పాజీ!!

"నాదు సంశయ ముడుపుకొనందలంచి
తమ్ము నింతటి లోతుగా దరచినాడ
చణకపుత్రు యుగంధరోశనుల మించు
ధీమహిమ మీద ననుమాన దృష్టిగాదు"

తిమ్మరుసుమంత్రి :

(స్థిమితతనంది) వత్సా! వృద్ధులగు మేము చిరకాలము జీవించి యుండ జాలము గదా! కావున సకల కళావిశారదుడవు - మహావీర శిరోమణివగు నీవు - రాజనీతియందు గూడ పరిపూర్ణతనొంది - సంధి విగ్రహాదుల మర్మముల మథించి - బుద్ధిబలముచే శత్రునాశ మొనర్చి - దుష్టశిక్షణయు శిష్టరక్షణయు, ధర్మసంస్థాపనయు నొనర్చుటకు కంకణము ధరించి దేశమాతృ దుఃఖవిమోచన మొనర్చుచు నూరేండ్లు వర్ధిల్లుము.

సార్వభౌముడు

(వినీతుడై) మీ యానతి శిరమున దాల్చువాడను.

తిమ్మరుసుమంత్రి :

తక్షణ మిచటనుండి స్కంధావారము నెత్తివేసి, సామంత దుర్గముల జోలికేగక మనసైన్యములెల్లను, కటకపురిపైకి నడువ నాజ్ఞాపింపుము - ముహూర్తకాలములో నీ యాజ్ఞ పంచక్రోచ పరిమితముగా కుటీరములు వైచికొనియున్న సైన్యములకెల్ల నంది - బయలుదేరవలయును - (తెరపడును)

ఇది షష్ఠాంకము.

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## శుద్ధవిష్కంభము

(కటకపురముకడకు సమీపమునందు - వేయబడియున్న శ్రీకృష్ణదేవరాయుని స్కంధావారమునకు కొంచెము దూరముగానున్న యొకచెట్టుక్రింద గూర్చుండి రహస్యముగ మాటలాడుకొనుచూ సార్వభౌముని సేనానాయకుడొకడును - చారనాయకు డొకడును ప్రవేశింతురు.)

సేనానాయకుడు :

ఓఢ్రులతో మనకు భయంకరమగు సమరము జరుగగలదని మేమాస పడుచుంటిమి. కాని యీ జగపతి యేమియు సందడి చప్పిడి లేకుండ లొంగి రాజీకివచ్చినాడేల?

చారనాయకుడు :

(రహస్యముగ) గోడలకు చెవులుండు నందురు. ఇచ్చట గోడలు లేకున్నను చెట్లున్నవిగదా! చెట్లకు గూడ చెవులుండునేమో? అది యంతయు నెట్లున్నను మహామాత్యులవారి బుద్ధి ప్రభావమును నుతింపక తప్పదు-

సేనానాయకుడు :

(రహస్యముగ) అదెట్లు జరిగినది?

చారనాయకుడు :

(రహస్యముగ) అది దేవరహస్యము. మనమా మాటల నాడు కొనుట ప్రమాద కారణము.

సేనానాయకుడు :

(జనాంతికముగ) ఆ రహస్యము విన గుతూహలమగుచున్నది - దయతో నెరిగింపజాలవా ?

చారనాయకుడు :

మన మాప్తమిత్రుల మనుమాట నిజమేకాని, శ్రీవారి సొమ్మ్ము దిని బ్రతుకుచుంటిమి - ఇది రాజరహస్యము - ఇది వెల్లడించుటనాకు న్యాయమే యగునా ?

సేనానాయకుడు :

(చారనాయకుని రెండుచేతులంబట్టుకొని) ఏ రహస్యమైనను-ప్రయోగ కాలమున గూఢముగ నుండదగినదే, కాని, ప్రయోగించుటయు-శత్రు రాజు లొంగివచ్చుటయు నైనది. వియ్యమొందుట కాయత్తమగు చున్నాడు.

చారనాయకుడు ;

అట్టి యెడనే మరింత గోప్యముగనుండుట యావశ్యకము. ఇది పరుల ప్రయోగ కౌశలమనియుచు - తాము మోసపోయి మూఢు లమైతిమనియును శత్రువునకు దెలిసినచో నెంతటి విపరీతఫలము గలుగునో తెలిసికొనుము !

సేనానాయకుడు :

మిత్రమా ! సావధానుడనయితిని - ఇది మహామాత్య శేఖరు లగు నప్పాజీ వారి ప్రయోగ కౌశలమని యెరిగియుండియు, నాకు

జెప్పుమని నిన్ను బాధించుట నా తెలివి లేమియే యగును. పోనిమ్ము చల్లగా మరికొన్నాళ్ళ కడియే తెలియునులే.

చారనాయకుడు :

ఆ మాత్రము నిదానము నీకుండినచో నన్నింత నిర్బంధింప జాలవు సుమా !

సేనానాయకుడు :

(చారనాయకుని యంగీ జేబులోనున్న యొక పత్రికను లాగుకొనును)

చారనాయకుడు :

(కొంతసేపు పెనగులాడి సేనానాయకునికి జిక్కకుండ జేయుటకు సాధ్యము గాక నిరాశ జెందును.)

సేనానాయకుడు :

(పత్రికను దీసికొని మడతవిప్పి యిట్ుల జదువును.)

"శ్రీమతు కర్ణాట సింహాసనాధ్యక్షు
డగు కృష్ణరాయ ధరాధినాథు
డల పదారుగురు పాత్రులకు సంప్రీతి బం
పిన సులేఖంబులు - మిమ్ము మునుపు
గజపతిరాష్ట్ర దుర్గవిశేషములనుండి
మెలుపుగా బలికిన పలుకుబడుల
తీరు వ్రాసితిరి, మీకోరినట్లనె ఘనా
భరణదుకూల ముల్పంపినార.

మట్లనే రేపు జగడాని కరుగుదెంచి
నట్ల జనుదెంచి మాచేతి కతని మీరు
పట్టియిచ్చిన యపుడ, మీపట్ల మేము
కొదువపడకుండ నడిపించుకొనెద మెపుడు"

(అని చదివి దీర్ఘముగా నాలోచింపుచుండును.)

చారనాయకుడు :

మిత్రమా! చదివితివిగదా! ఇక నిచ్చివేయు మా పత్రికను-

సేనానాయకుడు.

(తలద్రిప్పుచు) ఉహూ - ఈ పత్రిక నీకడనేల యున్నదో తెలియ చేసినచో-

చారనాయకుడు :

నేను నీకది తెలియజేసినచో - రాజరహస్యమెల్ల వెల్లడిజేసి నట్లే యగును ఇక నేను దాచినదేముండును ?

సేనానాయకుడు

(బతిమాలుచు) సఖా! మనమూబల్యమిత్రులముగదా! నా యొద్దను నీవారహస్యమునుదాచుట భగవంతునకిష్టములేకయే నాకీ పత్రికను దొరకినట్లొనర్చినాడు.

చారనాయకుడు.

(నవ్వి) అటులేయనుకొమ్ము. నేను పదునారు పత్రికలే తయారు చేయవలసియుండ మరొకపత్రికగూడ పొరపాటున వ్రాసి దానిని నా యంగీజేబునందుంచినాను. అదినీకంటపడుట సంభవించినది.

సేనానాయకుడు.

(బ్రతిమాలుచు) మిత్రమా! నాకుమాత్రము తెలియదా? రాజ రహస్యగోపనమును గూర్చి - నీవే ప్రమాణముగోరిన దానినొన ర్చెదను. నాకావిషయమును విశదపరుపుము.

చారనాయకుడు :

భద్రము :- ఏమాత్రమిదివెల్లడియైనను మన యిర్వురి ప్రాణ ములమీదికి వచ్చుననుమాట మదినుంచుకొనుము. ఇట్టివే పదునారు

వ్రాసి — పదునారు పేటికలలో నమూల్య వస్త్రాభరణాదికముంచి, పేటిక కొక్క పత్రిక చొప్పున పైనుంచి సీళ్లువేసి చారులకే రాజభటుల వేషములు వైచి పదునార్గురు సామంతుల దర్శనమున కేగువారల నటింపుచు కటకేశ్వరుని భటులకు దొరికిపోవునట్లొనర్చినారు. వారు మనభటులం దోడ్కొని తమ ప్రభువున కప్పగించినారు. కటకేశ్వరుడు ఆ పేటికల నెల్ల బగులగొట్టించి అందలి యమూల్యోపాయనములను పత్రికలను గాంచి వాటిం జదువు తోడనే — తనసామంతులెల్ల దన్నుబట్టి యొసంగ రాయలతో రాజీపడియున్నారని నమ్మి గుండెలలో నగ్ని పర్వతములు బ్రద్దలుకాగా — కంచెయె చేనుమేయదొడగినపుడిక నుపేక్షించుట ప్రమాదమని భీతిజెంది 'నాపుత్రికనొసగి వివాహమొనర్తుము. కాన నిక యుద్ధముతో బనిలేదని మన సార్వభౌములకడకు రాయబారమంపినాడు. తెలిసినదా ?

సేనానాయకుడు :

(విభ్రాంతుడై) తెలిసినది మిత్రమా! ఔరా! మహామాత్య శేఖరుల శేముషీ విశేషము ?

చారనాయకుడు

(అతనికడనుండి పత్రికంగొని దాచి) కడుంగడు జాగరూకతతో మెలగుము మిత్రమా! మనమందరము తెలివిగలవారమనియే దలంతుము గాని మనకంటె గోటిరెట్లు మించిన ధీమంతుల విషయమై యెటుల మెలగదగునో తెలిసి కేవలము జాగ్రత నుపాసింపక తప్పదు.

ఇది శుద్ధవిష్కంభము.

(నిష్క్రమింతురు)

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## సప్తమాంకము

### రంగము ౧

(కటకేశ్వరుని యంతఃపురములో మహారాణి పద్మావతీదేవి సౌధమునందు చంద్రకాంత శిలానిర్మితాలంకారశాల. పార్వతియు భానుమతియు తుష్టాదేవి నలంకరింపుచుందురు. మహారాణి పద్మావతీదేవి, స్వర్ణపేటికలోనుండి, యమూల్య రత్నాభరణములను దీసి వారికిజూపుచు నచ్చినవాటి నొసగుచు, నచ్చనివాటిని మరల పేటికలలో జేర్చుచుండును. దూరముగ వృద్ధప్రతీహారిణి యొకతె నిలువబడి లోనికెవ్వరిని రానీయక కావలి గాయుచుండును)

పద్మావతీదేవి :

(విచారముతో) పూజ్యులగు మీతండ్రిగారి యాజ్ఞల నెప్పుడు దలదాల్చెడిదానవే - యిప్పుడీరీతిగా విముఖత జూపించుచుంటివేల తల్లీ ?

తుష్టాదేవి

(మౌనముతో నేమియు మాటాడ కూరకుండును)

పద్మావతీదేవి :

సకలకళావిశారదవు - సుక్షత్రియ ప్రసిద్ధవంశసంజాతవు - నీవే మన వంశగౌరవ రక్షణమునకు కంకణము దాల్చుకున్నచో -

తుఖ్బా దేవి.

ఎవరు కోరి తెచ్చుకొనిన వ్యథాభరమును వారే యనుభవింప వలయునుగాని, వేరెవ్వరు పోగొట్టగలరమ్మా?

పద్మావతీ దేవి.

దీని నెవరు కోరి తెచ్చుకొనిరితల్లీ? పవిత్ర గాంగవంశసంజాతవు నీవొక దాసీపుత్రున కిల్లాలువు గావలసివచ్చెననిగదా!

తుఖ్బా దేవి

(చివాలునతిరిగి తల్లివైపుగాంచి కోపముతో) ఆ తప్పెవరిదమ్మా? ఇందులో మేమొనర్చిన యధర్మమేమున్నది - మహావీరులకు దిగ్విజయయాత్ర యొనర్చుట దోషముగాదుగదా! వారిని శక్తియున్నచో జయింపదగును లేనిచో లొంగిపోవలయును - ఇదియును - లోకమర్యాదయే - మనకు యుద్ధము వలదు. మా బిడ్డనిచ్చి వివాహమొనర్తుము. సంధి చేసుకొందమున నొప్పుకొనుట మాత్రము దోషమెట్లగును, ఇందు వాని దోషములేదు. ఇక నావిషయమా తలిదండ్రులు తమ బిడ్డ కెవ్వరిని భర్తగా నిర్ణయించిరో వారిని వివాహమాడి సేవించుట ధర్మమే గాని దోషముగాదే? అట్టి భర్తను కపటోపాయముల జంపి విధవవుగమ్మని బోధించుట దైవ స్వరూపులగు తలిదండ్రులు చేయదగిన దేనా?

పద్మావతీ దేవి

కాకేమి ప్రాణవిత్త మాన భంగాదులగు నాపద్ధర్మములలో జేర్చి విధిలేక మీ తండ్రిగారు నిన్నొక కత్తికొసగి పెండ్లిచేయగనే నీకాతడు భర్తయైనాడా?

తుఖ్బా దేవి.

అపద్ధర్మములన నిట్టివేనటమ్మా! వాచా మనోదత్తాదులగు సప్తవిధ కన్య కలుగును. నగ్నివలె కులమును దహింతురని ధర్మశాస్త్రములు ఘోషింపుచుండగా కత్తికొసగి పెండ్లి జేసినను ఖేటకమునకొసగి పెండ్లిచేసినను వానిపేరుతో నేగద పెండ్లి జరిగినది. ప్రతి గృహీత యాతడేగద. కన్యాదాన సంకల్పములో మా యుభయుల గోత్ర నామములు, మా యుభయుల పితృ పితామహ నామములు జెప్పుట జరుగ లేదా ?

పద్మావతీ దేవి.

అదేమోనమ్మా నాకేమి తెలియును. ధర్మాధర్మ నిర్ణయమొనర్చుభారము మన యిర్వురిమీదను లేదుగదా! ఇది మీ తండ్రి గారి యాజ్ఞ, గావున చేయుమని చెప్పితిని.

తుఖ్బా దేవి.

(మొగము చిట్లించుకొని) వారిట్టి నీచములు, నింద్యములగు, నాజ్ఞల నొసగువారుకాదు. వారున్నతవంశ క్షత్రియవీరులు - శత్రువుతో పోరాటమున వారు విజయమో వీరస్వర్గమో - జెంద నభిలసించు వారేగాని, ఇట్టి షడ్యంత్రకార పద్ధతుల నామోదింపరని నే ననుకొనుచున్నాను.

పద్మావతీ దేవి.

ఏమిజేతుమమ్మా! పరిస్థితులటులవిషమించుటచే — పరమ విశ్వాసమిత్రులని నమ్ముకొనిన పాత్రసామంతులెల్లరు మన పగవానితో చేతులుగలుపుటచే — ఇటుల జేయవలసి వచ్చినది - (తుఖ్బా దేవి రెండుచేతులబట్టుకొని) మాతల్లివిగదూ - తప్పక నీవీకార్యమాచరించి మనవంశ గౌరవము గాపాడక తప్పదు.

తుష్టా దేవి :

(వినువుతో) శత్రువుతో పోరుసలుపజాలకలొంగిపోయి వానికి గూతునిత్తుమని సంధియొనర్చుకొని, పెండిలియొనర్చి, యా కూతు న త్తవారింటికంపి, అల్లుడు నిద్రింపుచవు డసిగొని కత్తుకను త్తరింపు మనియో ? పానీయాదులలో పాషాణము గల్పుమనియో జెప్పి, యావిధమాగా జేయించుటలో వంశగౌరవ రక్షణమున్నదటమ్మా ?

పద్మావతీ దేవి :

నీ వెటులైనను బ్రాణత్యాగమునకు సిద్ధపడియే యుంటివిగావున నీకార్యము నీకసాధ్యముగాదుగదా !

తుష్టా దేవి :

(హేళనగా) నిజము నిజము. నేను బ్రేమించియున్న నా ప్రాణ దాతను మీరు వెతికించి తెచ్చినాపతిగా నొనర్పకుండుటచే నేను విరక్తనై ప్రాణత్యాగ మొనర్పసిద్ధపడితినిగాని మీరెవ్వరికోయోడి నన్నొసగి పెండ్లిచేసి య త్తవారింటికంపుచు - నటకేగి నీవెటులను జావనెంచినదాన వేగాన యెటులైన వానింజంపి నీవు జచ్చిపొమ్మనుట యెంతయనుగ్రహము ? వానియింటిలో వానింజంపి, వానిపరిచారకుల చేతిలో కుక్కకన్నహీనముగా ననుజావుమని చెప్పుటకు నీకు నోరెట్లు వచ్చినదమ్మా ?

పద్మావతీ దేవి :

(అయిష్టముతో) మరినీవు జేయదలచిన దేమిటి ?

తుష్టా దేవి :

మనము పౌరుషముగలవారమైనవానితో రణమొనర్చి గెలువ వలయును, లేదేనినాశనముగావలయును. గానిచో ధనకనకవస్తు వాహ

నముల నొసగి సంధిచేసుకొనవలయును - అంతేగాని కొమరితనిత్తు మని పెండ్లిజేసి యల్లుని జేసుకొని జాటుగా జంపించుట క్షత్రియ ధర్మముగాదమ్మా -

"పద్మినింగొనిపోవ, వాంఛించిన తురుష్క
సార్వభౌము నెదిర్చి సంగరమున
భీమసింహాదులౌ వీరులు రసపుత్రు
లస్రమ్ము ప్రవహించునంతవరకు
హరులనన్నొరాడి మరణింప - కాంతలు
జోహారొనర్చి, వివాహమునకు
బోవు పేరంటాండ్ర పోలుపున వహ్నిలో
బడి ప్రాణములు గడ్డిపరకలనగ"

గీ॥ వదలిపెట్టరె ?- క్షత్రియ పౌరుషం బ
నంగ నటులుండవలెగాని - యంగనలను
నడుమ నడ్డముబెట్టి, ప్రాణములు దోచు
కొనుట రాచకులానికి గూడునటవె ?"

మీరుజెప్పెడి యీ నీచవుబనిమాత్రము నేనొనరింపలేనమ్మా.

పద్మావతీదేవి ;

[దుఃఖించుచు పద్ధతిమార్చి] అయ్యయ్యో ! కుమారీ ! కడకు దుర్విధి నీకెట్టివ్రాతనువ్రాసెనమ్మా ! తల్లీ !

ప్రాణములు మీదు గట్టి నిన్నుడసినాము
ప్రేమ నల్లారుముద్దుగా బెంచినాము
సకల విద్యల జెప్పింప జాలినాము
కడకు మృత్యు గృహంబున, కడగిపోవ
నంపకాల్చేయుచున్నార మమ్మ, యిపుడు.

తెలిసి తెలసి మృత్యుదేవతయొడిలోకి
బంపినటుల ముద్దుపట్టి నకట!
బంపుచుంటి మిపుడు భర్తృగేహమ్మున
రేణము న్వ్రకాని కిచ్చినటుల.

నిన్నిటులంపకాలొనర్చి యిక నేనీ భూమిమీద నెటుల జీవింపగలనేతల్లీ!

తుష్టాదేవి :

(అసహ్యముతో) కోరికావలయునను కొని, చేసినపనికింతటి దుఃఖ మందనేలనమ్మా? చావును దప్పించుకొనువారెవ్వరున్నారు? మన ధర్మశాస్త్రములెల్ల మరణము జీర్ణవస్త్రవిసర్జనముకంటె నితరము గాదని ఘోషింపుచున్నది. అందును సుక్షత్రియ వంశజనితలము.

వీరాధి వీరపత్నులు-
వీరుల మాతలును - స్వయము వీరాంగనలున్
భారతభూమి జనించిన
వారలు మరణింప దుఃఖపడుదురె? తల్లీ!!

భగభగమండెడు వహ్నికాహుతియయి
గడియలో ప్రాణముల్విడుచు వారు
బారెడుత్రాటితో బంధంబు గళమున
దవిలించుకొని మృతిగవయువారు
నాసికారంధ్రము ల్మూసి జలమ్ముల
దూకి జీవంబుల దొరఁగువారు
ఉపవాసములొనర్చియుం గ్రమ క్రమముగా
జీర్ణించి మరణముం జెందువారు

విసము మెసగియు ద్రుటిలోన గసిమసంగు
వారునై - సాహసము గలవారలెల్ల
గోరికలుదీరకయె - మరేకారణంబొ
జిటుకలో జచ్చుచుండంగ జింతయేల?

ఇక నీవగల జాలించి నాకించుకతడవు ప్రశాంతతనిమ్ముతల్లీ!

పద్మావతీదేవి :

విదుషివిగావున నీవు మరణమననింతసులభముగా బలుక గలిగితివిగాని యిట్టిస్థితిలో నాకూరటయెట్లుగలుగగలదని తలంచితివమ్మా ?

అల్లారుముద్దుగా నలరు విధమ్ముగా
 వింశతి వర్షముల్పెంచినాము
కోరిన గురువుల జేరిచి కళల స
 ద్విద్యల నేర్వనంపించినాము
దేశ దేశముల సాధించి రత్నమ్ముల
 గొని, కోరునగలెల్ల గూర్చినాము
ఉభయవంశమ్ముల కొప్పారు రత్నదీ
 పిక వగుదంచు గర్వించినాము.

''కాని - కడకిట్లు నిను దాసికా సుతునకు
గట్టిపెట్టియు - వానిని మట్టుబెట్టి
నీదు కాపురమునకీవె నిప్పుబెట్టు
కొను మనుచు బంపవలసె .- నా గుండెలవిసె''

మహానుభావా ! ఈ కష్టములనుండి మమ్ము రక్షింపుము జగన్నాథదేవా !!

పార్వతి :

( పద్మావతిదేవితో జనాంతికముగా) మహారాణీ ! భర్తృదారికకు సమయమెరిగి బోధించి సాధ్యమైనంతమట్టుకు మీ మనోభీష్టము నెరవేరునటుల మేమిరువురమును బ్రయత్నింతుము ఇక తమరు విచారింపకుడు - ఊరడిల్లుడు.

భానుమతి :

ఆ భారమును మాపైనుంచుడు మహారాణీ ! యథాశక్తి నా. కార్యమును సాధింపబ్రయత్నింతుము.

పద్మావతీ దేవి :

(వారితో జనాంతికముగా ) ప్రభునాజ్ఞకీమె వ్యతిరేకిణియైయున్నది. మీారు నాబిడ్డను కడుపులో బెట్టుకొని కాపాడుడు - వంశగౌరవ రక్షణము - శత్రునాశన సదుపాయము ఈ రెండుకార్యములు సాధ్యమైనంత నిరపాయముగా నొనర్పజేయు భారము మీాపై నుంచుచున్నాను. భద్రము - జాగరూకులై యుండుడు. ఇకపోయిరండు.

ప్రతాపరుద్రగజపతి :

(ప్రవేశించి) ఏమిది ? ఇంకనుజాగుచేయుచున్నారా ? ముహూర్తకాలమాసన్నమైనదని వారు తొందరపడుచున్నారు. ఊ- త్వరపడుడు - త్వరపడుడు - (మహారాణింగాంచి జనాంతికముగా) దేవీ అన్నియు సిద్ధపరంచితివా ?

పద్మావతీ దేవి ;

(కన్నీరువిడుచుచు జనాంతికముగా, తమయాజ్ఞాప్రకార మన్నియు సిద్ధముచేయబడినవి - పార్వతీభానుమతులుగూడ తమ ప్రాణప్రదముగా నీకార్యము నెరవేర్తుమనినారు.

ప్రతాపరుద్రగజపతి :

(తుక్ష్మాదేవితో గంభీరముగ) (ఆయుష్మతీ !!

''వసుధ గజపతి వంశంబు వన్నెకెక్క
క్షత్రియ కులమ్ములందు - మా పుత్రివీవు
బుద్ధిమతివి, విదుషివి, విశుద్ధ చరిత ! !
మచ్చరాకుండ జూడుమమ్మా ! కుమారి ! ! "

తుక్ష్మా దేవి :

(తండ్రికి నమస్కరించి - కన్నీటితో తలవంచికొనును)

ప్రతాపరుద్రగజపతి :

(గంభీరముగా) తండ్రియశక్తుడైనచోట, బిడ్డలు సమర్థతతో వ్యవహరించి కార్యసాధనమొనర్చుట గలదు.

తుఖ్ఖాదేవి :

(మరలనమస్కరించి కన్నీటితో) తండ్రీ ! నన్నాశీర్వదింపుము. ఇదియే మనకు తుదిసందర్శనముగదా !

ప్రతాపరుద్రగజపతి :

(శిరముపైదక్షిణహస్తముంచి) మహావీరాత్మజవు. విదుషివి. ఆచంద్రార్కము ధ్రువతారవలె ప్రకాశింపుచు, లోకమునకాదర్శప్రాయవు గమ్ము.

తుఖ్ఖాదేవి :

(తల్లిని పొదివి కౌగిలించుకొని) మాతా ! నీఋణము దీర్చుకొనన శక్తురాలను ఈజన్మమునకిదే తుదిసందర్శనము. (వంగిపాదములు కన్నుల కద్దికొనుచు) నీబిడ్డ నీకొసగజాలిన వివే శతసహస్ర ప్రణామములు. (కన్నీరువిడచును)

పద్మావతీదేవి :

(బిగ్గరగా నేడ్చుచు) ఇపుడు నేను నిన్నేమని యాశీర్వదింతునే, నాముద్దుబిడ్డా !!

పుడమి సమస్తమేలు నరపుంగవు దేవివి గమ్మటందునా ?
కడుపెడు బిడ్డలంగని సుఖమ్ముగ గాపురమీదు మందునా ?
కడుపతిగొల్చి సాధ్విగ నఖండయశమ్ము గడింపుమందునా ?
మడియుగబంపు-పుత్రికకు మాతగ నేమనియిత్తు దీవనల్ ?

దినమునకు ముమ్మారు బలులొసగినీవు తృప్తిపరుచుచున్న మన గృహ దేవతలే నిన్నురక్షింపుదురుగాత - ఓ గృహ దేవతలారా !

''సర్వ విద్యావిశారద, సద్గుణ ఖని,
పరమ సౌందర్యరాశి, త్వద్భక్తి నిరత,
మా సుపుత్రిక జనుయమ మందిరమున
కంపకాలయి - మీర రక్షింపవలయు"

(ఏడ్చిఏడ్చి దుఃఖాతిరేకమున మూర్ఛిల్లిపడిపోవును)

పార్వతి - భానుమతి

(పడకుండబట్టుకొని - తల్పముపైబరుండబెట్టి శీతలోదకముదెచ్చి యామె మోమునుంజల్లి విసరుదురు.

ప్రతాపరుద్రగజపతి :

(గద్గదకంఠంతో - తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యముతో) బిడ్డా !

"విధి యొకొక్కప్పుడ, యీ
పథమున నడిపించుచుండు, బ్రారబ్ధమునన్
మధురాను భూతులన్నతి -
పథమ్మను సరించునీకు బ్రళయముగలిగెన్"

రాచపుట్టువులిట్టిపట్టున నేగట్టిగాచెట్టలనెదుర్కొన గలుగుదురు వ్యక్తులప్రాణములకంటెను, వంశగౌరవమే యేబదివేల రెట్లెక్కువ యని పెద్దలందురు. విదుషీమణివగు నీకింతకంటె జెప్పునదేమున్నది.

పద్మావతీదేవి :

(కనులువిప్పిలేచి కూరుచుండును)

[తెరలో]

ప్రభూ ! ముహూర్తకాలము దాటుచున్నది. ఆలసింపకుడు.

ప్రతాపరుద్రగజపతి :

(ఆలకించితొందరగా) చిరంజీవిని త్వరగా దోడ్కొనిరండు (తెరవైపు గాంచుచు) యెవడురా అక్కడ? ఆయుష్మతి బయలుదేరుచున్నది. మంగళవాద్యములెల్ల మ్రోగింపుమని నాయాజ్ఞగా దెల్పుడు -

(అనుచు నిష్క్రమించును)

పద్మావతీదేవి :

[లేచివచ్చి తత్ఖాదేవిమీద చెయివేసి నడిపించుచు) రా తల్లీ ! రా - మీ తండ్రిగారు త్వరపడుచున్నారు. (కన్నీరువిడచుచు మెల్లగా నడపించుకొనుచు నిష్క్రమించును) పార్వతి - భానుమతి - కన్నీటితో వెంటనడచుచు నిష్క్రమింతురు)

[య వ నిక ది గ జా రు ను]

ఇది సప్తమాంకము.

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## అష్టమాంకము

### రంగము ౧

(కృష్ణాతీరమున శ్రీకాకుళనగరసమీపమున శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముల స్కంధావారము. సమయము సాయంకాలము – శ్రీసార్వభౌములు కవిపండిత మండలితో గూడి స్కంధావారసమీపమున కృష్ణానదియొడ్డున సైకతపులినములపై గూరుచుండి సంభాషించుచుండును)

శ్రీకృష్ణరాయసార్వభౌముడు ;

చాలచిత్రముగనున్నది – వేగుజామునవచ్చిన స్వప్నమది – కిరీటాంగదహారాది దివ్యమణిభూషణ విభూషితుడును – చతుర్భుజుడును – శంఖచక్రగదాశార్ఙ్గధారియు – పీతకౌశేయాలంకృత దేహుడును – వనమాలావిరాజితుడును – లక్ష్మీవిభాసిత వక్షస్థలుడును మందహాససుందరవదనారవిందుడగు నీ యాంధ్రవిష్ణువునాకు సాక్షాత్కరించి, "వత్సా నీయందు నేప్రసన్నుడనైతిని, త్వద్విరచితమగు గోదాకల్యాణమును ఆంధ్రభాషయందంకితముగొన, నేనుత్సాహినై.యున్నవాడను – వైళంబయాకార్యమునొనర్చి నన్ను ప్రీతుని జేయుము. నీకు సర్వశ్రేయంబులౌనగూడుగాక యని యంతర్హితుడయ్యెను. వెంటనే లేచి కూరుచుంటిని. ప్రాభాతికమంగళవాద్యములు హృద్యముగ మ్రోగుచుండెను. తల్పముడిగ్గి శ్రీస్వామివారికి నమస్కరించి చూతునుగదా! తెలతెలవారుచుండెను.

తాతాచార్యులు :

(పరమానందతన్మయుఁడై) అహో ! శ్రీకృష్ణదేవరాయసార్వభౌమస్యమహాద్భాగ్యమిదమ్.

"అహో శ్రీకృష్ణరాయస్య
భగవత్ప్రీతి పాత్ర తా
గృహీతు మిచ్ఛన్ సుకృతిం
వరదో - విష్టర శ్రవాః"

పెద్దనమహాకవి :

(పరమానంద కందళితహృదయుఁడై) ప్రభువరేణ్యుల జన్మమునకింత కన్నను సాఫల్యమేమున్నది ?

వర మౌనీంద్రులు, యోగిపుంగవులు, దివ్యర్షు, ల్మహాసిద్ధు
లుద్ధుర భక్తుల్నిరత ప్రపన్నులు మహాత్ముల్ శ్రద్ధగాంక్షించియున్
దొరకన్లేదిక జన్మమేల వృథయంచు న్నిస్పృహంగాంతురా
పరమాత్ముండిడె స్వప్నదర్శనము వాహ్వాకావ్య మర్థింపుచున్.

నందితిమ్మకవి :

శ్రీ సార్వభౌములొనర్చివచ్చిన సర్వదిగ్విజయ యాత్రయెల్ల నొకయెత్తును, సమంతతసంపత్సూచకమగు, నీశార్ఙ్గధరసందర్శనభాగ్యమొకయెత్తునై యున్నది.

ఎందరు బుట్టలేదు ధరణీశులు ? దిగ్విజయమ్ము సల్పలే
రెందరు రాజ్యముల్గెలిచి యేలగలేదు ? తదీయనామముల్
గందుమె నేడు ? దివ్యమగు కబ్బము వ్రాసి ప్రపత్తిమీర, గో
విందుని కంకితంబిడ రవీందులు తారకలుండ నుండదే ?

ఇహాపరసాధకమై శాశ్వతయశోదాయకంబగు నొక్క-భగవదర్పణ బుద్ధితో రచించిన సుకృతికంటె వేరేఖ్యగలదు ?

రామకృష్ణకవి :

(పరమసంతోషముతో) లోకోత్తర సంఘటనయిది. కృతిభర్త శ్రీకాకుళాంధ్రదేవుడు - శ్రీమహావిష్ణువు - కృతికర్త కర్ణాటాంధ్ర సార్వభౌముడు - శ్రీకృష్ణదేవుడు కావ్యము గోదాదేవీ శ్రీరమాదేవీ శ్రీ రఘునాథ కళ్యాణము - ఆంధ్రభాషాభూషణము - ఇంతకంటె మహాభాగ్యమేమున్నది ?

కవితా ప్రవీణతన్భుజ
గవల్లభుడటన్న బిరుదుగాంచిన, శ్రీవా
రి వలన నంకితమందగ
కవిత్వసేవను మురారి కాంక్షించె ఖళీ॥

శ్రీకృష్ణరాయ సార్వభౌములు :

(హర్షముతో) భగవదాజ్ఞను శిరసావహించి, తదంకితముగ గ్రంథరచనమారంభింపక తప్పదు. గ్రంథనామమునుగూర్చి పెద్దలాలోచించి తెలుపగోరుచున్నాము.

తాతాచార్యులు :

భగవానుడే యాజ్ఞాపించుచున్నాడుగదా ! గోదాదేవీకల్యాణమని మరొకనామమును గోరుటెందులకు ?

పెద్దనమహాకవి :

కేవలము గోదాకల్యాణమనుటకంటె మహాభాగవత శేఖరుడగు విష్ణుచిత్తులకథయు నుండునుగాన 'విష్ణుచిత్తీయము'అని శ్రీవారి గ్రంథమునకు నామముంచవచ్చును.

రామకృష్ణకవి :

అవును - విష్ణుచిత్తభక్తాగ్రేసరుని కథయు నందుండుట చాల నవసరమైనను - మరికొన్ని యుపకథలుగూడ చేర్పదగుదురు - అది

గాక, ధరించిన మాల్యములను శ్రీస్వామివారికొసగినందున—ఆముక్త మాల్యద, యనునామము సార్వభౌములు రచింపబోవు గ్రంథరాజ మున కెంతయు దగియుండును.

శ్రీకృష్ణరాయసార్వభౌముడు :

(ఆలోచించి) పెద్దలు - ఆప్తులు నిర్ణయించిన యీనామత్రయ ముతో నాగ్రంథము వెలయుగాత -

పండితులు — కవులు

(పరమసంతసముప్పతిల్ల) అయంముహూర్తస్సుముహూర్తో అస్తు-స్వస్తిసమస్తసన్మంగళానిభవంతు.

శ్రీకృష్ణరాయ సార్వభౌముడు

పూజ్యులగు మీయెల్లరయాలోచన ననుసరించి, యీ సాయం కాలమే, శ్రీకాకుళాంధ్రమహావిష్ణుసన్నిధానమున. దేవాలయములో మీయెల్లర సమక్షమున గృత్యారంభమునొనర్ప నిశ్చయించితిని. వలయునేర్పాటులెల్ల నప్పాజీవారొనర్పగలరు. మీరెల్లరును సాయం కాలాహ్నికములు నెరవేరినంతనే దేవాలయమునకే తేరవలయును.

పండితులు — కవులు

శ్రీవారియభీష్టము మేరకు తప్పకవచ్చెదము.

శ్రీకృష్ణరాయసార్వభౌముడు

(సంతసముట్టిపడ కొంతతడవాలోచింపుచుండి) భగవతి, కృష్ణవేణీ తరంగిణీ ప్రవాహశోభను గూర్చి కవికుంజరములెల్ల దలకొకపద్యము మాత్రము హృద్యముగానభివర్ణింప విన గుతూహలమగుచున్నది.

రామకృష్ణకవి :

ఆంధ్రకవితాపితామహులారంభింపదగుదురు.

పెద్దనమహాకవి :

(కొంచెమాలోచించి) అటులేయగుగాక

చరమ గిరిన్గనించి, సరసమ్ముగ నృత్యమొనర్చు మేల్మివై
ఖరి, నుపలమ్ములం దుముకగా గని, యన్యనదీ సఖీగణం
బరమరలేక దన్గలయ, నంతయు, యింతయు. శ్రోపదేవతా
చరణములన్భజింపుచును, సాగరు గూడగ బర్వులెత్తెడిన్॥

రామకృష్ణకవి :

(మెప్పుతో) జననమాదిగా శ్వాశురగృహ ప్రవేశపర్యంతమాంధ్ర కవిపితామహులు సరసముగా సాగిపోయినారు.(ముక్కుతిమ్మనంగాంచుచు) తిమ్మకవిచంద్రమా !

నందితిమ్మనకవి.

(రామకృష్ణకవింగాంచి) ఆ-కవిశేఖరా ! సిద్ధముగానున్నాడను-

జనముల పాపపుంజములు స్నానమొనర్చిన మాత్ర బోవగా
నొనరుచు శక్తిగల్గుట, మహోజ్జ్వలమైన తరంగ హస్తముల్
చనవున బిల్చుచుంట, గని, సన్నగనవ్వు నదీమతల్లి న
ర్తనములు, గాంచు ధన్యులకు దన్మయతన్గలిగింపకుండునే ?

రామకృష్ణకవి :

ముక్కుతిమ్మనార్యముద్దుపల్కులు తన్మయతగలిగింపకుండునా! ఇకమీావంతు ధూర్జటికవిశేఖరా !

ధూర్జటికవి :

(నవ్వుచు) నేనును సిద్ధముగ నేయుంటిని, మహానుభావా !

తానై జీవనదానమిచ్చుచును - కేదారమ్ములన్ హేమ మెం
తేనిం బండెడునట్లు సల్పుటయకా దేతత్త్రిలింగావనిన్
శ్రీ నిక్షేపము సస్యసంభరిత ముస్సేయంగ నుత్సాహియై
ఈనారీమణి కృష్ణవేణి నడచు న్నింద్రాశకుం ధీరతన్॥

రామకృష్ణకవి :

శహబాష్ - శార్దూలము ధీరతతో నడచుచునేయున్నది సుమా ! మాఘూర్జటికవిపుండరీకపుకవిత - మల్లనకవిచంద్రమా !

మాదయగారిమల్లన :

ఆ—ఇదెవచింపుచున్నాడను మహాకవీ !

నక్రభీకర - యగణిత వక్రగమన
నీలగంభీర - వితత శైవాలజాల
భీకరావర్త బహుళ - సంవీత పంక
కృష్ణవేణమ్మ ! భళిర ! వర్ణింపదరమె ?

రామకృష్ణుడు ;

అవును ! మల్లకవీ ! వర్ణింపదరమగునా ? ఇక నీవు కుమారభట్టూ !

కుమారభట్టుమూర్తికవి :

అన్నిటనుపిన్ననే నేను - అయినను మీయాజ్ఞదాటజాలను.

అర్చా జన కామ్యంబుల
దీర్చుట కేతెంచు కామధేనువుగతి, స
ర్వార్చిత పయః ప్రపూర్ణత
బేర్చి - తీర్చినడచు, కృష్ణవేణి నుతింతున్॥

రామకృష్ణకవి :

విచ్చుచునే - విరి పరిమళమును వెదజల్లుచున్నది.

(తాతాచార్యులగాంచి వినయము) గురుదేవులుగూడ ననుగ్రహింప ప్రార్థితులు.

తాతాచార్యులు.

(చిరునవ్వు నవ్వి)

శ్లో॥ ప్రవాహస్రస్త కేశాంతామ్
వీచీకుటిల కుంతలామ్
ఆంధ్రమాధవ సేవార్థ
మాయాతామ్ నౌమి వాహినీమ్॥

రామకృష్ణకవి :

గురువర్యుల వాక్కు సత్యమును ప్రవాకుచ్చుచున్నది.

ధూర్జటికవి.

రామకృష్ణకవీ! మాయందరిచే బద్యముల జెప్పించి మీరూర కుండుట మర్యాద గాదుగదా! మరి మీ పద్యమేది?

రామకృష్ణకవి :

అందరును దలకొకటిచొప్పున జెప్పుమనిగదా (శ్రీ) సార్వభౌమ కవీంద్రుని యానతి — ఇదిగో జెప్పుచున్నాడను.

ఊహాతీత మహత్తు - దేవతలతో నొప్పారు తీరమ్ము లు
త్సాహౌన్నత్యము జూపువేగము - మహోదారమ్ము గర్భమ్ము స
మ్మోహంబుం బొనరించునాట్యము - మనమ్ముల్దోచు సంగీతకం
బాహా కృష్ణనుబోలు వాహిని జగమ్మందేది ? వర్ణింపగన్॥

ధూర్జటికవి.

ఆహా! కృష్ణనుబోలు వాహినియులేదు. రామకృష్ణకవివరుని వాణిని బోలువాణియు జగమ్మున లేదు.

రామకృష్ణకవి :

అంతతొందరయేల ధూర్జటికవీంద్రా? సార్వభౌమ కవిచంద్రుని వాణిగూడ వినిన తరువాతగదా ! అభిప్రాయ ప్రదానాధికారము.

ధూర్జటికవి.

నేటినుండి శాశ్వతముగా కవుల పట్టికలో కెక్కిన శ్రీవారు మాత్రము, తమపద్యమును జెప్పకుండనుందురా ?

సార్వభౌముడు

(నవ్వుచు మాకుగూడ వంతువచ్చినదా ? అయిన వినుడు.

చిరవియోగార్తి దాజిక్కి సగంబయ్యు
మేను సౌందర్యంబు నీనుచుండ
వలిపెంపు కౌశేయ వసన నీలద్యుతు
ల్దమ జరీపూల యందమ్ముజూప
రమ్యమారుత కిశోరముల తాకిడిరేగు
చీరకుచ్చెళ్ళు వీచికలు దనర
వరుసగా నిష్టదైవముల జేరియు మ్రొక్కి
వచ్చు వైఖరి మనోవ్యథను దెలుప
దక్షిణుండైన పతిదైవతము - మహోద
ధీశు - సాగరునింజేర నేగుచున్న
రాణి భాసిల్లు నీ కృష్ణవేణి, తమము
చల్లచల్లగ గ్రమ్ముతే సంజవేళ.

పండితులు కవు ..

(అందరును మహానందముతో దలలూపుదురు, 'వహవా ! భళీ ! శహబాస్ ! - ఇత్యాది బలుకుదురు.)

రామకృష్ణకవి :

కావుననే శ్రీయశఃపతిగూడ - శ్రీవారి కావ్యపుత్రికకు పతిగా నపేక్షించినాడు.

( తెరలో )

(వందులు - మాగధులు - వైతాళికులు - వరుసలుదీరి నిలిచి)

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ !

"ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంభితకావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాధన రసికా !"

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ !

''శ్రీ మహితగేహ ! యుత్కల
భూమీధవ గర్వహరణ భుజసార ! సుధా
ధామకుల జలధి కౌస్తుభ !
రామా పాంచాల ! కృష్ణరాయ నృపాలా॥''

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ !

విదళిత కాళింగ ! మదా
స్పదసింధుర కుంభరత్న శర్కరిలారా
దుదయగిరి కొండవీటి
పదవీస్థల మండలీక భాస్కర బిరుదా !!.

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ !

"చండతర మూరురాయర
గండమహాబిరుద ! ధాటికారయ విచల
త్కొండపలి కొండవీటీ
మండల కటకేశ సింధుమంథర కుధరా !"

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ.

సార్వభౌములు :

(విని తొందరపాటుతో) అహా సంధ్యాకాల మాసన్నమైనది. ఇక లేచిపోయిన యుత్తముగాక - మీరందరును మీమీ యాహ్నికముల దీర్చుకొని వేగముగ విచ్చేయగలరని యాశింపుచున్నారము.

(అందరును)

(లేచి) శ్రీవారి యభీష్టమును శిరసావహించెదము.

రామకృష్ణకవి :

(నవ్వుచు) ప్రభువువారి కృత్యాద్యవస్థ దిలకింప జాగుచే యుదురేమో - వేగముగ రండు.

సార్వభౌముడు

సర్వమున కాంధ్రవిష్ణువే గలడుగదా!

(అందరును నిష్క్రమింపుచున్నారు)

ఇది అష్టమాంకము.

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## నవమాంకము

### రంగము ౧

(విద్యానగరము - లోకోటలో - తల్పముపై) శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముల రాజనగరులో - చంద్రకాంతశిలానిర్మిత అంతఃపుర దివ్యభవనములో - అత్యంతసుందరముగా నలంకరింపబడిన శయ్యాగృహము)

(సార్వభౌముల శయ్యాగృహమునకు దగినయంగులెల్ల నంపుండియుండును. శ్రీకృష్ణరాయసార్వభౌములే ప్రాణములతో నున్నారని యెల్లరకుదోపజేయునదై శ్రీ సార్వభౌములతో నభేదముగా నిర్మింపబడినయొక విగ్రహము శయనించియుండును. చేతిని తలక్రిందనుంచుకొని ఉచ్ఛ్వాసనిశ్వాసములచే వక్షోభాగముబుకుచు తగ్గుచ నుండగా శిల్పచాతుర్యముచే నొకసజీవవ్యక్తి శయనించి యించుకకనుకుదీయుచున్నటుల నా పాంచాలిక నిర్మింపబడి, దానినిండుగ రక్తవర్ణముగల ద్రవము పోయబడియుండును. అందమర్చబడిన యంత్రములచే నా విగ్రహమునుండి శ్వాసముతో బాటు చిన్నగురకయు వినవచ్చుచుండెను. ఉన్నటులుండియేదొయొక చేయియో కాలో గదల్చుటగూడ జరుగుచుండెను. దూరముగా వెలుపల నెచ్చటనో మంగళవాద్యములు మ్రోగుచు కర్ణరసాయనముగా వినవచ్చుచుండెను. శయ్యాగృహమంతయు వివిధవర్ణవిరాజితములగు కాచదీపకుంభములలోనుంచబడిన దీపమాలికా శతములచే శోభింపుచు పట్టపగటివలె దోపజేయుచుండును] ఆగృహమునకంటి రహస్యముగ నిర్మింపబడినయొక గదిలో శ్రీకృష్ణదేవరాయసార్వభౌములును తిమ్మరుసు మంత్రియు నుచితాసనముల గూరుచుండి రహస్యముగ సంభాషింపుచుందురు. శయ్యాగృహములో జరుగు సర్వమును వీరికిగనుపట్టుచుండునుగాని వీరిర్వురుమాత్రమెవ్వరికిని గానుపింపరు. ఆ రహస్యగృహ నిర్మాణ చాతుర్యమట్టిది. రాత్రి ద్వితీయ యామము ముగియ వచ్చుచున్నది. సమీపమున నలికిడియే లేదు)

సార్వభౌముడు :

(రహస్యముగ) అప్పాజీ ! గజపతిహృదయమున నిగూఢముగ దాగి, ప్రతిహింసజ్వాలయున్నటుల మీరు పసిగట్టితిరా ?

తిమ్మరుసుమంత్రి ;

(రహస్యముగనే) అవును వత్సా ! ఆతడెంతజాగరూకుడై దాచి పెట్టుకొనిమనకడ నెంతమెళుకువతో మెలగుచున్నను, వానిహృదయాంతర్గతక్రోధమును నేను నేర్పుగా పసిగట్టగలిగితిని. ఏరూపముననైన నాతడచట నే దానింబయటబెట్ట ప్రయత్నించునేమో చూతమని వేయిగన్నులతో యెన్నియో వ్యూహములబన్నుకొని కాచుకొని యుంటినిగాని, యాతడచట బైటబెట్టలేదు. అటులే జరిగియున్నచో వానినెంత జేయవలయునో యంత జేసియుండెడివాడను, కాని యాతడు జాగ్రత్తపడినాడు.

సార్వభౌముడు :

(రహస్యముగనే) మనతో బంధుత్వము నెరపుకొనెనే, కేవలము వానికొమరితనిచ్చెగదా ! ఇట్టిచో నింకను ద్వేషమా ? మనలనాశన మొనర్చుకోరికయా ? సరే - అతడచట దానిని వెల్లడింపజాలక పోయెననుకొందము - ఇచట మా శయ్యాగృహములో నందులకు నిదర్శనమగుపడునందురా ?

తిమ్మరుసుమంత్రి :

(రహస్యముగనే నిబ్బరముగ) అగును వత్సా ! ఇదే ఆతనికిగల యవకాశములందెల్ల నంతిమావకాశము - మంత్రుల నీతిచాతుర్యమున కాతడు భీతిజెందిపోయినాడు, ఇక నెక్కడ బయటబడినను మట్టుబెట్టుదుమనియును-తాను నాశనమగుట దప్పవేరేమియు లాభము లేదనియును గ్రహించినాడు, కడకుదీనిమీద తనయాశను కేంద్రీకరించి

నాడు. ఇది మంత్రులనీతికి అతీతమగుస్థానము ఈ ప్రదేశమున మంత్రుల హస్తక్షేపముండజాలదని వ్రాసియున్నాను. అందుచే నాతడీయవకాశమును దప్పక యుపయోగించుకొనెనేమోయని నాయనుమానము లేదేని పోనిమ్ము మనము జాగ్రతతో నున్నందువలన నష్టమేమియును లేదుగదా !

శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడు.

(రహస్యముగనే) ఈ శయ్యాగృహమునందు దాతడు తన పుత్రికచే నేదైన ప్రతిహింసా కార్యమొనరింప నెంచెనందువా ?

తిమ్మరుసుమంత్రి :

(రహస్యముగనే) ఊహూ-నేనట్లు దలంపను. ఆయువతిమణి భద్రచరిత - అ మహారాణి ఇట్టి నీచ కార్యమున కామోదింపజాలదు. తన సేమమాసించియు నాయన యిట్టి నింద్యకృత్యము నొనర్చునది గాదు, కాని-అయనవెంట ననంఖ్య దాసదాసీజనమేతెంచియున్నది. ఏపుట్టలో నేపామున్నదో తెలిసికొనవలయునుగదా! పైగా నేటిదినమున స్త్రీ సంఘమెల్ల నిచటికి బూర్తిగా ప్రవేశింపవచ్చును. ఎందరేతెంచిన నడ్డుచెప్పుటకు వీలులేదు. వారి ప్రభుపుత్రికకు పతితోటి ప్రథమ సమాగమసమయమిది. ఆటలు - పాటలు - వేడుకలు - అపహాసములు - నిషేధించుటకుగాని యడ్డుపెట్టుటకుగాని వీలుండదు. దివ్యానందానుభూతి నాలోచింపుచు ప్రభువు లేమరియుందురు. మంత్రులుగూడ నిట్టిదిజరుగునని యూహింపనేరక యుత్సవకార్యమున లీనులై యుందురు. ప్రభువులు నిరాయుధులై, మైమరచి, స్త్రీలచేతికిగూడ దొరకదగిన సమయము మీరోజునగాక మరి యీ జన్మమున లభించుటకు వీలులేదుగదా!

సార్వభౌముడు :

(అత్యుద్రేకముతో) అట్టులైన లోనికివచ్చెడు వారినెల్ల బరీక్షించి విడుచునట్టుల నుత్తరు వొసంగవచ్చునుగదా ?

తిమ్మరుసుమంత్రి.

(రహస్యముగనే) వలదువలదు- ఈ బాహ్యాపరీక్షవలన నిసుమంత ప్రయోజనము నుండబోదు. ఇప్పుడు వారి హృదయములనే పరీక్షకు బెట్టుచున్నారము. ఈ యాంతరిక పరీక్షలో నెల్లవిషయములును దేట పడగలవు.

సార్వభౌముడు :

(బడలిక నభినయించి) సరే! మీరు గమనింపుచుండుడు - నేనంత వరకించుక విశ్రాంతును.

తిమ్మరుసుమంత్రి.

(రహస్యముగ) అటులే వత్సా! ఆసోఫాపై శయనించియుండుము. (పాఱజూచి) అదిగో వారును బ్రవేశింపుచున్నారు - వేయికన్నులతో నేను కనిపెట్టి చూచుచుండెదను. (సార్వభౌముడు విశ్రమింప నేగును)

(ప్రవేశము - సర్వాభరణభూషితయై మేలిముసుగులోనున్న తుఖ్ఖాదేవిని, అయిష్టముగానున్నదానిని - బలవంతముగా నడిపించుకొనుచు పార్వతియు - భాను మతియు వెనుక దాసీగణము)

భానుమతి :

(బిగ్గరగా) రావమ్మా! భర్తృదారికా! రాతల్లీ! (లాగును)

తుఖ్ఖాదేవి.

[విదల్చుకొని చిరాకుతో] యాగపశువుంబోలి నన్ను బట్టుకొని లాగుకొని పోవుచున్నారిదేమి యాగడమే ?

పార్వతి ;

[బిగ్గరగా] ఆగడమా ? అదేమి రాజపుత్రీ ! అట్లనెదవు - పురందరుని ధిక్కరించు నీ పతిదైవముతో - త్రివిష్టపరాజాంతఃపుర

మును తిరస్కరించు - నీయంతఃపురమునం, దమరిసౌఖ్యముల ననుభ వమునకు దెచ్చుకొనుచు నానందింపదగిన యీ దినమున అఖండ స్వర్గీయానందము ననుభవింపదగిన యీ శుభదినమున -

తుష్టాదేవి :

[అర్ధోక్తిలో] అవునే. విఫలప్రేమ తపస్వినికి లభించునది-స్వర్గీయా నందమేగాదటే.

తిమ్మరుసుమంత్రి :

(రహస్యముగానుండి, కడుజాగరూకతతో వారినందరిని దిలకింపుచు వారి చర్యలు - మాటలు సర్వమును గమనింపుచు, వేయికన్నులతో పరిశీలింపుచుండును)

భానుమతి :

[అపవారించి] రాకుమారీ! నీవైరాగ్యమెల్ల నిపుడు వెల్లడించి కార్యభంగముగానీకుము.

పార్వతి :

(అపవారించి) కార్యభంగముతోనైనదా? నిలువున ప్రాణ ములు బోగొట్టుకొనుటయేగాక - తండ్రిగారికి తలవంపులు.

తుష్టాదేవి.

[అసహ్యముతో వారిని గాంచి] మీ దురాలోచనలేమాత్రమును నేనామోదింపనని నూరవమారుగూడ మీకుదెల్పితిని.

పార్వతి :

[చేతినినోటికడ్డముపెట్టుకొని జనాంతికము] ఉస్ అరవబోకుము. యెల్లపుడు నేను మరణింతును. నేను మరణింతునని వాపోవుచునే యున్నావుగదా! మాపని పూర్తిగానిమ్ము అప్పుడు సంతోషముతో నందరమును మరణింతము.

తుఖ్షాదేవి

[కోపముతో] మీబుద్ధిమాలిన పనులేమాత్రము మీరుచేయుట కారంభించినను నేనామోదింపజాలను బిగ్గరగా కేకలువైచి యెల్లర నిటకుజేర్తును.

భానుమతి :

[పాఱజూచి అపవారించి] రాకుమారీ! నిన్నాడించుటకు మేము నీతో జెప్పినవాక్యములెల్ల నిజములనితలంచితి వాయేమి ? ఏలనిట్లు కేకలువైతువు వారెవరైన విన్నచో నిన్ను జాగయనుకొందురు.

తుఖ్షాదేవి :

ఏమైనగానీ - మీరేయకృత్యమొనర్చినను నేనూరకుండుదాన గాను - మీరు సద్బుద్ధితోనున్నచో -

భానుమతి :

[పాఱజూచి అర్థోక్తిలోనే పార్వతితో] సఖి ప్రభువాశయ్యపై బవ ళించియున్నటులున్నారు. చల్లగా సమీపింతము. నీభూమికను నీవారం భింపుము.

పార్వతి :

[బిగ్గరగాపాడుచు నాట్యమొనర్చును]

"త్రిలింగ దేశ సార్వభౌముతో
కళింగ దేశరాజ పుత్రితో
చెలంగు జంపతీ మహత్తుతో
తులంగనంగ నెవ్వరీ యిలన్"

రెవ్వరీయిలన్ - మరెవ్వరీయిలన్ - మరెవ్వరీయిలన్ "

భానుమతి :

[వైతాళికులధోరణితో గొంతెత్తి బిగ్గరగా)

పండితుడెగాదు కవిసార్వ భౌముడితడు
విదుషియే గాదు కళలం బ్రవీణ, రాణి,
ఔర ! యీ దంపతులకు సామ్యంబుగలదె ?
వీరికిని వీరసాటి యీ విశ్వమందు॥

అహో ! ఈ జాయాపతీశోభ నభివర్ణింప శేషుడేగావలయును.

పార్వతి :

(తుష్టాదేవిని గాంచి) భర్త్రిదారికా ! (అర్థోక్తిలోనే - నాలుక గరచికొని) పొరపాటు - పొరపాటు - శ్రీఖండశీతనగమధ్యాఖండ క్షోణీ మండలాఖండలుడైన శ్రీశ్రీశ్రీ కర్ణాటాంధ్ర సార్వభౌములకు భారతవర్ష నిఖిలశత్రురాజన్య విజేతకు - శ్రీశ్రీశ్రీ విద్యానగరవర పరిపాలనాదక్షులకు - పట్టపుదేవేరులై ప్రకాశింపుచున్న మహారాజ్ఞీ శిరోరత్నమును - పూర్వపుజనవుంబురస్కరించుకొని, భర్త్రిదారికా, అని తేలికగాబిలుచుట నానేరమేయగును. కాని, పసితనమునుండి కలిసి మెలిసి, యత్యంత స్వతంత్రముగా సంభాషించుకొనుచున్నవారమగు టచే దీనిని ప్రథమాపరాధముగా మన్నించి క్షమింపప్రార్థింపుచున్న దానను (నవ్వుచు) నాక్షమాపణమాత్రమున మహారాజ్ఞీవారికి సంతృప్తిగలుగక ఆగ్రహాముశమింపక - దేహామందలిరక్తమంతయును తుకతుకనుడికిపోవుచున్న సర్వరసదివ్యానుభూతి కెదురుచూచుచున్న సమయముగావున నేడు తృప్తిగలుగకున్న తామొసగుశిక్షననుభవింప సిద్ధముగానున్న దానను.

(తెరలో)

[దూరమున నందులం మాగధులు వైతాళికులం గొంతెత్తి బిగ్గరగా జయ జయ ధ్వానములొనర్చి తరువాత పద్యములతోగూడ నత్యంతహృద్యముగా-స్తోత్ర పాఠముల బఠించుచురు]

శ్రీ శ్రీ శ్రీ ఆంధ్రకర్ణాటకువలయు రాజమూర్తీ ! జయీభవ
విజయీభవా

శ్రీ శ్రీ శ్రీ కటకప్రభునందినీ - వైదుష్యవికసిత చిత్తసరోవర భాసిత పుండరీకవనప్రతిమానా !! జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ !

ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమా
రతకు క్రౌంచాచల రాజమయ్యె
నావాడపతి, శకంధర, సింధురాధ్యక్షు
లరిగాపు లెవ్వాని ఖరతరాసి,
కాపంచగౌడధాత్రీ పదంబెవ్వాని
కసివారుగా నేగునట్టి బయలు
సకలయాచక జనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖి॥

యట్టి రాజాధిరాజ ! మహాప్రతాప
రాజపరమేశ బిరుద విరాజమాన !
మూరురాయగండ ! హంవీర ! బాస
దప్పు రాయరగండ ! ఆంధ్రనవభోజ ! !.

తొలుదొల్త నుదయాద్రి శిలదాకి తీంద్రించు
నసిలోహమున వెచ్చనై జనించె
మరి కొండవీడెక్కి మార్కొని నలియైన
యల కసవాపాత్రునంటి రాజె
నటసాగి జమ్మిలోయబడి వేగదహించె
గోన బిట్టేర్చె గొట్టాన దగిలె
కనకగిరి స్ఫూర్తిగరచె గౌతమి గ్రాచె
నవలనా పొట్నూర రవులు కొనియె.

మాడెములు ప్రేల్చె - నొడ్డాది మసియొనర్చె
కటకపురిగాల్చె గజరాజి కలగి పఱవ
దోకచుక్కనవౌర ! యుద్ధురత గృష్ణ
రాయ బాహుప్రతాప జాగ్రన్మహాగ్ని॥

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ !

"గంగాస్వచ్ఛ తరంగభంగిక యశోగాథచ్ఛ విచ్ఛన్న సా
రంగాంకాంక! నిరంకుశ ప్రతికళాప్రౌఢి ప్రియంభావుకా!
గాంగేయాచల చాపనూపుర వచోగాంభీర్య లీలాస్పదా!
బంగాళాంగ కళింగ భూప సుభటాభ్రశ్రేణి ఝంఝానిలా"

జయీభవ – విజయీభవ – దిగ్విజయీభవ!

"కవిరాజ విరాజితము"—

నలభృగురంతి భగీరథ భారత
నందన కల్ప యనల్పయశ
శ్చులుకితలోక విలోకి వధూజన
సూనశరాసన! మానఖనీ!
ప్రళయ ఘనాఘన ఘోష భయానక
భాంకృతి భీమచపేట లుఠ
త్కల బరిగీ కటకక్షితి రక్షక!!
కన్నడరాజ్య రమారమణా!!

జయీభవ – విజయీభవ – దిగ్విజయీభవ!

(కైవారము లాగిపోవును)

భానుమతి :

[నలుమూలల జూచి, యెవ్వరు లేమిని, ప్రభువు నిదురించుటయు గమనించి తలయూపుచు హేళనగా] హు–హు–కన్నడరాజ్యరమారమణు లింతటి సందడి యగుచున్నను – విదుషీమణియు, కళానిలయ యగు, నర్ధాంగితో ప్రథమ సమాగమ మహోత్సవమున కుప్పొంగదగిన యీరాత్రి– మహారాజకుమారియగు తన ప్రియకాంతాశ్యమంతకము రాకకు – కన్నులు కాయలుగాయ నెదురుచూచుచు కమ్మని యాలోచనలు తల దిమ్మెక్కింప – కర్పూరరజమువలె, కరిగి, కృంగి, కృశించుచున్న హృదయములో – కాచుకొని యుండదగిన యీ రాత్రి –

కట్టుబాటు లేకుండ కల్లుత్రాగినవానివలె, కదలకుండ శయ్యపై బరుండి, కమ్మకమ్మని గురకలం బెట్టుచు - గాఢనిద్రాలహరికా కంఠదఘ్న నిమగ్నులై యుండిరే యిదేమాశ్చర్యము ?

పార్వతి :

[నవ్వుచు] భూదారుల రసికతా పరిపాకమున కిది చరమపరిణామము-రసికత యన్న రసికతయా ?

భానుమతి :

(ఆపవారించి) ఆతని రసికతతో మన కేమిపనిగాని - (నలుదిక్కుల పాఱజూచి) మనము కోరుకొనిన యవకాశ మిప్పుడు లభించినది. అంతఃపుర రక్షిణులు-పరిచారికలు - ప్రతీహారిణులు కంచుకులు-సర్వులు, ఈ మందిరము చాయలకే రారైరి - ఈ శయ్యామందిరములో నున్నవారెల్లరును - కటకపురినుండి మన వెంట వచ్చిన స్త్రీజనము మాత్రమే ! గమనించితివా ? అదృష్టలక్ష్మి మనల నెదుర్కొనుట లేదా ?

పార్వతి :

(నలువైపుల బాఱజూచి) నిజమే నీవు చెప్పిన దెల్లయును.

భానుమతి :

(మరల పరిశీలనాపూర్వకముగా దాఁజూచి) అంగరక్షకులు గాని, మరొకరు మరొకరుగాని, యిట దాగియుండరుగద ?

పార్వతి :

(నవ్వుచు జనాంతికము) నీ వెంత పిరికిదాన వైతివి భానుమతీ! గర్భాధానపు గదిగదా యిది ! ఇచటగూడ నట్టి వింతలు—

భానుమతి :

(అపవారించి-అర్ధోక్తిలో) లోకములెల్ల విడ్డూరముగా జెప్పుకొనుచున్న తిమ్మరుసుమంత్రి బుద్ధిబలమును మన మంత తేలికగా నూహింప గూడదు సుమా ! !

తిమ్మరుసుమంత్రి :

(రహస్యాగారమున నుండి వారి చేష్టలు మాటలు అభినయములు సర్వమును దిలకింపుచుండు.)

పార్వతి :

[అటునిటుజూచి] ఇది కడు చక్కని సమయము – ఇక మనకిట్టి యమూల్యావకాశము లభింపబోదు–

భానుమతి :

[నిశితముగా నలుదెసల జూచుచు] ఎంత? నిముసములో నన్నియు బూర్తిగా గలవు. తుఖాదేవిని బలవంతముగా నెట్టుకొనుచు సార్వభౌముల శయ్యను సమీపించి] దయచేయుడు మహారాణీ ! నిరంతర రాజ్యభార భరణ శ్రమచేత గాబోలు శ్రీ సార్వభౌము లించుక విశ్రాంతి నందుచున్నారు–రమ్ము ! సమీపించి వారి నారాధింతము. (లాగును)

తుఖాదేవి :

(వెనుకకుబోవ బెనగులాడుచు కఠినముగా) పైశాచిక చిత్తవృత్తులు గల మీ కిద్వరకు నిక్కడ సార్వభౌమ సమీపమున బనియేమి ! నే నుందును. మీరావలకేగుడు–

భానుమతి :

(శరత్వములో) నూత్న వధూరత్నమవు – అందును గర్భాధానపు బెండ్లికూతురవు – తలకుమించిన లజ్జ నీ కాలుసేతు లాడనీయదు – కావున నీ వెంటవచ్చుచున్నారము. అంతమాత్రమున కాగ్రహింప

బనియేమి – ముగ్ధాత్వము దాటి మీరు మధ్యదశలోబడిన వెనుక మేమిచట నేల యుందుము – రండు ప్రభువుల సేవింతము (అనిపలుకుచు తల్పమును సమీపించి బంగరుసజ్జెములోని పుష్పములను దీసి సార్వభౌముని పైని జల్లుమని తుష్టాదేవి చేతికందీయబోవునటుల నటింపుచు-నొడ్డాణములో దాచియున్న ఖడ్గమును లాగి సార్వభౌమ విగ్రహమును గుండెలో చివాలున బొడుచును).

పార్వతి :

(విద్యుద్వేగమున తన యొడ్డాణములోగూడ గుప్తముగ దాచబడియున్న ఖడ్గమును లాగి సార్వభౌమ విగ్రహము కంఠమును నఱకును.)

(ఖడ్గములతో ఛేదింపబడుటతోడనే యీ విగ్రహమునందు నింపబడియున్న కృత్రిమరక్తము చింది - వీరిద్దరిమీదను తుష్టాదేవిమీదను నాలుగుదెసలను జిల్లుమని యెగిరిపడును, విగ్రహములోనుండి వచ్చు గురకయును - ఉచ్ఛ్వాసనిశ్వాసములును- నిలిచి పోవును).

తుష్టాదేవి :

[ఇదిగాంచి యావేశముతో] ఎంతపని జేసితిరే ? ఆ సార్వభౌముడు మీకేమపకారమొనర్చినాడే? దానవకాంతలారా! ఇంతఘోరముగా హత్య యొనర్చితిరేలనే !

భానుమతి ;

(వికటముగా నవ్వి) మే మేమి చేసితిమమ్మా ? యీనిశాముహూర్తసమయమున బావగారితో వసంతోత్సవము జరిపితిమి. మరలనవ్వును.

పార్వతి :

(భానుమతి ననుసరింపుచు అట్టహాసముగా నవ్వుచుండును.)

(లోపలినుండి విచ్చుకత్తులతో-ప్రతీహారిణీబృందమేతెంచి యా గృహమునందున్నవారినెల్ల జుట్టుముట్టి యదుపులోనికి దీసికొందురు)

( శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడును తిమ్మరుసుమంత్రియు ప్రవేశించి - వారి కెదురుగా నిలతురు)

పార్వతి _ భానుమతి :

(వారిని గాంచుటతోడనే - తమచేతులలోని ఖడ్గములను నేలపై జారవిడిచి, ప్రాన్పాటు నందెదరు!)

తిమ్మరుసుమంత్రి :

బాలికలారా ! మీ యాగ్రహము లింతటితో నుపశమించిన ననయే భావింతును.

పార్వతి - భానుమతి

(గడగడ వణకిపోవుచుందురు.)

శ్రీకృష్ణరాయసార్వభౌముడు

(తుఖ్ఖాదేవిని సమీపించి శాంతముగా) మహారాజనందినీ ! మీ హస్త మందిట్టి కరవాలము గానుపింప దేమి ?

తుఖ్ఖాదేవి:

( విభ్రమాతిరేకమున తలయెత్తిచూచి సార్వభౌముని తన జీవితేశ్వరుడే యీతడని స్మరించి మేలిముసుగుదీసివైచి దిగ్భ్రాంతితో) ఇదేమి ? తమరా విద్యానగరసార్వభౌములు ? నా యుపాసకదైవమే కన్నడరాజ్య రమా రమణుడగునా ?

శ్రీకృష్ణరాయ సార్వభౌములు :

[పరిశీలించిచూచి గుర్తించి యాశ్చర్యముతో] ఏమిది ? అన్నపూర్ణా దేవియా? నా హృదయాధి దేవత, కటకేశ్వరుని పుత్రికయేనా ! ఏమా శ్చర్యము?

తుఖ్ఖాదేవి :

[దుఃఖాతిరేకమున కన్నీరుగార్చుచు] అహో మందభాగ్యను - తమ కొఱకహోరాత్రములు తపించి తపించి - వేగుల నెందరనంపి జాడదీయ

ప్రయత్నించియు, సాధ్యపడక - తలిదండ్రుల కెరిగించియు, లాభము లేక తమపైగల యాశచే ప్రాణము లింతదనుక నీ శరీరములో నిల్పుకొని యున్నదానను - ఉపాశించిన ఫలమందియు గురుతింపనేరక వగల బొగులుచున్న దురదృష్టవంతురాలను - మిమ్ము దెలిసికొననేరక యెంతటి దురవస్థకు బాలుపడుచుంటిని? (దుఃఖ సంతోషములు మిళితమైన యా యావేశమును భరింపజాలక మూర్ఛిల్లును)

తిమ్మరుసుమంత్రి.

[తెరవైపు జూచి] ఎవరక్కడ? త్వరగా రండు. ఈయమను తల్పమున జేర్చి శీతలోపచారము లొనర్పుడు.

దాసీలు నలువురు.

[పరుగిడుచు వచ్చి తుక్కాదేవి నెత్తుకొని తల్పముపై జేర్చి శీతలోపచారము లొనర్పుదురు)

శ్రీకృష్ణరాయ సార్వభౌముడు

(స్తంభించిపోయి అంతలో తేరుకొని తనలో) విచిత్రవిధి చేష్టలెంతటి దురవగాహములు. అహో! విచిత్రము - ఏ నా ప్రాణాధికప్రియావియోగవేదన భరింపజాలక, యిన్నిదినములుగా నింతటి దుర్భర యాతనంగుందుచుంటనో? ఏ నా మనోహారిణిం దర్శింప నన్న పానీయములుగూడ వర్జించి - కర్తవ్యకార్యములగూడ నిర్వహింపజాలక, దేశ దేశముల వేగులచే గాలింపజేసి, యుపయోగము లేకపోగా, నహో రాత్రములు పరితపించుచుంటినో? - ఆ నా ప్రణయాధిదేవత, చిరకాల వియోగబాధానుభవానంతరము- ఆకటా! తలవని తలంపుగా నేసన్ని వేశమున, నెట్టిస్థితిలో, దర్శనమొసగినది ?

ఈ నవలాశిరోమణి, మదీప్సిత కల్పకభూరుహమ్మటం
చేను జపించు నాదుహృదయేశ్వరి, నన్గురుతింప కెవ్వరో
మానవనాథుడీతడని, మారణముం బొనరింప గత్తులం
బూనిన చెల్మికత్తెల యపూర్వత కచ్చెరువొంది ప్రాన్పడెన్॥

వారిచేష్టలెల్ల వారించు వైఖరి
గాంచినాడ ! నాతి కలుషరహిత
నన్నుబోల్చుకొనియు నావంక జూచిన
చూపుగాంచినాడ ! శుద్ధహృదయ॥

అశిథిలానంద పారవశ్యంబు మీర
గలియదగు నేటి యీ సమాగమము, నిప్పు
డెంత భీభత్సమయము గావించినాడ
వౌర పరమేశ ! ! ఏమిసేయంగలాడ॥

(దుఃఖముతో] పరస్పరమాత్మబలిదానమునకైన నాయత్తమగు స్థితిలోనున్న ప్రాణాధికులమగు మమ్ము - గుగు తెరుగనిస్థితిలోనుంచి. కుమిలికుమిలి దుఃఖపడజేసి, కడకింతటి నిగూఢముగా-నిట్టిచోట, యీ రీతిగా సమావేశపరితువా? భగవన్ నీసంకల్పము దురూహ్యముగదా! (దిగ్భ్రమనభినయించుచు నలుదిక్కు (గాంచి విభ్రాంతితో) నాకేలనో భూమి యంతయును గిరగిరదిరుగుచున్నది.

హృదయమ్ము త్క్రంతకు నా
స్పద మయ్యెను - దనువు వడక సాగెన్నొటిలో
మది గగ్గోల్పడియెను, దో
చదయింతయు - మూర్ఛవచ్చు చందముదోచెన్॥

హా ప్రాణప్రియా ! మన్మనోరథసంజీవనౌషధీలతా ! హా అన్నపూర్ణా దేవీ ! (అనియరచి తూలుచు కనులుమూసుకొని కూరుచుండి నేల కొరిగి మూర్ఛిలును)

తిమ్మరుసుమంత్రి :

(తెరవైపుగాంచుచు) ఎవడురా అక్కడ ?

(అంగరక్షకులు నలువురు ప్రవేశించి) జయము జయము మహామాత్యులవారికి, యేమాజ్ఞ ?

తిమ్మరుసుమంత్రి :

నిముసములో నాస్థానవైద్యులను మేము చూడవలయును. శ్రీ శ్రీ శ్రీ సార్వభౌముల నిచటినుండి చల్లగగొని గుప్తమందిరమున గల శయ్యపై జేర్చి వైద్యులేతెంచువరకు శైత్యోపచారములనల్పుడు.

అంగరక్షకులు,

మహామాత్యుల యాజ్ఞానుసారము.

(సార్వభౌముల దేహమును మెల్లగా నెత్తుకొని నిష్క్రమింతురు)

తిమ్మరుసుమంత్రి.

(పార్వతీ భానుమతులగాంచి) బాలికలారా! శ్రీసార్వభౌములపయి మీ రాజసుతను లేనికోపము మీకు గలుగనేల ?

పార్వతి - భానుమతి

(గడగడవడవడచు మాటలాడక మౌనముగనుందురు)

తిమ్మరుసుమంత్రి.

[చూచి] మౌనము మంచిదేగాని ఒక గడియకాలములో మీరు తగిన సమాధానమీయనిచో మీ నోళ్లు విప్పునటులజేయు నుపాయ మును మే మెరుగుదుము.

పార్వతి - భానుమతి :

(గడగడవడవడచు పలుకకుందురు)

తిమ్మరుసుమంత్రి :

(తెరవైపుజూచి బిగ్గరగా) ఎవడురా అక్కడ ?

(ప్రతీహారిణులిద్దరు ప్రవేశించి వంగినమస్కరించి) జయము — జయము మహామాత్యులవారికి యేమాజ్ఞ ?

తిమ్మరుసుమంత్రి :

వీరిద్దరినిదోడ్కొనిపోయి – చిరుతపులిబోనులోనికి త్రోసివైవు డని మామృగశాలాధ్యక్షునికప్పజెప్పిరండు.

(ప్రతీహారిణులువంగి నమస్కరించి) చిత్తము. ఆజ్ఞాప్రకారమే.

పార్వతి – భానుమతి.

(గడగడ వడకుచునే నమస్కరించి) తమరడిగిన వాటికన్నిటికిని మే మెరిగియున్న జబాబులిత్తుము.

తిమ్మరుసుమంత్రి.

అటుల దారిలోనికిరండు – మా ప్రభుశేఖరుని జంపవలయునన్న ద్వేషము మీకేలగలిగినది ?

పార్వతి.

ఈ సార్వభౌమునిపై మాకీ షణ్మాత్రమును ద్వేషమేలేదు.

తిమ్మరుసుమంత్రి.

లేనిచో మీరు గుప్తఖడ్గములు ధరించి యేలవచ్చితిరి?

భానుమతి.

ఈ సార్వభౌముడు మా ప్రాణ మానముల రక్షించినారు. మా రాజపుత్రిక నెంతయో ఆపదనుండి యుద్ధరించినారు, వీరే విద్యానగర సార్వభౌములని మాకు ముందే తెలిసియున్నచో కథ వేరొక విధముగా నుండెడిది.

తిమ్మరుసుమంత్రి.

(ఆలోచన నభినయించి) అబద్ధములాడక ఆకథయేమో నాకెరిగింపగోరుచున్నాడను.

పార్వతి.

మహామాత్య శేఖరుల యాజ్ఞాప్రకారమే - వినుడు. సింహాచల ప్రాంతమున నాశ్రమము వైచుకొనియున్న విబోధానందస్వామివారు, మాభర్తృదారికకు విద్యాదాన మొసగినగురువు, మారాజపుత్రిక అప్పు డప్పుడు వారిని దర్శింపవచ్చుచుండెడిది. వెంట మేమును వచ్చెడి వారము. ఒకనాడటులే మేము - కొంతసైన్యముతో గూడ, వారి సందర్శనార్థమే తెంచి ఆశ్రమప్రాంతమందలి చిట్టడవిలో డేరాలువైచి కొని నివసింపసాగితిమి, ఒక సాయంకాలమున సేవకు లెవ్వరును వెంట లేకయే మేము ముప్పురమును (శ్రీ) స్వామివారి దర్శనమొనర్చి వచ్చు చుంటిమి. మా డేరాలింకను కొంతదూరమున నున్నవి. మధ్య నొక చోట నొక చందనద్రుమమున కల్లుకొని మనోరంజనీలత యొండు పుష్పించి, యాసుమసౌరభము మమ్మాకర్షించినది. ముప్పుర మచటి కేగి పుష్పముల వెదకుచుండ, భయంకరమగు నారణ్యక నాగ మొకటి మా భర్తృదారికపై దుముకనుండెను. ఇంతలో నెటనుండియో ఈ మహామహుడు విద్యుద్వేగమున దుమికి యాసర్పశిరము నొడిసిపట్టు కొని రాసుతను రక్షించినారు.

తిమ్మరుసుమంత్రి,

(ఆలోచింపుచు) 'అటులనా ? తరువాత.

భానుమతి,

నాడే - పరస్పర దర్శనమున వీరిరువురకును, మదులలో ప్రేమో దయమై వర్ధిల్లసాగినది.

తిమ్మరుసుమంత్రి :

(ఆలోచన నభినయించి) ఆ తరువాత ?

పార్వతీ :

మరి నాల్గురోజుల కొక తురుష్కసైన్యమే తెంచి, మా సంర క్షణకై యున్న సైన్యమును సేనాపతి నోడించి, మా సేనాపతిని

బంధించి మా రాజపుత్రికతో గూడ మమ్ము చెఱబట్టినారు. అప్పుడీ వీరుడు తన యంగరక్షకదళముతో వచ్చి తలపడి, యా ముష్కర తురుష్కుల జిన్నాభిన్నము గావించి, మహాఘోరముగా బోరి వారినెల్ల మడియించి, మమ్ము చెర విడిపించి మమ్మాయాపదనుండి గట్టెక్కించినారు-కాని-యా వీరచూడామణి కా యుద్ధములో బెద్ద గాయమైనది. ఆ రణరంగములో నీ శూరశిఖామణి ప్రకటించిన యమానుష పరాక్రమము గాంచిన యా రాజపుత్రిక కీ వీరశిరోరత్నముపై నెక్కుడ లేని మక్కువ జనించి, యాతని నారాధింప సాగినది. నాటినుండి యాహార నిద్రలు మాని రేబవళ్ళు విడువక యీ మహారాజసన్నిధినే సేవింపుచుండి యుపచారము లొనర్చినది.

తిమ్మరుసుమంత్రి :

(ఆశ్చర్యము నభినయించి) ఆ తరువాత ?

భానుమతి :

ఆ సమయముననే యీ ప్రభుపుత్రుని గొనిపోవుటకొఱకు చతురంగబల సమేతమగు మహాసైన్య మేతెంచి, ప్రయాణము వీలుపడుమిచే నచ్చట నే స్కంధావార మేర్పరచుకొని కొన్నినాళ్ళాగినది. మా భర్తృదారిక యీ మహావీరు డే దేశపాలకుడో జాడలు దీయుమని మమ్మిరువుర నియోగించినది. కాని మే మెంత ప్రయత్న మొనర్చియు వీరి నిజమగు వృత్తాంత మెరుగజాలకయే పోతిమి. మా రాజసుత కీ మహానుభావునిపై ప్రేమ మితిమీరిపోసాగినది. గురుదేవుల చికిత్సా ప్రాబల్యముననో మా చెలి సేవామహిమనో వీరాగాయముమాని జీవించినారు.

తిమ్మరుసుమంత్రి :

(పండ్లుబిగబట్టి ఆలోచింపుచు) ఆ తరువాత ?

పార్వతి :

సరిగా నాసమయముననే మా ప్రభువర్యులకడనుండి "తత్క్షణమే బయలుదేరి రావలసినదనునాజ్ఞయు, వచ్చినది. ఇకవిధిలేక - వదలి

పోజాలక మా రాజపుత్రి యీ మహావీరుని యనుమతి బడయవచ్చి తన మెడలోని ముక్తాహారమును కృతజ్ఞతారూపముగా నొసగి, వెడలి పోవుటకనుమతినర్థింప, సేవాఫలముగా నీమహారాజు తన మెడలోని రత్నహార మొసగినారు పరస్పర మెరుగజాలకయున్న వీరిరువురు కన్నీళ్లతో విడిపోయినారు. ఇంటికేగినది మొదలు మా భర్తృ దారికయన్నపానీయముల విసర్జించి విరహబాధితయై సర్వదా యీ మహావీరునిగూర్చియే ప్రలాపించుట కారంభించినది. మేము శైత్యోప చారము లెన్నిసల్పియు ఫలముగానక మామహారాణివారికి జెప్పి ప్రభు వుల కెఱుకపరచితిమి - వారీవిషయమునంతగా బట్టించుకొనలేదు. మే మెంత ప్రయత్నించియు వీరిజాడ నెరుగ లేకపోయితిమి. ఇటులుండగా నాంధ్రకర్ణాట సార్వభౌముడు మహాసైన్యముతో నెత్తివచ్చెననియు, మాప్రభు వాతనితో సంధి జేసికొనక తప్పనిసరియాయెననియు ఆతడు మారాజపుత్రి నా శత్రురాజునకొసగి వివాహ మొనర్ప వలయుననియు ఆతడు కులహీనుడనియు, ఈసంబంధము చేదనవంశగౌరవహానియగునని యును మా ప్రభువు మమ్ములబిల్చి చెప్పి - తన పుత్రిక నట్లైన నంగీక రింపజేసి అత్తవారింటికేగినతోడనే ప్రథమ సమాగమ రాత్రి యే యుపాయముననైన నాతనిగడతేర్చి పరువునిలుపు నుపాయమాలో చింపకదప్పదనిమమ్ము శాసించినాడు.

తిమ్మరుసుమంత్రి :

(దీర్ఘముగనాలోచింపుచు) తరువాత తరువాత ?

భానుమతి :

మేమావిషయమును మా చెలికి దెల్పగా నామెఛీత్కార మొనర్చి తానాపనిని జేయనని ఖండితముగా జెప్పినది.

తిమ్మరుసుమంత్రి :

(యోజింపుచునే తలయూచి) ఆహా ? తరువాత ?

పార్వతి :

తరువాత నిక నేమున్నది ? తల్లిగారెంతి జెప్పియు - మేమెంత బోధించియునామె చిత్తముమారలేదు. కావున నా కార్యభారమును మాప్రభునాజ్ఞచే మేమేశిరములపై చుకొంటిమి చిక్కువడితిమి. ఇక మాకెట్టిశిక్ష మీరు విధించినను మేమనుభవింప సిద్ధముగానున్నారము. కర్ణాటాంధ్రసార్వభౌములే మాప్రాణదాతయను వృత్తాంతము దెలిసి యున్నచో నిట్లుగా నేరదు.

తిమ్మరుసుమంత్రి :

(తెరవైపుగాంచి) ఎవడురా అక్కడ ?

అంగరక్షకదళాధిపతి :

(ప్రవేశించి) జయము జయము మహామాత్యులకు ఏమాజ్ఞ ?

తిమ్మరుసుమంత్రి ;

మహారాణీవారివెంట కటకపురినుండి వచ్చియున్న దాసదాసీ జనులందఱను రథ, గజ తురగాది పరివారముతో - వారివెంట దెచ్చి యున్న సర్వసంపత్తితో గూడ ప్రయాణమునకు సిద్ధముగానుండ మాయాజ్ఞగా దెలిపి మనసేనానినయ్యపరాజును బిలిచిరమ్ము.

అంగరక్షకదళాధిపతి :

మహామాత్యుల యాజ్ఞాప్రకారమే. (నమస్కరించి నిష్క్రమించును)

తుక్కాదేవి :

(ప్రకృతిస్థయై) మీరెవ్వరు ? నేనెచటనున్నాను.

ప్రతీహారిణులు :

మహారాణీ ! తమరు రాజాంతఃపురముననేయున్నారు, తమ యారోగ్యము బాగుగలేదు. ఇంచుకవిశ్రమింపుడు.

తిమ్మరుసుమంత్రి :

(మహారాణిని సమీపించి) మహారాజనందనీ ! మీప్రయాణవేళ సమీపించుచున్నది.

తుక్ఖాదేవి :

(ఏమియునర్థముగాక లేచి కూర్చుండి)తమరేమనుచున్నారు? నాకు బోధ పడుటలేదు.

తిమ్మరుసుమంత్రి :

మీరిక్కడ నికనుండజాలరు. మీ యిచ్చవచ్చినచోటికేగ వచ్చును. కటకమునుండి మీవెంటవచ్చినపరివారముతో - వస్తు వాహనాది సంపత్తితో గూడ -

తుక్ఖాదేవి

నాకు ప్రవాసశిక్ష విధించితిరా ? (విచారించును)

తిమ్మరుసుమంత్రి;

ప్రవాసశిక్షయన నేమి గాని - మీ యిచ్చవచ్చినచోటి కేగక తప్పదు.

తుక్ఖాదేవి :

మాకీ శిక్షను శ్రీ సార్వభౌములేవిధించినారా ?

తిమ్మరుసుమంత్రి.

విదుషివి-నీకెక్కుడుగా జెప్పనక్కరలేదు-రాజనీతి కడు నిష్ఠుర మైనది.

తుక్ఖాదేవి :

(దుఃఖించుచు) తండ్రీ ! నేను నిరపరాధనుగదా! ఏదోషమునకు నాకీశిక్ష?

తిమ్మరుసుమంత్రి :

(నిబ్బరముగా) అమ్మా! ఎల్లరమును కర్తవ్యమునకు దాసులము.

తుక్కాదేవి :

నేను శ్రీ సార్వభౌముల దర్శన మొసగ ప్రార్థించుచున్నాను. నా కనుజ్ఞ నొసగుడు.

తిమ్మరుసుమంత్రి :

ప్రభువు లింకను మూర్ఛనుండి తేరుకున్నట్లు లేదు.

తుక్కాదేవి :

అయిన నిది మహామాత్యులవారొనగిన శిక్షయా? నేను మీ యానతి శిరసా వహింతును. కాని ప్రభువుల సందర్శింపక యీచోటి నుండి కదలజాలను.

తిమ్మరుసుమంత్రి :

(రక్తసిక్తమైయున్న తల్పమును - ఛేదింపబడియున్న సార్వభౌముల ప్రతిమను జూపించుచు) తల్లీ! అటుగాంచితివిగదా! ఆగ్రహింపకుము - అది సాలభంజికగాక నిజమగు సార్వభౌముడే యైన నేమిగావలసినది? ఇట్టి యేర్పాటు లిక నెన్నిగలవో?

తుక్కాదేవి.

అంతులకు సమాధానము శ్రీ సార్వభౌములతో నేను మనవి జేసికొందును - ఆమాత్ర మవకాశ మొసగరా? తండ్రీ!!

తిమ్మరుసుమంత్రి :

అటులవీలు లేదమ్మా! మీరు తక్షణమే బయలు దేరిపోవలయును-లేకున్నచో మీ వెంటవచ్చినవారిలో నెవ్వరెవ్వరేయే కార్యముల

నియుక్తులై వచ్చినారో! ఈ పన్నుగడలనెల్ల భగ్నపరచుట కెన్ని దినములు బట్టునో యెంతటి శక్తియుక్తులం బ్రదర్శింపవలసివచ్చునో ?—

తుఖ్ఖాదేవి :

(ఆలోచింపుచు దుఃఖముతో) తమ యాజ్ఞానుసారమే గానిండు — పరమాత్మసంకల్ప మెటులుండ నేనేమిచేయగలను ? [చేతులు జోడించి యాకాశము పరీక్షింపుచు] తండ్రీ! దీనజనావనా!! ఇంకను నాపై నీకు కరుణ గలుగలేదా ? జగన్నాధా ??

తిమ్మరుసుమంత్రి :

(తెరవైపు గాంచి) ఎవడురా అక్కడ ?

వృద్ధకంచుకి :

[ప్రవేశించి] జయము జయము మహామాత్యశేఖరులకు—

తిమ్మరుసుమంత్రి :

సేనాపతి వచ్చియున్నాడా ?

వృద్ధకంచుకి :

అంతఃపురద్వారముకడ వేచియున్నారు

తిమ్మరుసుమంత్రి :

నీవేగి వానిని మా యాలోచనామందిరమునకు దోడుకొని రమ్ము — శీఘ్రముగా నేగుము.

కంచుకి :

(వేగముగా నిష్క్రమించును)

తిమ్మరుసుమంత్రి :

[తుక్కాదేవికి పరిచర్య యొనర్చు ప్రతీహారిణులతో] ఈ మహారాణీవారిని చాల జాగరూకతతో దోడుకొనిపోయి సువర్ణద్వారముకడనున్న మేనాలో గూర్చుండబెట్టవలయును. ఈ చెలికత్తెలిర్వురు నాయమ వెంట నేగగలరు—

ప్రతీహారిణులు :

(వినయముతో నమస్కరించి)మహామంత్రుల వారియాజ్ఞప్రకారమే—

(తుక్కాదేవిని భద్రముగా బట్టుకొని మెల్లగా నడిపించుకొనుచు వెలుపలికి గొనిపోవుదురు)

(పార్వతి-భానుమతుల వెంట విచ్చుకత్తులతోనున్న కొందరు ప్రతీహారిణులు-చుట్టుముట్టి వెలుపలికి దోడ్కొనిపోవుదురు.)

తిమ్మరుసుమంత్రి :

దేనికైన నమంచిది కొన్నిదినము లీయమ ప్రవాసమందుడుటయే వాంఛనీయము—

సేనాధిపతి :

[ప్రవేశించి వీరనమస్కార మొనరించి] జయము జయము మహామాత్యులవారికి – తమ యాజ్ఞ కెదురుచూచుచున్నాడను.

తిమ్మరుసుమంత్రి :

సేనాధిపా ! మీచేతిక్రిందగల సేన నెల్ల వెంటగొని తక్షణమే వెడలి – మీరు మహారాణీవారివెంట వారిపరివారమునకు దోడుగా మనరాజ్యపుటెల్లల వరకును బ్రయాణమొనరించి, యామీద మహారాణీవారెచటకేగుట కిష్టపడిన నచట విడిచిరమ్ము—

సేనాధిపతి :

(వినయముతో చేతులు జోడించి) మహామాత్యుల యాజ్ఞాప్రకారమే

తిమ్మరుసుమంత్రి :

మరొకమాట! మహారాణివారొసగెడు యాజ్ఞలనెల్లను సైన్య సమేతుడవైన నీవు శిరసావహించి నెరవేర్చుచుండవలయును. సార్వ భౌముల యాజ్ఞకును మహారాణీవారియాజ్ఞకును భేదముండరాదు. ఒక నిముసములో నేగి వారిని గలిసికొనిపొమ్ము-

సేనాపతి :

(వినయముతో వీరనమస్కార మొనర్చి నిష్క్రమించును)

తిమ్మరుసుమంత్రి :

(ఆలోచనతో దనలో) నా మహారా జిప్పటికైనను, మూర్ఛనుండి తేరుకొనియుండునా? హారి నిర్ధారం గలయునిచ్చినచో నీ ప్రవాసశిక్ష కంగీకారము లభింపబోదు. నాయమ పరివారములోనివారియెల్లర యభిప్రాయములను గురు తెరుగుటకు సాధ్యము గాదు. కాని- పాపము చిరకాల వియోగానంతర పరస్పరసందర్శనమహాభాగ్యమొందితోడనే పరస్పరము గుర్తించుకొన్న తక్షణమే ఒకరితోనొకరు తనివిదీర సంభాషించుకొను వ్యవధిగూడ లేకుండ నంతలోనే ప్రవాసమున కంపబడుట బలవత్తరమగు శిక్షయే గాని అంతకంటె మార్గాంతర మగుపడుట లేదు. ఈ శిక్షానంతరపునస్సమాగమ మిర్వురకును శతసహస్ర గుణాధికానందమును గల్పింపగలదు- ఇక నేనేగి తదనంతర కర్తవ్యము నిశ్చయింతునుగాక- (తెరవ్రాలును.)

**ఇది నవమాంకము.**

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## దశమాంకము

### రంగము ౧

(అరుణోదయవేళ - కందనోలిసీమలో నొక చిట్టడవిలో - గజపతి పుత్రిక యగు తుఖ్ఖాదేవి వెంటనున్న పరివారమున్నూ - శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముల సైన్యమున్నూ ఒక నదీ తీరమున నిలిచియుందురు - మేనాలన్నియును ఆ నదీ పార్శ్వమున దింపబడియుండును. ఎల్లరును కాల్యకృత్యముల నెరవేర్చుకొను చుందురు. తుఖ్ఖాదేవి పరదామాటున దాసీలతోగూడ నేగినదియందు కాల్యకృత్యములనొనర్చి ధౌతవసనములదాల్చి ప్రాగ్దిశ గాంచునప్పటికి సూర్యోదయమగుచుండును. ఉదయ భానుగాంచి భక్తితో చేతులుజోడించి)

తుఖ్ఖాదేవి.

అహో ! ఉదయసమయ భానుమండలశోభ యెంత పవిత్ర మనోహరముగా భాసింపుచున్నది. (నమస్కార మొనర్చుచు) నమోనమస్తే - సర్వజగదాధారమూర్తయే - సప్తాశ్వాయ -

ఒప్పు శుకతుండ కాంతితో నుదయవేళ
బుండరీకప నాప్తమ్ము ! చండతరము-!
కూర్చు నా ఖండలాశకుం గుండలమ్ము !
మాన్యముదయించునదె భానుమండలమ్ము ! !

అగ్ని గర్భుండు - శంఖుండు - నదితి పుత్రు
డంశు మంతుండు, త్వష్ట, మార్తాండుడు, రవి
ఖగత నక్షత్ర గ్రహతారకల కధిపతి
కవియునగు భానునకు నమస్కార శతము॥

తండ్రీ ! ప్రభాకరా ! మదీయజీవితేశ్వరుని నేటికైన నా కంటి కగుపరచితివి. ఆ మహనీయు నమేయపరాక్రమశాలినిగా - భారతవర్ష విజేతగా - సార్వభౌమునిగా - కవిపండితమండలీ మండనాయమాను నిగా - మహాకవిగా - అపరపురందరునిగా - నగుపింపజేసితివి. అంతే గాని - నోరార మాటాడుటకుగాని, మనసార ప్రణామాదులాచరించు టకుగాని, వీలులేకుండగనే యీపాడుమూర్ఛమాకేల సంప్రాప్తింప వలయును. ఎట్టకేలకు మూర్ఛనుండి తేరుకొంటినో లేదో ? అంతలోనే నాకీప్రవాసశిక్షయా ? ఆ పరమోదారుడే జాగ్రదవస్థ నోనున్న నాకిట్టి దుర్గతి గల్పింపనిచ్చునా ?

ఇంతకునుమరొకరిననుకొనిన నేమి లాభము. మదీయపురాకృత, దుష్కృత పరిపాక మహిమగాక -

మ్రింగిన యట్టి పెద్దదగు మీనము నోటను జారి చిక్కకుం
డంగ దొలంగి మత్స్యమకటా ! యొక జాలరివాని, చేవలన్
జెంగునదూకి, పట్టుబడి, చిన్నగ వాని కరాంగుళాంతరం
బుంగని, జారి నీటబడ, ముక్కున నొక్క బకమ్ము మ్రింగెహా॥

పార్వతి - భానుమతి

(తుష్టాదేవిని పమీపించి యేడ్చుచు) మహారాణీ ! మీమాట వినక, చెనటి చేష్టలొనర్చి, మీకు మహాపదం గొనితెచ్చిన యీపిశాచముల శిక్షింపుము.

తుష్ఖాదేవి

[ఆలోచనాభంగమునొంది గంభీరముగా వారినిగాంచి] గతమును ద్రవ్వి నన్ను మరింత బాధింపకుడు. అవలకు బొండు.

పార్వతి - భానుమతి.

[పెద్దగా ఏడ్చుచు] మిమ్ము వదలి మేమెక్కడికి పోగలము తల్లీ! ఇంక నేశిక్షయైన విధింపుడుగాని యాశిక్షవలదు

[సార్వభౌముల సేనాని ప్రవేశించి] జయము జయము మహారాజ్ఞీ వారికి. ఇక తమ యాజ్ఞయేమో?

తుష్ఖాదేవి.

మీరు విద్యానగర సార్వభౌముల సేనాపతులనుకొందుము.

సేనాధిపతి.

[వినయముతో దోయిలొగ్గి] చిత్తము మహారాణీ! తమరూహించినది సత్యము.

తుష్ఖాదేవి.

మీకొసగబడిన యాజ్ఞ యెట్టిది?

సేనాధిపతి.

విద్యానగర రాజ్యపు సరిహద్దు దాటువరకు నేను నాసైన్యముతో తమకు సాయముగ నేగుమనియును తమరేమి యాజ్ఞ లొసగినను మేమా యాజ్ఞల నెల్లను శిరసావహించి యాచరింప వలయు ననియును.

తుష్ఖాదేవి.

మేము సీమాతిక్రమణ మొనర్చునెడల ?

సేనాధిపతి.

ఈ రహదారి చీటిని తను సేనానికొసగి వెనుదిరిగి రావలయునని

తుష్ణా దేవి-

మే మెచటికేగినను దానింగూర్చిన యేర్పాటేమేమైనగలదా?

సేనాధిపతి

లేదు - తమచిత్తమువచ్చిన యెచ్చటికైన నేగవచ్చును.

తుష్ణా దేవి.

మీకీ యాజ్ఞల నొసగిన వారెవ్వరు?

సేనాధిపతి.

శ్రీమహామాత్యులవారు.

తుష్ణా దేవి.

ఇపుడు మనమున్న ప్రాంతమెవరి పాలనలోనిది?

సేనాధిపతి :

శ్రీశ్రీశ్రీ విద్యానగర సార్వభౌములవారి పరిపాలన లోనిది - కంద నోలిసీమకుజెందినది.

తుష్ణా దేవి :

ఈరాజ్యపు సరిహద్దులింకెంత దూరమువరకున్నవి?

సేనాధిపతి :

ఇంకను (ఆలోచించి) ఇంచుమించు ఐదుక్రోశముల దూరము వరకున్నవి.

తుఖ్ఖాదేవి:

ఇచటికి సమీపమునగల గ్రామముపేరేమి ?

సేనాధిపతి :

దగ్గరలో కంభమనుపేరిటి పల్లెయొకటి గలదు.

తుఖ్ఖాదేవి :

మాదళవాయి యెక్కడ ?

కటకేశ్వరుని సేనాని :

(ప్రవేశించి నమస్కరించి) ఏమాజ్ఞ మహారాణీ ?

తుఖ్ఖాదేవి :

మేమిచటనే నివసింప గోరుచున్నాము. విద్యానగరసార్వభౌముల పాలితప్రాంతము దాటిపోవుట మాకిష్టముగాదు. దగ్గరలో తృణకాష్ఠ జలసమృద్ధమగు ప్రదేశమునుజూచి మనకెల్లరకును దగిన నివేశనములనిర్మింపంచుడు — ఆపని పూర్తియగువరకును విద్యానగరసేనాని తనసేనలతో మనకు సాయపడగలడు.

కటకేశసేనాని :

(వినయముతో) మహారాణీ వారి యాజ్ఞాప్రకారమే కాని నివేశనముల నిర్మించుటకు చాలకాలము బట్టగలదు. అంతవరకు తమరీ యడవిలో -

తుఖ్ఖాదేవి :

(ఆర్ద్రోక్తిలోనే) అంతవరకును పటకుటీరముల నిర్మింపుడు — మనమందు నివసించియుండి నివేశనముల నిర్మాణముసల్పుకొనవచ్చును.

సేనానులిట్లు

తమయాజ్ఞాప్రకారమే – (నమస్కరించి నిష్క్రమింతురు)

తుళ్ళాదేవి :

(తనదాసీలనెల్ల పిలిపించి వారితో) మేమిక్కడనే ఈ యడవిలోనే యిండ్లుగట్టుకొని – యొకగ్రామమును నిర్మించుకొని యిందునివసింప దలచితిమి, దీనిపేరు కృష్ణరాయప్రోలు మీలోనెవ్వరైన మనరాజధానికి గాని మరొక-చోటికిగాని పోదలచినవారు నిర్భయముగా నావిషయము నెరిగింపవచ్చును. దానికి దగిన యేర్పాటులొనరింపబడును.

అందరు

మహారాణీ ! మీరెచటనుండిన నదియే మాకు స్వర్గము మిమ్మిచట వదలిపెట్టి మేమేగి యెచటగాని చేయుకార్యమేమియును లేదు. మీతోడనేయుండి మీకు జేతనైన సేవసల్పుచుండుటయే మా యభీష్టము.

తుళ్ళాదేవి :

సరే అటులైననుండుడు. మీ భోజనాదులనెల్ల నేనే సమకూర్చ జేతును.

[తెర వ్రాలును]

## దశమాంకము – రంగము ౨

శ్రీకృష్ణరాయ సార్వభౌముడు

సర్వవిద్యా విశారద – సర్వమేది
నీ విమోహన సౌందర్య – నిరుపమాన
నిత్యలావణ్యగుణ మహనీయ – కటక
ధరణి పతిపుత్రి నెట్లు నేమరవగలను ?॥

రామకృష్ణకవి :

ఊరటజెందవలయును. సార్వభౌము లూరటజెందవలయును—

సార్వభౌముడు

మిత్రమా! ఎటుల నూరటజెందగలను ? నాకీ జీవితములో నింకను నూరటయా ?

(నడచుచునే యాగి) అశయునగృహాములో నా ప్రియతమనన్ను గురుతించిన నిముషములో మూర్ఛిల్లుటకు ముందా కోమలాంగి వదనదర్పణములో ప్రతిఫలించిన భావతరంగములు నా హృదయఫలకమును బ్రద్దలు జేయుచున్నవి. హతవిధీ!

ఆ లలితాంగి, హృద్గతమునంతయు నప్పుడ జూపులందు, ను
ద్వేలములైన భావముల పెంపున జూపుచు-ఝుంఝుయందు, గ
ల్లోలితవార్ధిమాడ్కి, గళలుందొలగంధరగూలె, మూర్ఛనిం
కేల మదీయజన్మ? హృదయేశ్వరి దుర్వ్యథ పాలొనర్చితిన్॥

ఈ దుఃఖావేశముతో నేనింకను జీవింపగలనా ? సఖా !

రామకృష్ణకవి :

(ఓదార్పుగా శ్రీ సార్వభౌముల ననునయింపుచు) వార్ధిగంభీరులగు శ్రీవారింత జింతింపుచు బ్రాకృతుని పోలిక దుఃఖమగ్నులైనచో- నిక సామాన్యుల విషయ మేమని జెప్పనగును-

సార్వభౌముడు :

నాకిట్టిజింత యుండుటయే నేరమందువా ? మహాకవీ !

రామకృష్ణకవి :

నేనటులనగలనా సార్వభౌమా ? మిన్నువిరిగి మీఁదబడినను చలింపని మీరలే- ధీరోత్తమమహానాయకులగు మీరలే- యింతటి వంత నొందుచుండుటంత బాగుగా నుండలేదని మనవి యొనర్చుకొను చున్నాడను.

సార్వభౌములు :

అయిన నన్నిందుల కేమిచేయమందురు ?

రామకృష్ణకవి :

(ఆలోచింపుచు) అన్నియును బూర్తి జేయుట కా మహామహుడు తిమ్మరుసుమంత్రిశేఖరు డున్నాడుగదా! భారమెల్ల వారిపై నుంచుడు చాలును.

సార్వభౌముడు :

(దీర్ఘముగా నిశ్వసించి) అటులే- అదియు జూచుదమని యోర్పు వహింపుచున్నాడను గాని- దుఃఖసముద్ర మప్పుడప్పుడు నెత్తుగా బొంగి, నన్ను ముంచివేయుచున్నది.

రామకృష్ణకవి :

(చింతతో) ఇటువంటి పట్టులనే మన యోర్పు మిగుల నవసర మగుచున్నది - యించుకయూఱడిల్లుడు - ప్రభూ - కొద్దికాలమూఱట గాంచుడు.

సార్వభౌముడు :

(విసుపుతో) యేమి యూరటయో- మరల మూర్ఛవచ్చునటు లున్నది- (సోఫాపై శయనించి కన్నులు మూసుకొనును) —తెరవ్రాలును.

[ ప్రవేశకము ]

(మారువేషమున నొక చారనాయకుడు ప్రవేశించుచున్నాడు)

చారనాయకుడు :

(తనలో) మా ప్రధానామాత్యులు నన్ను పిలిపించి, యాజ్ఞాపించినారుగదా ! "నీవు కటకేశ్వరపుత్రిక యున్న యెడకేగి, నీవు కటకేశ్వరుని దివాణములోని నమ్మకమైన యుద్యోగివలె – నీ వేషభాషలయందెల్లను నుత్కలదేశస్థుడే యీతడను నమ్మకము పూర్తిగా గలుగునటుల నటింప వలయును. మన మహారాణీవారి తల్లిగారు తన కొమరితకొక లేఖ వ్రాసి నీ చేతికిచ్చి యంపినటుల వారి కెల్లరికిని, పూర్తిగా నమ్మకముబుట్ట నటించి, మన మహారాణీవారిని దర్శించి, వారికీ లేఖ నొసగి, వారిచ్చిన ప్రత్యుత్తరమును గొని శీఘ్రముగ రావలసినది – మేమీా సమీాపమున చిట్టడవిలో శ్రీ సార్వభౌములతో గలిసియే నీకొఱకెదురుజూచుచుండగలము అని నా కాజ్ఞాపించినారు. వారి యానతి ననుసరించి, నేను శ్రీ శ్రీ మా మహారాణీవారికడకేగి నిజమగు నుత్కలునివలె నటించి వారి దర్శనమొనర్చుకొని యీా లేఖ నొసగినాను. దానికి జవాబు నొసగుటకే మొట్టమొదట మా మహారాణీవారు నిరాకరించి పొమ్మని కోపించినారు– కాని కడకు చెలికత్తెల విశేషానురోధమున నిదె యీా లేఖ లిఖించి యిచ్చినారు– యీా చిట్టడవిలో శ్రీ శ్రీ సార్వభౌములవారితో గూఢి మహామాత్యు లెచ్చట నుందురో వెదకి వారికీ లేఖ నందీయ వలయును. పొద్దు చాలదు. వేగముగ వారిని వెదకుదుగాక–

(వెదకుచు నిష్క్రమించును)

—ఇది ప్రవేశకము.

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## ఏకాదశాంకము

### రంగము ౧

(ఆ చిట్టడవిలో నొక చెట్టుక్రింద గూరుచుండి తిమ్మరుసుమంత్రియు, శ్రీకృష్ణదేవరాయ సార్వభౌములును రహస్యముగ సంభాషించుకొనుచుందురు)

(కొంచెము దూరములో సార్వభౌముని స్కంధావారముండును)

తిమ్మరుసుమంత్రి

వత్సా! మహారాణివారంపిన లేఖను పరికించిచూచితివిగదా!

శ్రీకృష్ణరాయ సార్వభౌములు :

లేదామె లేఖను జదువజాలక పోయితిని.

తిమ్మరుసుమంత్రి.

ఇది తమతల్లి వ్రాసియంపిన లేఖకు జవాబు – అనగా – నాయమ తల్లి వ్రాసినటుల మనము వ్రాసి పంపిన లేఖకన్న మాట "మాతృశ్రీ పూజ్యమహాదేవి, పద్మావతీ మహారాణివారి పాదపద్మముల సన్నిధికి – మీపాలిటకు మరణించినదగు మీతనయ తుఖ్ఖాదేవి శతసహస్ర ప్రణామ పూర్వకముగా వ్రాసికొనిన విజ్ఞాపనలు. తల్లిగారూ – నేనిచట నడవులబట్టి యవస్థలనందుచుండుట లేదు. మీరు

భావించు కష్టము లేవియును నేనొందుటలేదు. నాపతి రాజ్యములో ప్రశాంతపరిస్థితిలో మేమిచట నివసించుచున్నాము. ఇప్పటికైన మాటి మాటికి మీరెవ్వరు నాజోలికిరాక - నన్ను నా యిచ్ఛవచ్చినటుల బ్రతుకనిచ్చుటయే నాకు మీరుచేయగల మహోపకారము. మీకనేక ప్రణామములు. నేనొక మహారాజపుత్రుని పరమోపకారిని, ప్రాణరక్షకుని మనఃపూర్తిగా ప్రేమించియుంటిని. ఆ రాజపుత్రుని వెదకించి నన్నాతనికిచ్చి వివాహమొనర్పుడని మీపాదములబ్రాలి ప్రార్థించినపుడు మీకు నాపై గలుగనిజాలి యీనాడు మీకు గలిగినదా? నా యభీష్టమును దీర్పలేకపోగా - బలవంతుడగు శత్రురాజొకడెత్తి వచ్చినపు డాతనిధాటికి భీతిజెంది, నన్నాతనికిచ్చి వివాహమొనర్చినారు. నేనేమైన మాటాడితినా? మీరు నన్నొకగాజేసి యొక శత్రుసైన్యమును గబళించు నూహ బ్రవర్తించినపుడు మాత్రమే సేనాపని యొనర్పజాలనని నిష్కర్షగా జెప్పితిని, అతడు నీచవంశజాతుడగు దాసీపుత్రుడనియును - వానికి భార్యగా బ్రతికియుండుటకంటెను-వానింజంపి నేను జచ్చుటయే మీసుక్షత్రియ వంశగౌరవమునకు మచ్చుతునక యనియు. పితృపాదులును మీరునుగూడ నన్నెన్ని విధములుగనో నిర్బంధించినారు. నేనేమాత్రమును వినక నెదురుతిరుగుటతో, నాచెలికత్తెలను లోబరచుకొని వారికావిషమును దలకెక్కించి, నావెంటనంపించి, మీపట్టుదల నెరవేర్చుకొనినారు. కాని తిమ్మరుసుమంత్రియొక్క బుద్ధిబలముచే బరిరక్షితుడగు నీరాజసింహుడు మీ వెట్టిమొట్టి కుతంత్రములకు లోబడి చచ్చిపోవుట సాధ్యమేనా? అని యేమాత్రమును యోజింపరైతిరి. శయ్యాగృహమున నా రాజకుమారునివలెనే శయనింపజేసియున్న సాలభంజికను గురుతింపజాలక మీరంపినవారు భ్రమపడి యాతడే రాజకుమారుడనుకొని కత్తులులాగి పొడిచిచంపితిమని సంతసపడిరిగాని, యింతలో రహస్యముగ దాగియున్న రాజ మంత్రు లేతెంచుటతో, వారి శరీరములు వడకసాగినవి. నిజము బయటపడినది.

పరరాజును యుద్ధములో జయింపజాలక, తమపుత్రికనిచ్చి పెండ్లి జేసి యా పుత్రికచేతనో నామె యామోదింపకున్న చెలిమికత్తెల చేతనో నాయల్లుని జంపింపనెంచిన మీ సుక్షత్రియ వంశగౌరవము గొప్పదా ? తానను కొని తన ప్రతిమపై కత్తులుదూసి నరికినవారిని గూడ క్షమించి, సిగపూవునలగకుండ, సగౌరవముగా నావలకంపించిన యుదారమూర్తులగు వీరి, సుక్షత్రియవంశగౌరము గొప్పదా ? ఆలోచించితిరా ? ఇష్టములేనివారిని, విరోధమున్నవారిని నీచకులజులని యారోపించి నిందించుట ప్రాకృతజనముల యలవాటు – మీరేయుద్దేశముతో నన్నీమహారాజునకొసగినను, నా ప్రాణసంరక్షకుడే నాకు పతిగాలభించినాడు – కాని గురుతించుటలో కొంచెమాలస్యమైనది. మహామంత్రుల యాజ్ఞచే నిప్పుడీ దీక్షనుబూని యున్నాను. ఆ మహారాజ చూడామణి యనుగ్రహ మేనాటికైన గలిగినచో నావంటి ధన్యురాలీ జగత్తున నుండదు. పరమేశ్వరుడున్నాడు. ఆ మహనీయుని యనుగ్రహము పరిపూర్ణముగ నాపై బ్రసరించినది. కాలితో దన్నిన బూలపాన్పుపై బడినటుల మీరెంతకపటబుద్ధితో నావివాహమొనర్చినను – నా జీవితేశ్వరునికే – నాపతిదైవమునకే నన్ను గట్టబెట్టినారు. మీకివేనాహృదయపూర్వక నమస్కారములు, నేను నా భర్తృ దేవుని రాజ్యమున నే నివసింపుచున్నాను. వారి నీరే త్రావుచున్నాను. వారిగాలియే బీల్చుకొను మన్నాను. నాకంతమాత్రముచాలును. మీకు జన్మించిన నాకంతకంటె నెక్కుడాశపడుట కధికారములేదు. ప్రత్యక్ష పతిసేవ నాకులభింపకున్నమానె. నా భావనాపతిని మృత్యువుదప్పనానుండి వేరుపరుపగల శక్తి యీ భూమండలమునలేదు. ఈనాదేహమున బ్రాణములుండగా – నాపతిదేవుని రాజ్యపుటెల్లనుదాటి రాజాలను. నాప్రాణములీగడ్డపై బోవలయునేగాని వేరొండువిధముగా గాజాలదు. నన్నేలుకొనుగాక, పరిత్యజించుగాక, ఎట్లులైనను నేను నాహృదయ నాథుని పాదదాసిని మాత్రమే –

ఇక నెట్టిలేఖలుగాని, మీరునాకిరవబని లేదు - నన్నునాయిచ్చ వచ్చినరీతిగా బ్రదుకనిచ్చుటకుగాను - మీకివే నా శతసహస్ర సాష్టాంగ నమస్కారములు.

ఇట్లు తుఖ్ఖాదేవి-

కాదుకాదు-నాప్రాణేశుని యన్నపూర్ణ,

శ్రీకృష్ణరాయసార్వభౌముడు

(విని దుఃఖవ్యగ్రుడై) అప్పాజీ! ఇపుడేమందురు ?

తిమ్మరుసుమంత్రి :

వత్సా ! అనుటదేమున్నది ? మహారాణీవారి దర్శనమున కేగుచునే యుంటిమిగదా !

సార్వభౌముడు :

నేను మూర్ఛనుండి తేరుకొనులోపలనే మీరాసుకుమారికీశిక్ష యొసగి పంపించివేయకుండిన బాగుండెడిదేమో ?

తిమ్మరుసుమంత్రి :

నిన్నా విషయ మిన్నిదినములుగా హృదయమున బీడించుచున్న సంగతినేను గురుతింపక పోలేదు. సింహాచలమున మీకిరువురకును ఘటిల్లిన పరిచయమాదినేనన్నిటిని దెలిసికొనుచునే యున్నాడను - కావుననే కటకప్రభువున కాలేఖ వ్రాసినది.

సార్వభౌముడు :

కటకేశు సుతయే అన్నపూర్ణాదేవియని దెలిసియున్నచో నాకేల తెలియపరుపనైతిరి-అటుల దెలియజేసియున్నచో.

తిమ్మరుసుమంత్రి :

అటుల తెలియజేసియున్నచో - కటకముపయి దండయాత్ర జరుగకయే యుండెడిది - వత్సా నిజముజెప్పుము - నీప్రాణప్రియ ప్రతాపరుద్రగజపతి పుత్రికయని ముందుగానీకు తెలిసియున్నచో నీవుత్కళముపై దండెత్తిపోవ నంగీకరించియుండెడివాడవేనా ?

సార్వభౌముడు :

ఏమో ? కటకముపై యుద్ధమునకు నేనుత్సహించి యుండెడి వాడనుగాననుకొందును.

తిమ్మరుసుమంత్రి :

అంతదూరమెందులకు - నీవూహించినటుల నాకు మహారాణీ వారికిప్రవాసశిక్ష విధింపవలయునను దురుద్దేశములేదు - కాని, నా సార్వభౌముని గాపాడుకొనదలచినచో నాపనిజేయక తప్పినదిగాదు.

సార్వభౌముడు :

అప్పాజీ ! మీరట్లేలదలచుచున్నారు ?

తిమ్మరుసుమంత్రి :

నాకు మహారాణివారిపై నపనమ్మకమెంతమాత్రమును లేదు. ప్రతాపరుద్రుడు నిన్ను పరిమార్పవలయునను కక్షబూనినాడు. ఆతడు చేయనెంచిన పని నంతంతమాత్రమున వదలిపెట్టువాడుగాదు- చెలికత్తె లిర్వురుమాత్రము బయటపడినారు. మహారాణివారివెంట కటకము నుండి యసంఖ్యాకదాసదాసీ జనమే తెంచియున్నది - దాసుల గూర్చి భయములేదుగాని, దాసీజనమెప్పుడును మహారాణీవారివెంట నంతః పురమునందు చరించుచుండుగదా ! వారెట్టివ్యూహముల బన్నుకొని యుండిరో - కటకేశుడు వారిలో నెవరికెట్టి యేర్పాటులొనర్చి పంపి

యుండెనో ? మనమెరుగజాలముగదా ? నేను బహిఃపురమునందెల్ల బ్రతిక్రియల నొనర్పగలనుగాని, అంతఃపురమునందు నేనేమి జేయుటకును వీలుండదు - అందుచే నాయమను కొన్నిదినములు ప్రవాసమంపి, మన వేగులనచటికి మారువేసములచే బంపించిన నెవరెవరిమనసులో నేమేమి దాగియున్నదిగూడ బయల్పడును - అట్టియుద్దేశ్యముతోడనే నేనా మహాదేవిని ప్రవాసమునకంపుటకు బాధ్యుడనైతిని. ఆయమను నా సార్వభౌమునికి స్మృతిగల్గునందాక నచ్చటనుండ నిచ్చినచో - ప్రవాసమునకంపుటయే సాధ్యమయ్యెడిదిగాదు. నిజమని యొప్పుకొందువా ?

సార్వభౌముడు :

అప్పాజీ ! ఒప్పుకొనుచున్నాను-నిజమే

తిమ్మరుసుమంత్రి :

ప్రొద్దుగ్రుంకవచ్చుచున్నది. ఇకబయలుదేరి గ్రామములోనికి పోవుదము ?

సార్వభౌముడు :

అటులేకానిండు - (లేచియిద్దరు నిష్క్రమింతురు.)

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## ఏకాదశాంకము

### రంగము ౧

శ్రీకృష్ణరాయ సార్వభౌములు : ప్రవేశము

ప్రవేశము (అతిధిశాలకెదురుగా సేవకులిద్దరు)

[అటునిటునడయాడుచున్న సార్వభౌముని గాంచి) ఎవరయ్యా మీరు ?

సార్వభౌముడు :

ఈవూరివాడనుగాను మార్గస్థుడను ఇచ్చటికి వచ్చుసరికి చీకటి పడినది. ఈరాత్రికి నివసించుటకిచట వసతులేమైన గలవేమోయని పరిశీలించుచున్నాను,

సేవకులు ;

(ఒకరితోనొకరు) యెవరోగొప్ప మహారాజులాగున్నాడు. (సార్వభౌమునితో) ఇది అతిథిశాల – ఈరాత్రికిచటనుండవచ్చును. భోజనము పెట్టెదరు. పండుకొనుటకుగూడ చోటున్నది. పెత్తనదారు నడిగిన మంచముగూడ దొరకవచ్చును. మీరుండదలచుకొంటే మూడు రోజులదాకా పొమ్మని చెప్పరు, లోనికిబొండు.

సార్వభౌముడు :

ఈయూరి పేరేమి ? ఈయతిథిశాల నెవ్వరు నిర్మాణ మొనర్చి నారు ? పెత్తనదారెవరు ? ఆయన యెక్కడనుందురు ?

సేవకులు :

అయ్యా ! ఈ వూరిపేరు కృష్ణరాయప్రోలు అంటారు-దీనిని మా మహారాణీవారు నిర్మించుకొని ఇచట నే కాపురముంటున్నారు-ఈ అతిథి శాలగూడా వారి ధర్మమే దీనిమీద పెత్తనదారు - అమ్మగారి పురోహితులు అయ్యవార్లె- వారీ దగ్గరలోనే వుంటారు - వారిదగ్గరికి తమరిని తీసుకొనిపోయి చూపించమంటారా ?

సార్వభౌములు :

వలదు-కాని మీ మహారాణీవారి నివాస మెక్కడ ?—

సేవకులు :

మా మహారాణీవారు మగవారి కెవ్వరికిని దర్శనమియ్యరు - మగ వారిలో ఆ పురోహితులయ్యవారికిన్ని - సింహాచలమునుంచి వస్తుంటాడులే స్వాములవారు గురుదేవులు ఆ అయ్యవారికిన్ని మాత్రమే ఆ యమ్మ దర్శనం చెయ్యడానికి వీలవుతుంది- మరే మగపురుగుగాని లోపలికి వెళ్ళడం మే- మెరగం బాబూ !

సార్వభౌములు ;

వారి దర్శనం చేయడం సాధ్యం కాదన్నమాట?-

సేవకులు :

తమ కేదైనా పనులుంటే ఆ పురోహితులయ్యవార్లతో గాని లేకపోతే ఆ యమ్మగారిదగ్గర వుంటుండే దాసీవాళ్ళతోగాని చెప్పి పంపిస్తే తమ కా వెంబడే జవాబు దొరుకుతుంది-

సార్వభౌముడు :

అటుల నిప్పు డేమియు నవసరము లేదు—

కటకేశుని పురోహితుడు :

(ప్రవేశించి సార్వభౌముని గురుతుపట్టి) దయచేయుడు దయచేయుడు— ఎంతసేపైనది తమరే తెంచి ? ఇటుల నిలువబడియే యున్నారేమి ! మహారాణీవారి భవనమునకు దయచేయుడు— ఇంచుక విశ్రమింతురు గాక— (వినయముతో - రాణిగారి సౌధమునకు దోడ్కొని పోవును)

సార్వభౌముడు :

మహారాణీవా రెచ్చట నున్నారు ?

క॥ పురోహితులు ;

వారిప్పుడాశ్రమములో జపనిష్ఠతో నుండెదరు. ఈ నడుమ వా రాయాశ్రమమును వదలి యెచ్చటకును వచ్చుటయే లేదు – దమరీ సౌధమున నించుక విశ్రమించి యుండుడు – నేను వెళ్ళిపరిచారికలతో జెప్పి స్నానభోజనాదికముల కేర్పాటులు చేసి వచ్చెదను.

సార్వభౌముడు :

అట చావిడిలో గోడలకు వ్రేలాడదీయబడియున్న చిత్రములను దిలకించి (తనలో) ఈచిత్తరువులెల్ల నా యన్నపూర్ణాదేవిచే లిఖింపబడినవని భావించుచున్నాడను— (విచారముతో)

ఈ మొదటి చిత్రముపేరు "ఈశ్వరాజ్ఞ" దీనిక్రింద వ్రాయబడిన

"చరన్వనాంతే నవమంజరీషు
నషట్పదోగంధ ఫలీమజిఘ్రత్
సాకింనరమ్యాసచకిం నరంతా
బలీయసీకేవల "మీశ్వరాజ్ఞా"

ఇక రెండవచిత్రముపేరు "నిష్ఫలము."

"నిరర్థకం జన్మఫలం నళిన్యాః
యయాన దృష్టస్తు హిమాంశు బింబః
ఉత్పత్తి రిందోరపి "నిష్ఫలాహి"
దృష్టావిని ద్రానళినీ నయేన"

ఇందలి పుంలింగస్వారస్యముచేత ఆ నిష్ఫలత నాదేయగుచున్నది.

(మరల పరికించి) ఈ మూడవ చిత్రముపేరు. "విధిచేష్ట" అహో దీనిక్రింద నీశ్లోకమున్నది –

"విభ్రమ్య కానన మసాదివ సావసానే-
త్వయ్యేవ షట్పదయువా హృదయంబ బంధ
త్వం చాపిచే న్నళిని మానమురీ కరోషి
కస్స్యాదహో మధులిహో హ్యధునావలంబః"

(మరల నొకమారా చిత్తరువులను వాటిక్రింది యాశ్లోకములను చదువుచుబోయి)
ఇక నాప్రాణప్రియాదర్శన మొనర్పక నిముసమేని జీవింపజాలను.
(యున్మత్తునివలె బర్ణశాలలోనికేగి యన్నపూర్ణాదేవిని సమీపించును - మండు చున్న నెగడు సమీపమున కృష్ణాజినమున గూరుచుండి, కాషాయవసనధారిణి, అసంస్కృతకేశకలాప, ఏకవేణీధర, కృశశరీర, అన్నపూర్ణాదేవి, నిమీలితలోచనములతో సమాధి నిష్ఠయందుండి ప్రవేశింపుచున్నది)

సార్వభౌముడు.

(పరికించిచూచి దిగులుతో తనలో) ఈ సుకుమారి కీస్థితి గలుగుటకు కారణము మేమేగదా! నా పదధ్వనికిగూడ నీ రాజపుత్రికి బాహ్యస్మృతి కలుగకున్నది. సమాధినిష్ఠలో నున్నది. శ్రీ గురుదేవులవారి శిష్యత్వమును వారిదగ్గర నొందిన యుపదేశమును వ్యర్థముగాలేదు బాహ్యస్మృతి గల్గునంతదాక వేచియుండెదగాక. (పరిశీలనగాజూచి నిట్టూర్చి) అకటా! నా హృదయరాజ్ఞి! అన్నపూర్ణాదేవి! గురుతింప

వీలుకానిరీతిగా మారిపోయినదిగదా! శుష్కించిన తనువల్లితో - జడలుగట్టుకొనిపోయిన. కేశసంపదతో - కాషాయవస్త్ర కమనీయ తతో - మూర్తీభవించిన కరుణరసమో యన దర్శనమిచ్చుచున్నది.

ప్రచ్ఛన్నంబుగ బండుటాకు మెయిగప్పన్గాంతి గోల్పోయి, గా
ఢచ్ఛన్నాంబు హిమంబు ముంప, వసినాడన్వహ్ని దీప్తిచ్ఛటన్
స్వచ్ఛందంబుగ రాల సిద్ధమగు పుష్పంబట్టులన్ దైన్యమి
ట్లాచ్ఛాదించిన మూర్తి, దేవి, మది కాయాసమ్ము గల్గించెడున్॥

సుందరీమణుల విషయమున నీస్థితియు నొకవిలక్షణమగు శోభా రమణీయతనే సమకూర్చుచున్నయది.

నాచుచే గప్పబడియు - కాంతము సరోజ
ముజ్జ్వలము పండుటాకులందున్న సుమము
జలదమునడాగి శోభనొసంగు శశియు-
కావి గుడ్డల, బ్రియమోదకారిణియగు ॥

వాడి కృశించియు న్వదనపంకజ మెంతయు శోభనిచ్చు, బూ
బోడి శరీరవల్లి పరిపుష్టముగాక కృశించి, వేదనం
బోడిమి దప్పియున్న నతిమోదము గొల్పెడు, గావిపుట్టమీ
చేడియగట్టి, యెంతయు విచిత్రముగా నొకసొంపు నింపెడిన్॥

(ఆయమ స్థితిగాంచినంత నుబుకుకొని వచ్చుచున్న గుండెను అదిమిపట్టి దుఃఖముతో)
అహో! విధి యెంత బలవత్తరము

పసిడి క్రొంబట్టు వల్వల నెప్పుడున్దాల్చు
చాన ! కాషాయ వస్త్రంబుగట్టె
శశికాంత హర్మ్యవాస మొనర్చు రారాజు-
కూతురు తాటాకు గుడిసెనుండె
దాసీసహస్ర సంతత సేవ్యమాన యీ
సుకుమారి, తాదపస్సున మెలివడె
రాజాధిరాజ సామ్రాజ్ఞీ శ్యవ.ంతక
మడవిపల్లెలలోన యిడుములొందె.

జగతినెత్తావు లన్వేదజల్లి వెలయు
నందనోద్యాన ఫుల్లమందార కుసుమ
మగ్నిలో వ్రేల్చినటుల - క్రూరాత్మకుండ
నీ సతిని, గష్టవహ్ని పాల్జేసి నాడ॥

అన్నపూర్ణాదేవి.

విస్మృతావస్థలోనే - అంతరంగికమైన వేదనతో గడగడ వడకి - హాయని యచ్చరించుచు దూలి ముందరనున్న సెగిదుపై బడిపోవును)

సార్వభౌముడు.

(వేగముగనేగి, నిప్పంటుకొని మండుచున్న యామె చెరగును, చేతితో నలిపి చల్లార్చి, యామె నీవలకులాగి పైయుత్తరీయపు చెంగుతో విసరదొడగును)

అన్నపూర్ణాదేవి :

(బాహ్యస్మృతిగలిగి, కనులుతెరచిచూచి, పురుషుడొకడు తనచెంతనుండుటను సహింపజాలక, విద్యుద్వేగమున లేచి కూరుచుండి) ఎవడవు నీవు ?

సార్వభౌముడు :

దేవీ ! నీదాసుడను ?

అన్నపూర్ణాదేవి :

(గురుతించి) తమరా ? విద్యానగరసార్వభౌములా ? (శాంతించును)

సార్వభౌముడు

(ఖిన్నుడై) ఆ యధికారంభారమునిప్పుడు మోయుచుండియు నిరపరాధులకు శిక్షపడకుండజూడజాలని యసమర్థుడను, అభాగ్యుడను.

అన్నపూర్ణాదేవి :

తమరిచ్చటికెప్పుడు వేంచేసితిరి.

సార్వభౌముడు :

దేవీ ! నన్నిప్పటికైన క్షమింపజాలవా ? (దోయిలొగ్గను)

అన్నపూర్ణాదేవి :

(సార్వభౌముల పాదములపైబడి యేచ్చుచు) శ్రీవారు మమ్ములను క్షమింపదగుదురుకాని, తమరిని క్షమింపనేనెంతదానను – అపరాధము జరిగినది. మావైపుననని నేనెరుగుదునుగదా !

సార్వభౌముడు :

(నిట్టూర్చి) ఎవరపరాధులో ? ఎవరెవరిని క్షమింపదగినవారో ఆ పరమాత్మ యెరుగును నీవు దేవీస్వరూపవు, నా యందను గ్రహింపుము.

అన్నపూర్ణాదేవి :

నే ననుగ్రహించుటయా ? సార్వభౌమా ! నే నెప్పటికిని మీ పాదదాసినేగదా ! నా హృదయపీఠమునం దెల్లప్పటికిని, దమ మూర్తిని బ్రతిష్ఠించుకొని యర్చన సేయుచున్నానే ? ఈ నాహృదయమును జీల్చిచూచుడు, మరొక్కరి ఛాయయైన నిందగుపడునేమో పరిశీలింపుడు. నే నొనర్చు నీ తపస్సుగూడ ప్రత్యక్ష దైవస్వరూపులగు–మిమ్ములనుగూర్చియేగాని వేరుగాదే– అయినను న్నాదొక్క మనవి గలదు–

కోరి చిరవాంచితమ్ము శృంగార రసము.
బట్టుదలమీఱ దొలగించివైచి, హృదయ
మందు వైరాగ్యమును నింపినట్టి నాకు
మరల దమసేవ నెటుసేతు ? మది గలంతు॥

సార్వభౌముడు :

(దుఃఖావేగము నణచుకొని) కాదేని పోనిమ్ము – మాకుమాత్ర మీ బహువిధ దుఃఖనిలయమగు రాజ్యపాలనాదికముతో నేమిపని –

మేమును ఆ భారమెల్ల సప్పాజీ కప్పజెప్పి, మీతోపాటీ యాశ్రమ మున నే దప మొనర్చుకొనుచుండగలము—

అన్నపూర్ణా దేవి :

(రిచ్చవడి నిట్టూర్పుతో నేదియో యాలోచించుచుండును)

తిమ్మరుసుమంత్రి :

(వేగముగా నా ప్రదేశమున కేతెంచను)

సార్వభౌముడు అన్నపూర్ణా దేవియు :

(ఇర్వురులేచి నిలువబడి- గౌరవపూర్వకముగా నమస్కరింతురు)

తిమ్మరుసుమంత్రి :

(ఆశీర్వాదపూర్వకముగా దగఁకుడిచేతిని పైకెత్తి) భారతవర్ష సర్వస్వం సహా చక్రవర్తి కాగల పుత్రరత్నమును బడయుదురుగాక (అన్నపూర్ణా దేవినిగాంచుచు) తల్లీ! తమప్రయాణమున కన్నియును సిద్ధపరుపబడినవి. సుముహూర్తముగూడ సమీపింపనున్నది. వేగముగ దఘదాసదాసీజనములకెల్లను సర్దుబాటులొనర్చుకొని సిద్ధముగుటకాజ్ఞనొసగుడు.

అన్నపూర్ణా దేవి :

(దుఃఖముతో నశ్రువులు జాలువార) తండ్రీ! పరిత్యక్తనగు నేనా పట్టణమునకు మరలనేముఖము బెట్టుకొనిరాగలుగుదును ?

తిమ్మరుసుమంత్రి.

(ఆశ్చర్యముతో) మీరెట్లు పరిత్యక్తలైతిరమ్మా ? మీరాజ్యమున నే నివసించుచు — మీ ప్రజల కష్టసుఖముల కాదుకొనుచు — కన్నబిడ్డలకన్న మిన్నగా — వారిబాధల నివారించుచు వారింబరిపాలించుకొనుచున్న మీరు పరిత్యక్తలెట్లైతిరి ?

సార్వభౌములు :

అప్పాజీ ! మహారాణి తప మొనర్ప వాంఛింపుచున్న యది - నేనును సర్వవ్యాసంగము లవిడిచి. యిచటనే తప మొనర్చుకొనుచుండ నిశ్చయించుకొనినాడను. రాజ్యపాలనాది సర్వభారములను నేటినుండి మీరే వహింతురుగాక -

తిమ్మరుసుమంత్రి.

(మొగమున విచారముదోప శేయుచు - దైన్యముట్టిపడుచుండ)

అపరాధము చేసినవారొకరై శిక్ష మరొకరికి లభించుటయా? నేర మొనర్చినవాడను నేనును-దానికి శిక్ష ననుభవించునది యేపాప మెరుగని మీ రిర్వురునా ?

అది యేమి న్యాయము ! (అన్నపూర్ణాదేవివైపు దిరిగి యంజలి ఘటించి) తల్లీ ! కుపుత్రుడుండునుగాని లోకములో కుమాతయుండజాలదు - ఈ నీబిడ్డ యొనర్చిన నేరమును మన్నింపుము. మా సార్వభౌముని సంతోష పరుపుము. నిన్ను విద్యానగరమునుండి పంపించివైచిన ఘడియనుండియు మా ప్రభువదనమునందు త్సాహమే గాంచలేకపోయితిని, ఆవదనమండల మున మందహాస జ్యోత్స్న యొకనాడును గనలేక దుఃఖించితిని, నా మాట మన్నించి - మమ్ములను కృతార్థుల నొనర్పుము ? ఈ ప్రభుని యర్థాంగివై, త్రిలింగ కర్ణాట సామ్రాజ్యమును, ఈ మా సార్వభౌ ముని హృదయ సామ్రాజ్యమును సర్వదా పరిపాలించుకొనుచుండుము. నా ప్రార్థనను నీవు నిరాకరించితివేని, మరల నీ యనుగ్రహము గల్గు నందాక, నీ యాశ్రమ ద్వారమున బ్రాయోపవేశదీక్షబూని పడియుం దును.

అన్నపూర్ణాదేవి :

(ఆతురతతో) తండ్రీ ! అంతమాటనవలదు - మీ యానతి కెదు రాడగలనా ? మీ యిష్టాను సారమేగానిండు-

తిమ్మరుసుమంత్రి ;

(సంతసమొంది) నే నెరుగుదును – ఈ దుందుడుకు బిడ్డను నాతల్లి కరుణించినది. మీ యంగీకారము తప్పక బడయగలనను ధైర్యము తోడనే వచ్చియున్నాను – నానమ్మకము వ్యర్థముగాలేదు–

అన్నపూర్ణాదేవి :

మన ప్రయాణము విషయమై, శ్రీ గురుదేవుల యాశీర్వచనము గూడ బడయుట, ప్రధానకర్తవ్య మనుకొందును–

తిమ్మరుసుమంత్రి :

తల్లీ ! గురుదేవులే సార్వభౌములకడకు సందేశమంపియున్నారు వారి యాశీర్వాదము నిపుడు ప్రత్యేకముగా బడయనక్కరలేదు.

అన్నపూర్ణాదేవి :

(ఆనందముతో) ధన్యనైతిని – నా జీవితమునందిది మధురాతి మధురమగు నమృత క్షణము–

సార్వభౌముడు :

(పరమానందముతో) మేము ధన్యులమైతిమి. అన్నపూర్ణాదేవి యనుగ్రహ లాభముగలుగుటచే మే మత్యంత ధన్యులము రేపు జరుగబోవు మహోత్సవమునకు, గురుదేవులు గూడ తప్పక వత్తుమని కబురంపి యున్నారు–

తిమ్మరుసుమంత్రి :

(అన్నపూర్ణాదేవితో) తల్లీ! నా మనవి నొకదాని నామోదింపగోరుచున్నాను–

అన్నపూర్ణాదేవి :

మీరు మనవిజేయుట యేల ? ఆజ్ఞాపింపుడు,

తిమ్మరుసు మంత్రి :

మాతృదేవి యెడనంతటి యపచార మొనర్పజాలను. ఇంతకును నేజెప్పున దేమన మీకు మా తాపితసులచే నుంపబడిన తుఖ్ఖాదేవీ నామముగాని, అన్యులెరుగకుండుటకై స్వయముగా మీరుంచుకొనిన యన్నపూర్ణాదేవీ నామముగాని – యచ్చిరాలేదని నా నమ్మకము. కావున నేటినుండి మా మహారాణివారికి, "చిన్నాదేవి" యని నామ కరణము సేయ ననుజ్ఞ దయచేయుడు–

అన్నపూర్ణాదేవి :

(ఆలోచించి) మీ యిష్టానుసారం మేగానిండు. నష్టమేమున్నది!

సార్వభౌముడు :

అప్పాజీ! ప్రయాణలగ్నమునకింకెంత తడవున్నది?

తిమ్మరుసు మంత్రి.

ఇంకనుతడవా? మన ప్రధాన సేనానాయకుడు- పెమ్మసాని రామలింగనృపాలుడు, చతురంగ బలసమేతముగా శ్రీశ్రీ చిన్నాదేవీమహారాణీవారిని దోడుకొనిపోవుటకై యేతెంచి సమీపముననే తన మహాసైన్యముతో సిద్ధముగనున్నాడు, ఇక్కడ శ్రీవారే వారినాహ్వానింప సన్నద్ధతతో నుంటిరాయెను. (వినుటనభినయించి) అవె మంగళ వాద్యములు మ్రోగనారంభించినవి. త్వరలో మనము బయలుదేరి వెళ్లవలయును:

పురోహితుడు :

(ప్రవేశించి) తదేవలగ్నం సుదినం తదేవ–తారాబలం చంద్రబలం తదేవ-విద్యాబలం దైవబలంతదేవ-లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి" అయంముహూర్తస్సుముహూర్తోస్తు, ఇకనాలస్యమునకు వీలులేదు బయలుదేరవలయును.

(యవనికదిగజారును)

ఇ ది ఏ కా ద శాం క ము

ఓమ్

# ఆంధ్రభోజుడు

## (నాటకము)



## పట్టాభిషేకరంగము

(విద్యానగరములోని దుర్గమధ్యస్థమగు సభామండపములో నద్భుతముగా నలంకరింపబడిన భువనవిజయమను సభా మంటపము. చిత్రాంకమునందున్న విధమున నెల్లరును వారివారి యాసనములపై నాసీనులైయుందురు. దైవికాంశయందు నిర్మింపబడియున్న చంద్రకాంతమణి నిర్మిత వేదికపైని రత్నఖచితములగు స్వర్ణసింహాసనములు మూడమర్పబడి సభనెల్ల ప్రకాశింపజేయుచుండును. అందు మధ్యమందున్న సింహాసనమునందు శ్రీశ్రీశ్రీ కృష్ణదేవరాయ సార్వభౌము లాసీనులైయుందురు ఇరువైపులగల యమూల్య రత్నాసనములమీద, చిన్నాదేవియు, తిరుమలదేవియు నాసీనులైయుందురు. ఛత్రధారిణులు చామరధారిణులగు పరిచారికా రత్నములును - స్వర్ణదండధారిణులును - తాంబూల కరండవాహినులగు ప్రతీహారిణులు సార్వభౌమ గౌరవముల ప్రదర్శింపుచుందురు. ఉన్నతసోపానములపై వైచియున్న స్వర్ణాసనములమీద నెదురుగా శ్రీ విభోధానందస్వామి గురుపాదులును - తిమ్మరుసుమంత్రివరేణ్యులును ఆసీనులైయుందురు. అరోహాసనములపై - సామ్రాజ్యమునందలి సామంతమండలేశ్వరులు. ఇతర రాజులయొక్క రాయబారులు - రాజబంధువులు - తదితర శాఖామంత్రులు, దండనాయకులు, సేనాధ్యక్షులు, ఉన్నత రాజోద్యోగులు, రాజ్యమునందలి సరదార్లు. గొప్పగొప్ప శ్రీమంతులు తీరికూరుచుండియుందురు. వారివారి శుద్ధాంతకాంతలు - స్త్రీలకుగాను ప్రత్యేకముగా నేర్పరుపబడిన గదులలో గూరుచుండి, తోరణగండ్లనుండి సర్వమును దిలకింపుచుందురు - సింహాసనమున కెదురుగా బారులు దీర్చివైవబడిన యాసనములపై, మహాపండితులు, కవులు, అష్టదిగ్గజములు, తదితరకళాకుశలురు నాసీనులైయుందురు. వందులు - మాగధులు, వైతాళికులు - భట్టులు - బారులుతీరి నిలువబడియుందురు. దౌవారికులు - వేత్రహస్తులగు సేవకులు సభలో నటనట నిలువజడియుండి సర్దుబాటు లొనర్చుచుందురు. సభాభవన సింహద్వారమున కెదురుగా వెలుపల బారులుదీర్చి, చక్కగా నలంకరింపబడిన గందగజములు, పార

సీకి సైంధవములు మహావీరులగు రౌతులచే నధిష్ఠింపబడి యటునిటు గదలుచు ఘీంకారములను - హేషారవములును సలుపుచుందును. మహావీరులగు సైనికులు ధగధగ మెరియుచున్న యాయుధములదాల్చి బారులుదీరి నిలువబడియుందురు. సభకు వెలుపల దూరముగా మంగళవాద్యములు హృద్యముగా మ్రోగుచుండును. కొంతసేపు మంగళ వాద్యములెల్ల మ్రోగి యాగినంతనే వందులు, మాగధులు, వైతాళికులు సార్వభౌముల కభిముఖులై కైవారములొనర్ప నారంభింతురు.)

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ.

శ్రీశ్రీశ్రీ విద్యానగర రాజధానీ, విభాసుర, భువనవిజయ మహాసభామంటపాంతర విరాజమాన, నవరత్న సింహాసనోపర్యుదయాచలవిలసిత భానుబింబ ప్రభా భాసమాన ప్రతిమాన, వైభవాసీనా!!

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవ.

శ్రీశ్రీశ్రీ అక్షీణదక్షిణాపథాఖండ సామ్రాజ్య పూజ్యసార్వభౌమా!!
జయీభవ —

శ్రీశ్రీశ్రీ ఆంధ్రకర్ణాట రాజ్యధరాలక్ష్మీమనోహరా !
జయీభవ —

శ్రీశ్రీశ్రీ ద్రవిడ కేరళ విషయ వేశ్యాభుజంగా ! జయీభవ !

శ్రీశ్రీశ్రీ కవిపండితబృంద, సకలకళా కుశలసమూహామండనాయమానాభినవాంధ్రభోజా ! జయీభవ ...

శ్రీశ్రీశ్రీ కళింగవంగగౌడ, మాగధయవనప్రముఖ సామంత ప్రభు మస్తక మకుటఘటిత అమూల్యమణి రత్నప్రభాదీపిత పాదపీఠా ! జయీభవ ...

శ్రీశ్రీశ్రీ తుళువవంశపయః పారావారరాకాసుధాకరా !
జయీభవ ...

శ్రీశ్రీశ్రీ నాగాంబికానరసింహరాజు జాయాపతీభాగ్యనిధానా !
జయీభవ...

శ్రీ శ్రీ శ్రీ శత్రురాజేంద్రలతాలవిత్ర మూరురాయరగండ బిరుద
విరాజమానా ! జయీభవ ...

శ్రీ శ్రీ శ్రీ భాషాలంఘిత భూపాలభుజంగా ! జయీభవ – విజయీ
భవ – దిగ్విజయీభవా ...

శ్రీ శ్రీ శ్రీ విమతరాజన్య సమస్తస్థానీ సరగండ స్థైర్యగ్యానతారా !
జయీభవ ...

శ్రీ శ్రీ శ్రీ సకలమూర్ధన్యాభినందిత, మాణిక్యఖచితదివ్యపాదుకాయుగళా!
జయీభవ ...

శ్రీ శ్రీ శ్రీ హైందవ పరమధర్మసంస్థాపనావతారా ! జయీభవ ...
శ్రీ శ్రీ శ్రీ శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమా !
జయీభవ !

శ్రీ శ్రీ శ్రీ తిమ్మరుసుమహామంత్రిసత్తమ నీతిప్రభావపరిరక్షితాసేతు
శీతాచల మధ్య సమస్త రాజ్య విజయధ్వజస్థాపకా !
జయీభవ ...

శ్రీ శ్రీ శ్రీ వైదర్భీసత్యభామాసమేత, శ్రీకృష్ణదేవస్వరూప, కటక
కర్ణాట రాజపుత్రీయుగళ సతీసమేత, సంభావితదివ్యతేజో
విరాజమానా ! జయీభవ ...

"ఈ విజయవేళ, భరతధ
రావలయముదాల్చె, కృష్ణరాయలు, చిన్నా
దేవియు, శుభమతి, తిరుమల
దేవియునుం దనకు దగిన దేవేరులుగాన్॥"

"కరుణాకర ! వేంకట విభు
చరణ స్మరణ ప్రసంగ సంగతమతి ! యీ
శ్వర నరసింహ మహీశ్వ
ర్వర నందన ! కృష్ణరాయ ధరణీనాథా ! !"

జయీభవ......................భవ

"సుధీమధుర వాక్సుధా సుముఖ నాగమాంబాసుతా !
మధు ప్రసవ సాయకస్మయ విరామ రమ్యాకృతీ !
దధివి విధుకామధుగ్ఘనద, దుగ్ధసింధు ప్రధా
వధీరణ పరాయణోజ్జ్వలవదాన్యతా లంకృతా !॥"

జయీభవ......................భవ

అతులక్షాంతిగభీర ! ధీరహిత చిత్తాంభోజ ! భోజక్షమా
పతి విద్యాపరిపాక ! పాకరి పుళుంభద్భోగ ! భోగాధిప
ప్రతితర స్ఫూర్త్యనుభావ ! భావభరిత శ్రీకాంత ! కాంతార
పాతిత కాళింగ కులేశ ! లేశతర వృత్తిక్షీణవైరి ప్రజా ! !

జయీభవ...................భవా

జయీభవ - విజయీభవ - దిగ్విజయీభవా.

(వందులు, మాగధులు, వైతాళికులు, భట్టులు చల్లగా వెనుకకు వెనుకకు నడచుచు ఓసరిల్లుదురు)

(రాజకుల పురోహితుడు లేచి, మంగళాశీర్వాదపూర్ణమగు పళ్ళెరమును చేతులతో దాల్చి సార్వభౌములు మహారాణులిర్వురు నధిష్ఠించియున్న వేదికను మెల్లగా నధిష్ఠించి మేఘగంభీరస్వరమున వేదమంత్రముల నాశీర్వదింతురు)

"సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం - జానదభి
జానత్ సంకల్ప మానం ప్రకల్పమానము పకల్పమా
న ముపక్లుప్తం క్లుప్తం, శ్రేయోవశీయ ఆయుత్సంభూ
తం భూతం - చిత్రఃకేతు ప్రభానాభాన్ త్సంభాన్.

జ్యోతిష్మాగ్నేస్తే జస్వ, నాతపగ్నుస్త పన్నుభి తపన్
రోచనోరోచ మానశ్శోభ నశ్శోభ మానః కల్యా
ణః" - శతంజీవ శరదోవర్ధమాన ఇత్యభినిగమో
భవతి - శతమితి శతందీర్ఘమాయుః-మరుత ఏనా
వర్ధయంతే - శతమాత్మా సంభవతి - శతమనంతం
భవతి - శతమైశ్వర్యం భవతి - శతమితి శతం దీర్ఘ
మాయుః శతమానంభవతి - ప్రతితిష్ఠతి — (సార్వభౌముల దంపతులపై నక్షతలనుజల్లి వెడలిపోవును.)

[సార్వభౌములవారి గురువు. శ్రీ తాతాచార్యులవారు లేచి, వేదిక నధిష్ఠించి అక్షతలు పుష్పములు లాజలు ఆశీర్వచన మంగళద్రవ్యములు దోయిటతో గైకొని, సార్వభౌమ దంపతుల సమీపించి]

పాతువో వాసుదేవస్య
మందహాసో నిరంతరం
రుక్మిణ్యా పాంగాన్ దృష్ట్వాతు
సత్యా వక్ర కటాక్షకాన్॥

శ్రీకృష్ణదేవ స్సాక్షాత్, శ్రీ
కృష్ణరాయ మహీపతేః
చిన్నాదేవీచ వైదర్భీ
సత్యా తిరుమలాంబికా॥

శ్రీ పతిర నిశం పాయాత్
తుళువాన్వయ వార్ధితు హినధామానమ్
కృష్ణ(దేవ, నామానమ్
భారత సార్వభౌమ - మహిమానమ్॥

[ఆశీర్వాద ద్రవ్యములు శ్రీ సార్వభౌములు వారి ఇరువురు దేవులు ముప్పురి శిరములపై జల్లి యాశీర్వదించి చల్లగా దిగివచ్చును].

అల్లసాని పెద్దన మహాకవి :

[లేచి – ఆశీర్ద్రవ్యముల నంజలియందుకొని, వేదిక నెక్కి సార్వభౌమ దంపతులను సమీపించి]

శ్రీ ఖండ శీతనగమ
ధ్యాఖండ క్షోణిమండలాఖండల ! వి
ద్యాఖేలన భోజ ! సుధీ
లేఖద్రుమ ! కృష్ణరాయ లీలామదనా ! !

"వరగుణ చిన్నాదేవీ
తిరుమలదేవీ సమేత ! దివ్య విభవ ! సా
గర వలయి తభూపాలక
భరత ధరావలయకీర్తి ! పావనమూర్తీ ! !"

రక్షణ సేయును మిమ్ముల
నక్షీణ ప్రాభవుండు హరి, శ్రీ దేవీ
వక్షుఁడు, వసుధార మణుం
డక్షయ సామ్రాజ్యమిడి శతాయు వొసగుచున్

[ఆశీర్వచన ద్రవ్యముల నా సార్వభౌముని శిరముపైనను - మహారాజ్ఞీ మణులిద్దరి శిరములపైననుంచి— సగౌరవముగా చల్లిచల్లగ దిగ్గిపోవును-]

(నంది) ముక్కుతిమ్మనకవి :

[లేచి ఆశీర్వచన ద్రవ్యముల నంజలియందు గొని, గౌరవపూర్వకముగా - వేదిక దగ్గరి, సార్వభౌమ దంపతుల సమీపించి]

శ్రీ వేంకటగిరి వల్లభ
సేవాపరతంత్ర హృదయ ! చిన్నమదేవీ
జీవిత నాయక ! కవితా
ప్రావీణ్య [illegible] ! కృష్ణరాయ మహీశా ! ! 

శ్రీ వర్ణనీయ తిరుమల
దేవీ హృదయేశ! యమృతధీధితికుల పా
రావార పారిజాత!! ధ
రావలయ శరణ్య!! కృష్ణరాయ వరేణ్యా!!॥

పరిపాలన సేయుత, నా
కరి వరదుడు, మాధవుండు, కాంతాన్వయ సం
భరితుని, నీశుభచరితుని
నరసింహుని కృష్ణరాయ నాయకమణినిన్॥

[ఆశీర్వచన ద్రవ్యములను సార్వభౌముని శిరముపైనను, మహారాజ్ఞీమణులిద్దరి శిరములపైనను జల్లి, యాశీర్వదించి, సగౌరవముగా, తన స్థానమునకువచ్చి కూరుచుండును.]

తిమ్మరుసుమంత్రి :

(మణిమంజరివైపు సాభిప్రాయముగ గాంచును)

మణిమంజరి :

(లేచినిలువబడి, ప్రక్కవాద్యములవారికి సన్నసేచ్చి శ్రీ విబోధానంద స్వాములకును - తిమ్మరుసుమంత్రికిని శ్రీకృష్ణదేవరాయసార్వభౌములకును, సభకును, నమస్కారమొనర్చి, రంగవేదకనధిరోహించి తగినహంసలో - ప్రక్కవాద్యములు మ్రోగుచుండగా)

తోడిరాగం - జంపెతాళం

ప॥ విజయోస్తు - విజయోస్తు - వీరచూడామణీ
శ్రీకృష్ణ రాట్సార్వభౌమా ॥విజ॥

అ॥ ప॥ సుజనావనా! విబుధ సుకవి జనపోషణా!
గజపతి సుతాహృదయ కంజ పరితోషణా! ॥విజ॥

చర॥ నరసింహ రాజేంద్రనందనా! వరకరుణా
కరా భక్తచందనా!! శ్రీ తిరుమలదేవీ మనోహరా!!
చతుర సరస కవిత్వ సమాదరా!! ॥విజ॥

(అద్భుతముగా పాడుచు నాట్యమొనరించును)

విబోధానందస్వామి :

(సంతసముతో) బ్రహ్మానందయమళి సహోదరియననోపు హృద్యమగుగానము - హావభావభరితమగు నాట్యము - తన్మయత నొందజేసినవి.

తిమ్మరుసుమంత్రి :

(మణిమంజరివైపు గాంచి) మంగళముగూడ నీవంతున కేవచ్చినది.

మణిమంజరి :

[ఆకాశమువైపు చేతులు దోయిలించి ఖేచరీముద్రతో]
మంగళమహాశ్రీ

"చిత్తజభి దంఘ్రియుగ, చింతన కళాధిగత
జిష్ణు సమవైభవ విశేషా !
విత్తరమణామర గవీతరణి భూజలద,
విశ్రుత కరాంబురుహగోష్ఠి
నృత్త మణిరంగతల నీతిమను రాజనిభ
నిర్ఝరదయారస పయోధీ
మత్త గజయూథ మదమగ్న సుఖితాళిరవ
. మాన్యగృహ మంగళమహా శ్రీ॥

(తగ్గాత్ర - తెరలో మంగళవాద్యములారంభమై కొంతతడవు మ్రోగి మ్రోగి నిలచిపోవును.) (వేశ్యలుకొందరు దీపములతోడి పళ్లెరములంగొనివచ్చి మండలాకార నృత్యము సల్పివెడలిపోదురు.)

తిమ్మరుసుమంత్రి.

(శ్రీ విబోధానందస్వామి వారికి నమస్కరించి) భగవదనుగ్రహముచేతను గురుపాదుల యాశీర్వాద ప్రభావమునను, నా సంకల్ప మొకవిధముగా నెరవేరినది. ఈ కలుగుచున్న కళ్యాణ పరంపరలు, మన గురుదేవుల సంకల్పసిద్ధికి నిదర్శనములు. మన గురుదేవుల యాజ్ఞకు శ్రీ విరూపాక్ష

దేవుని యనుగ్రహముగూడ దొరకైనది. తత్ఫలితమే యిదియెల్లనని సంపూర్ణమగు నమ్మకముతో నున్నాడను, ఇక గావలసినదేమియో తమరు సెలవీయవలయును. (అని సాష్టాంగనమస్కారమొనర్చును)

శ్రీ విబోధానందస్వామి.

[నవ్వి] దృఢమగు నీపట్టుదలగూడ నా కారణములలో నొకటి యని నీవుజెప్పుచున్నను మేమెల్లరమును భావింపక తప్పదు, మనమూహించినదానికంటె నెక్కుడుగానే సర్వమును సంపాదితమైనది. ఇక నేమిగావలయును ? అయినను ఇటులగుగాక.

కాలమందున వర్షించుగాత ఘనుడు
సస్య సంపూర్ణ యగుత భూసతి సతమ్ము
క్షోభలేకుండ భారతక్షోణియెల్ల
నీతిబాధల మరచిపోయెడును గాక॥

ప్రథిత నరసింహ శ్రీకృష్ణరాయ సార్వ
భౌములు చిరాయువుగ - భోగభాగ్యములను
గొల్లలాడుచు - సతియుగ ముల్లసిల్ల
నుర్వియంతయు దానేలుచుండుగాత॥

అందరు

తథాస్తు తథాస్తు తథాస్తు అందురు -

శ్రీకృష్ణరాయ సార్వభౌముడు

[పత్నులతో బాటు లేచినిలుచబడి శ్రీ స్వామివారికి నమస్కరించుచుండగా యవనిక దిగజారును]

ఇది - ఆంధ్రభోజుడు అను నాటకమున సర్వమును

ఏ కా ద శా ం క ము

సంపూర్ణము.

---

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, అరండల్ పేట 7-వ లైను, గుంటూరు.